(6) కాయమునువంచి యిదిగో నీకాళ్ళబడెద
సర్వము నిండియుండెడు మాత నీవు
ముందు వెనుకనునంతట వందనములు వేనవేల్ వందనములు
వందనములు మరిమరి వందనములు.

## అతీత మానస శక్తి

(7) ఆకసంబునకు, భూమికి, నడుమ, అతీత మానసశక్తితో
కలుపుచుండె, నఖిలలోక మహేశ్వరుడైన, శ్రీ అరవిందుడు
గృపతోడ నఖిలభూతోపకారకురాలైన శ్రీ జగన్మాత
ఈ మార్గమును దేటతెల్లముగ దెలుపుచుండె.

(8) సంగమునువీడి ముక్తసంసారుడగుచు
చిత్తమును జగన్మాతయందు సుస్థిరము జేసి
కేవలము ఆశ్రమ క్రియలొనర్చువాని పనులెల్ల
యజ్ఞక్రియలై సులభముగ జ్ఞానమందె పరిణమించును.

(9) యత్నములమీద యత్నము లాచరించిన కారణమున
యోగమందలి కాంక్షచే లాగబడుచు కర్మ
ఫలముల యందలి కాంక్షమాని ఆశ్రమము
నందు కర్మల నాచరించు చుండును గర్మయోగి.

(10) యోగమ్మునందు మనశ్శాంతుడుగానుండు మునివరుండు
చిత్తము బరిశుద్ధమున్ జేయుకొఱకు మాని సంగమ్ము
బుద్ధిచే మనసు చేతనాత్మ దేహమ్ముచే నింద్రియములచేత
నిత్యముగ జగన్మాత నియమించిన నియతకర్మములను నాచరించుచు
యోగ సంసిద్ధి బడయగలడు.

# శ్రీ మాతా అరవింద -
# - ప్రబోధగుచ్ఛము

(మూడవ భాగము)



(15-8-1972 అమృత ఘడియలో వెలువడుట)



రచయిత:
చక్కా సత్యనారాయణ

# విన్నపము

ఈ గ్రంధ ముద్రణ వ్యయమునకు అర్ధ భాగము శ్రీమాత, శ్రీఅరవిందుల పట్ల భక్తి విశ్వాసముగల మిత్రులిచ్చిన ధనమున్నూ మిగతా అర్ధ భాగమూ, ప్రబోధ గుచ్ఛము 2 వ భాగము పుస్తకముల విక్రయ ధనమున్నూ కలపి, ఇపుడీ గ్రంథ రూపమున తృతీయ ప్రబోధ గుచ్ఛము, పుష్పముగా ఫలించుట జరిగింది కనుక ఈ గ్రంథములు విక్రయించగా వచ్చిన పైకం అంతయూ ఆశ్రమమునకు అర్పించెదను.

శ్రీ అరవిందుల వాఙ్మయమందు అమితాదరము — పరిశ్రమగల త్యాగధనుడు పూజ్యనీయుడైన శ్రీ చలసాని నాగేశ్వరరావుగారి అనువాదములు ఇందు చాల జేర్చితిని. మిత్రులు శ్రీ A. G. కృష్ణమూర్తిగారి అనువాదము 'అతిమానవుడు' కూడ జేర్చడమైనది. వీరిరువురికి ఉచిత రీతిని కృతజ్ఞత వెల్లడించుటకు మాటలు చాలవు.

ఈసారికూడ నా కోరికను మన్నించి నా రచనను పరిశీలించి తమ అమూల్య అభిప్రాయముల వ్రాసిన పూజ్య శ్రీ దువ్వూరి సూర్యనారాయణ మూర్తి పంతులుగారికి నా హృదయ పూర్వకవందనము లర్పించుకొనుచున్నాను.

దీనిని చక్కగా ముద్రించిన శ్రీ కృష్ణా ప్రింటింగ్ వర్క్సు వారికి నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

ఈ గ్రంధమున ఇంకను ఏవేని దోషములున్నచో జిజ్ఞాసువులు సహృదయులు మన్నింతురుగాక, యనివేడుకొనుచున్నాను.

అపార కృతజ్ఞతా భావముతో ఈ వ్యాస సంగ్రహమను ప్రేమ పూజా గుచ్ఛమును భగవన్మహార్తమగు శ్రీ అరవింద శతవార్షికపవిత్ర దినము (15—8—1972)న, దైవ స్వరూపులైన శ్రీమాత పాద పద్మములపై సమర్పించుచున్నాను.

ఈ గ్రంథమునకు శ్రీమాత యనుమతియు ఆశీర్వాదములుకూడ లభించినందున ప్రతి యాంధ్రుని చేతియందు సదా నుండదగిన గ్రంథము.

చక్కా సత్యనారాయణ

15—8—1972.

ACCNO 1334

# విషయసూచిక

పుట

ఇది భగవన్మహాత్త్మము. యావత్ప్రపంచము తన దీర్ఘసుషుప్తి నుండి మేల్కాని, భగవంతుని జేరు తరుణము. అమెరికా—చైనా; అమెరికా—రష్యా; జపాను—చైనా; ఉత్తర కొరియా—దక్షిణ కొరియా; పశ్చిమ జర్మనీ—తూర్పు జర్మనీ; ఇండియా—పాకీస్థాన్ : వారి వారి వైషమ్యములను సంస్కరించుకొని, శాంతి భద్రతలు నెలకొల్ప నుత్సహించుచున్నవి.

ఈ తరుణమున మిత్రులు చక్కా సత్యనారాయణ మూర్తిగారి కృషి ఫలముగా వారి తృతీయ గుచ్ఛము వెలువడుచున్నది. శ్రీ మాతారవిందులు వ్రాసిన విషయములెన్నియో సులభశైలిని అనువదించి, తర్కించి, విశదీకరించి మన కందజేసిన యీ కృషి శ్రీ మాతారవిందుల యాశీర్వచనములతో శోభిల్లుచున్నది. వారి యనుగ్రహమున బహుజనాదరమును పొందు గాత యని నా ప్రార్థన.

అరోవిల్ రిసెర్చి
లాబొరేటరీలు, పుదుచ్చేరి
10 జులై 1972

దువ్వూరి
సూర్యనారాయణమూర్తి

# 1 9 7 2

# నూతన సంవత్సరము శుభావహమగుగాక!

1. ఈ సంవత్సరము శ్రీ అరవిందునికి నివేదితము.

వారు ఎంతో తేజమును, జ్ఞానమును, శక్తిని ఎంతో ఉదారముగా ఈ భువిపై నవతరింపజేశిరి. అట్టి మహోపకారమునకు ఎలా కృతజ్ఞత సమర్పించుకోగలము? వారి బోధనను మరింత బాగుగా అర్థము చేసుకొని దానికి ఆచరణ రూపమివ్వడం ద్వారానే సమర్పించుకోగలము.

వారి బోధన, బుద్ధికి వెలుగునిచ్చి మార్గమున నడిపించుగాక! అలా జరిగినపుడు ఏది మనము నేడు చేయలేమో, రేపైనా చేయగలుగుతాము.

హృదయపూర్వకముగా సరియగు ప్రవృత్తి నవలంబింతుముగాక! అప్పుడు నిజముగానే ఇది శుభావహ సంవత్సరమగును.

శ్రీమాత 13-12-1971

[గమనిక :- ప్రతి మానవుడు అవశ్యం తీర్చవలసిన ఋణాలలో ఒకటి ఋషి ఋణము. మనకు ప్రకాశము నందించే వారి గ్రంథముల అధ్యయనమే వారి ఋణమును తీర్చే విధానము. ఈ అధ్యయనములో అంతర్భాగమే తదాచరణ కూడ. ఇదొక విచిత్రమైన ఋణము. ఋణ తీర్మానముతో మన సంపత్తి పెరుగుతుంది. అజ్ఞానమును వెళ్లించి విజ్ఞానమును పొందుతాము. అలా వారి విజ్ఞానమునకు వారసులమైనపుడు మన జనకులైన ఋషి పాదులకు ఎంతసంతోషము కలుగుతుందో; అలాంటి సంతోషమును శ్రీ అరవిందునికి కట్టబెట్టడమే మన ఇప్పటివిధి.]

నూతన వర్షము శుభావహముగుగాక!

2. భగవత్సంబంధమును కోల్పోయినపుడు పరిచ్ఛిన్నులు, అసమర్థులు నిస్సహాయులమైన ప్రాణులము మనము. ఇక భగవత్సంపర్కము కలిగి, పరిపూర్ణముగా అతనికే ఆత్మసమర్పణ గావించుకొన్న పక్షములో, సమస్తమూ సాధ్యమై, మన పురోగతి అనంతమగును.

శ్రీ అరవిందుని ఈ శతాబ్ది సందర్భాన ఒక ప్రత్యేక సాహాయ్యము భువి యందవతరించినది. అహంకారమును చీల్చుకొని, వెలుగులోనికి ప్రవేశించేందుకు దాని ప్రయోజనమును పొందెదముగాక!

క్రొత్తసాలు శుభములను గొనివచ్చుగాక!

శ్రీమాత — 1-1-1972

[గమనిక :- 'ప్రత్యేక సాహాయ్యము' ఇది చాల ముఖ్యము. ఈ సహాయము ఎక్కడి నుండి దిగింది? ఇప్పటికీ చైతన్యవంతముగా కార్యరతుడై ఉన్న శ్రీ అరవిందుని యందునుండీ. ఆ శ్రీ అరవిందుని అడుగడుగునా నడిపిన పరమ పురుషుని యందుండీ. వారి సాహాయ్య పాటవముతోనే అహంను అధిగమించి, వారి బోధనలను ఒకటవ దానిలో చెప్పినట్లు పాటించి, తద్విధముగా కృతజ్ఞతా పూరముతో వారి పాదపంకజములను ప్రక్షాళనము చేయగలము.]

3. తన శరీరమును పరిత్యజించినపుడు శ్రీ అరవిందుడు మనలను వదిలివేయనని మాటయిచ్చినారు. నిజానికి ఈ యిరవై యొక్క సంవత్సరాలు వారు సదా మనతోనే ఉన్నారు. ఉండి, గ్రహణశీలురు, తన ప్రభావానికి ఉన్మీలితులైన వారికి సాయపడుచున్నారు.

వారి ఈ జన్మ శతాబ్దియందు వారి సహాయము మరెంత బలీయముగా నుండును. మన హృదయ ద్వారము ఎక్కువగా తెరచిపెట్టి, దాని లాభము ఎలా పొందగలమో చూచుకొనుట మన వంతు పని. మన

విశ్వాసము ఎంతెంత ధృఢము, శుద్ధము అగునో, మనము పొందగల సహాయ్యముకూడ అంతంత ప్రబలము, కార్యకారి అగును.

శ్రీ తల్లిగారు 2-1-1972

[గమనిక :- 2.వ సందేశములో ప్రత్యేక సహాయమును ప్రస్తావించి, 3-వ సందేశములో దానిని పొందే విధానమును తెలియజేయుచున్నారు. ఉన్మీలనము, మరింతఉన్మీలనము: విశ్వాసము, విశుద్ధముగుదృఢతర విశ్వాసము, శ్రీ అరవిందుడు ఇక్కడే ఉన్నారనే విశ్వాసము, శ్రీఅరవిందుడు ఇక్కడే ఉన్నారని సాక్షాదనుభవములో శ్రీ తల్లిగారు అనర్గళముగా చెప్పే మాటయందు విశ్వాసము, మనకు కలుగుతూన్న అనుభవాలకు గురుతర కారణము, శ్రీ అరవిందుని శక్తి సాహాయ్యమే స్థూల పదార్థము కూడ. ఆశక్తి ప్రభావానికి ప్రఫుల్లముకాగలదనే 'విశ్వాసము.']

అనువాదము: చె. నాగేశ్వరరావు

# 1972

## శ్రీ అరవిందుని శత వార్షికోత్సవము

"ప్రయత్న పూర్వకముగా కృషిచేసి శ్రీ అరవింద మహనీయుని శతవార్షికము జరుపుకునేందుకు యోగ్యతా సంపత్తిని మనము సంపాదించు కొందుము గాక !"

(సం) మాతృశ్రీ.

శ్రీ అరవిందులు 1872 ఆగష్టు 15 న కలకత్తాలో జన్మించిరి. వీరి తల్లి పేరు స్వర్ణలతాదేవి. తండ్రి పేరు కృష్ణధనుడు. ఆ పుణ్య దంపతుల నోములపంటయై విరాజిల్లెను. ఆయోగివర్యు డవతరించిన ఆగష్టు 15 న, భారతదేశమునకు స్వాతంత్ర్యము లభించినది. అంతర్ముఖులగు శ్రీ అరవిందుల, చరిత్రమును ఉల్లేఖించబూనుట నిజముగా సాహసము.

పరమేశ్వరుని లీలావిలాస మత్యద్భుతము. శ్రీఅరవిందులు 1947 ఆగష్టు 15 న ఇచ్చిన సందేశ మెంతయో అపూర్వమైనది. "నా జన్మదినమునాడు భారతావనికి స్వతంత్రోదయము కావడం కాకతాళీయముకాదు. నా కృషి ఫలించిందనడానికి పరమేశ్వరుడు దానిమీద వేసిన అధికార ముద్ర !" అని శ్రీ అరవిందులు వక్కాణించారు. ఈ విషయము వారు వెల్లడించే వరకు మనము స్వరాజ్యము మరెవ్వరి వల్లనో వచ్చింది అనుకొనే వాళ్ళము.

1950 డిశంబరు 5 వ తేదీన శ్రీ అరవిందులు దేహ త్యాగము చేసినపుడు శ్రీ తల్లిగారు ఒక అనన్య గోచరమగు రహస్యమును ఆవేదనతో వెల్లడించారు. 'ప్రపంచము కలసి రాకపోబట్టే ప్రజావాహిని శ్రీ అరవిందుని అనుగమించనందుచేత ఆ మహాపురుషుడు అట్టి ఆత్మోత్సర్గమునకు (Supreme Sacrifice) పూనుకోవలసి వచ్చినది అని. దాని ప్రయోజనము ఏమి: అని విస్మృతను మనలో ఉన్న అజ్ఞాన దేవతకు

బలియిచ్చి, మన ప్రగతికి (సూత్రప్రాయముగా) ప్రతిబంధకమును తొల గించారు.

శ్రీఅరవిందుని శతవార్షికోత్సవము గురించి కొంచెము వివరిణ. ఒక ఉత్సవమును జరుపుకోవాలంటే మనకు ద్రవ్యసంపత్తి కావాలి. కాని ద్రవ్యసంపత్తి మాత్రమే సరిపోదు—విశేషించి శ్రీ అరవిందుని విషయములో, శ్రీ అరవిందుడు జీవిత పరివర్తనమునే, లక్షించి, అందు కొరకు తన యావచ్ఛక్తిని ధారపోశినారు. పోస్తున్నారు. వారిది ఒక యోగము. వారిది ఒక సిద్ధాంతము కాదు. ఒక సిద్ధాంతములో విశ్వాస ముంచితే ఎక్కడో, ఎప్పుడో మనకు స్వర్గము లభిస్తుందని చెప్పే మతాలు కొన్ని ఉన్నాయి. శ్రీ అరవిందుని యోగమలాంటిదికాదు. ఇక్కడే ఇపుడే మన జీవితము మారాలి, బాహ్య జీవితముకూడ.

అట్టి యోగానికి మూలపురుషుడు కావడంచేత, వారి శతవార్షికము వారి యోగము లక్షించే జీవిత పరివర్తన ద్వారానే మనము జరుపుకోవాలి. ఈ పరివర్తనమే మనము సంపాదించుకోవలసిన యోగ్యత. అంటే శ్రీ అరవిందులను సేవించాలంటే కొంత వరకైనా మనము చిన్న అరవిందులము కావాలి. వారి నిజమగు ఆధ్యాత్మిక శిశువులము కావాలి!

ఇలా కావడానికి కృషి చేయాలి. ఆ కృషి ఏక లక్ష్యముతో ప్రయత్న పూర్వకముగా చేయాలి. ఆ ప్రయత్న మెలా ఉండాలి? అమ్మ ఒక సందేశములో ఇలా అన్నారు (సారాంశము మాత్రము): శతవార్షి కానికి ఎంతో ఎంతో మంది, నీ వన్నట్లు, వస్తారు. ఆశ్రమ తత్వము వారికి తెలియుటకు మేమేమి చేయాలని కాదూ నీ వడిగినది ? ఔను, ఆశ్రమ తత్త్వముతో వారికి పరిచయము కలగాలంటే ఆ తత్త్వమును, ఆ సత్యమును జీవించు దానిని నీ ఊపిరి చేసుకో. అని ఉపదేశించారు. అందుచేత మనము చేయవలసిన ప్రయత్నము ఆ సత్యమును జీవించడానికి

చేయాలి. అది జీవితములో ఒక భాగము కావడానికి చేయాలి. అదే జీవితము కావడానికి చేయాలి.

ఫలతః, సత్యమును అనుష్ఠించడానికి ప్రయత్నము చేస్తూ, తద్వారా సంపాదించుకొన్న దైవ సంపత్తి రూపమగు యోగ్యతా సంపత్తితో మనము ఆ మహనీయుని శతవార్షికము జరుపు కొందుముగాక!

శ్రీ అరవిందులు ఒకచోట ఇలా అంటారు. ప్రకటనలలో ప్రచారాలలో నాకు నమ్మకము లేదు. అవి నిష్ఠతో చేసే కృషికి విషమువలె హాని చేస్తాయి. అవి ఒక ఉద్యమమును లేవదీస్తాయి. ఆ ఉద్యమము మత పరమైన ఒక శాఖారూపం ధరిస్తుంది. ఇంకేముంది! దానిలోనికి వారూ, వీరూ అనేకవేలకొలది జనులు ప్రవేశిస్తారు. వీరి వలన ఆ గంభీర కృషి కలుషితమై, ఒక తమాషాగా మారుతుంది. ఇట్టి దుష్పరిణామము వలన అవతరించుతున్న సత్య తేజము ఆగిపోయి, మరుగులోనికి ఉపసంహరించుకొని మౌనము వహిస్తుంది. అన్ని మతాలకూ ఈ దుర్గతే పట్టింది. అందుచేతనే అవి వైఫల్యములో పర్యవసించాయి.

Sri Aurobindo's Action అను మాసపత్రిక దేనికొరకు ఉద్దేశింపబడినది? అనే ప్రశ్న ఉదయించగా, మాతృశ్రీ ఇలా సమాధానం అందించారు (దాని సంక్షేపమిది.) "ప్రచారములో (Publicity) విచక్షణ వుండదు. ప్రచారమంటే అర్థంకాని ప్రజలకు అందని విషయాలను గురించి చెప్పబూనుట అవి వారిని ఆకర్షించవు గనుక, వాని సత్య స్థాయిని తగ్గించుతాము. అలా ఎన్నటికీ చేయరాదు. మనసంతృప్తి కొరకు శ్రీ అరవిందుని భావముల, అనుభవముల ఔన్నత్యమును తగ్గించ గూడదు. వాని ఉన్నత స్థాయిలోనేవానిని స్వీకరించి అర్థము చేసుకోవాలి— అని తెల్పుకున్నాము కనుక మనము మన బోధనలను వాని స్థాయియందే ఉంచి, విచక్షతతో వానిని గ్రహించగల వారికే బోధించాలి. ఆ గ్రహణ

సామర్థ్యమే అర్థాలను వేరు చేసి నిర్ణయిస్తుంది. (స్థాయిని తగ్గించక చేసే బోధన సమాచారము. స్థాయిని తగ్గించి అందరిని ఆకట్టుకోవాలనేదే ప్రచారము) ఆరోవిల్లి (Auroville) నివాసులు ఈ విచక్షణను పాటించాలి.

దీనిని బట్టి, మన వ్యక్తిగత సాధనలో కూడ లక్ష్యముపట్ల రాజీ పనికిరాదు. లక్ష్యసాధనకు ఎంత కాలమైనా పట్టవచ్చు. ఆ లక్ష్యమును ఒకేసారి అందుకోవాలనే ఆత్రము పనికిరాదు. దాని వలన ఎక్కడున్న వారము అక్కడే ఉండిపోతాము. అలా ఉండిపోయి కూడా ఆత్మసంతృప్తి కొరకు మనః కల్పనలనే సత్యానుభవముగా భావించుకుని భ్రమకులోనవుతాము. లేక ఎంత కాలానికీ అడుగు పడడంలేదని గుర్తించ గలిగినపుడు నిరాశా నిస్పృహలకులోను గావడం కూడ జరగవచ్చు.

ఇప్పటి 'బుల్లెటిన్'లో ఒకచోట మాతృశ్రీ ఇలా వివరించారు: "1. తమ కొరకే జీవించే వారు. 2. మరొక వ్యక్తి కొరకు జీవించేవారు. 3. మానవాళి కొరకు జీవించే వారు. 4. భగవంతుని కొరకు జీవించేవారు. పై మూడు తరగతుల వారు నిరాశా దుఃఖ సూత్రమునకు బద్ధులయ్యే ఉంటారు. నాల్గవ శ్రేణి వారి కొక్కరికే పరిపూర్ణాభివృద్ధి. ప్రకాశమయ శాంతి నిశ్చయముగా కొనసాగి విలసిల్లుతాయి. ఈ చివరి వారు సుఖము కొరకు జీవించరు. భగవత్సేవ నిమిత్తమే జీవింతురు. అయితే వీరికి లభించే ఆనందము ఆశించిన దాని కంటే ఎంతో అధికముగా ఉంటుంది.

(సంగ్రహముగా వ్రాశాను)

దీనికి కారణం: భగవంతుని సేవించే వారికే భగవత్సంపర్కము లభించి, అహం నశించి, ఆనందం ప్రాప్తించును. ఆ భగవంతుడు మనతోనే ఉండడం ఈ కాలం వారి అదృష్టం!

అమ్మకు ప్రణతులు

# శ్రీ అరవిందుని శత వార్షికము

1. రూపము ధరించవలసిఉన్న భవిష్యత్ప్రపంచముయొక్క సౌందర్య విశేషమును ప్రవచించడానికే శ్రీ అరవిందుని ఆగమనము. ఏ వైభవ ప్రాప్తి వైపుకు ప్రపంచము పురోగమించుతుందో, దానియొక్క ఆశా భావమునుగాక, నిశ్చయభావమును అందించడానికే అరుదెంచారు ఆయన. ప్రపంచము దురదృష్టమువలన గలిగిన ఆకస్మిక సంఘటన కాదు, తన అభివ్యక్తిగమ్యమునకు అభిముఖమైపయనించుచున్న ఒక అద్భుతమది.

భవిష్య సౌందర్యమును ప్రాప్తించితీరుననే నిశ్చయభావము మానవాళికి మిక్కిలి అవసరము. ఆ ధైర్యమునే శ్రీ అరవిందులు మనకు కలిగించారు.

శ్రీ మాత — 27-11-1971

[గమనిక :- శ్రీమాతారవిందులు సాధించవలసిన చరము కార్యము జడప్రాయమైన శరీర పరివర్తనము. తద్వారా శరీరామరత్వము కాని మన అవచేతనలో ఒక పరాజయ భావము పాదుకొనిపోయి ఉన్నది: "ఇంత దనుక ఏ శరీరము అమరముకాలేదు. కావున సకల శరీరాలు మృత్యువాతని ముక్క చెక్కలు కావలసినదే. 'జాతస్యహి ధ్రువో మృత్యుః' అనే ప్రమాణ వచనము కూడా ఉరిమి చూస్తోందికదా!" అనే పరాజయ భావమది. ఈ అవిశ్వాసమే ఒక పెద్ద అవరోధము. దానిని తొలగించడానికే శ్రీ అరవిందుని అనన్యాగమనము.]

2. భగవాన్! నిన్నెలా చేరుకోవాలో, చేరుకొని ఎలా సేవించాలో తెలిపేందుకే శ్రీ అరవిందుడు శరీరము ధరించారు. నీ అనుగ్రహము చేత, భగవాన్ : యథార్థరూపమున వారి బోధనాభావమును ఆకళించుకొని, సంపూర్ణ చిత్తశుద్ధితో అనుష్ఠింతుముగాక!

శ్రీ మాత 6-12- 1971

[గమనిక:- 1, వ సందేశములో శ్రీ అరవిందుని బోధన యొక్క శిఖరాగ్రమేదో అమ్మ సూచించారు. ఆ మార్గాన పయనించి, శరీర

పరివర్తనము సాధించి, భగవంతునికి దానిని (దివ్య జీవితానికి) దివ్యోపకరణముగా సమర్పించుకోవాలి. ఈవిధముగా భగవంతుని సేవించాలి. అనునది శ్రీ అరవిందుడు మనకు చూపారని అమ్మ చెపుతున్నారు. 2. వ సందేశములో]

3. అరుణ కమలము శ్రీ అరవిందుని(స్వీయతత్వానికిచెందిన) పుష్పము. కాని. ప్రత్యేకించి వారి శతవార్షికానికి వారి భౌతిక కాంతి మండలము యొక్క వర్ణమైన నీలకమలమునే ఎన్నుకొందుము. ఏలనన, పరాత్పరుడగు భగవంతునియొక్క అభివ్యక్తి రూపమునకు నూరేండ్లు నిండిన ఈ సమయములో అదే సముచిత సందేశమగును.

మాతృశ్రీ. 21—12—1971.

[గమనిక:— వారి మూలతత్వముయొక్క వర్ణము 'అరుణము' అయినప్పటికి వారి దేహతత్వముయొక్క కాంతి నీలము గనుక నీలకమలమునే తల్లిగారు వరించారు. దేహమునకేగదా ఇపుడు నూరేండ్లు నిండినది....]

4. మనము దివ్య చేతనలో జన్మించగలిగేందుకే శ్రీ అరవిందులు తమ జీవితమును బలిపెట్టారు.

మాతృశ్రీ. 24—12—1971

[గమనిక:— మహాత్ములు తమ బలిదానముతో సామాన్యుల దోషాలకు పరిహారము చెల్లించుతారు. దోషవిముక్తులైన మానవులు, మానవత్వమును విడిచి దివ్యత్వములో పాదము పెట్టడానికి అర్హులౌతారు. ఉదాహరణకు — శ్రీ అరవిందులు జీవించి ఉన్నంత కాలము అతిమానసము, ఎంత చెప్పినా, ఎంత చేసినా నీరద్‌బరన్‌గారికి అంతుబట్టలేదట. కాని అద్భుతము! వారి దేహోత్సర్గమైన వెంటనే ఆ తత్వం తెలిసిందట.]

అనువాదము: చె. నాగేశ్వరరావు.

# 1947 ఆగస్టు 15 - న

## శ్రీ అరవిందు లొసంగిన సందేశము

ఆగష్టు 15 స్వతంత్ర భారతానికి జన్మదినము. ఈ దినము భారతాంబ విషయములో ఒక పాత శకానికి స్వస్తి చెప్పి, ఒక నూతన యుగానికి నాందీగీతము పాడుతోంది. ఈ దినము మనకు మాత్రమేగాక, ఆసియా ఖండానికి, సమస్త ప్రపంచానికి గూడ ప్రాముఖ్యము వహించేదై ఉంది. ఏలనంటే, ఈనాడు భారతదేశము జాతి సమితిలో అడుగిడుచున్నదని మనము గమనించాలి. ఈ ప్రాచీన జాతికి మహత్కార్యములను సాధించగల అమేయశక్తి సంపత్తిగలదు. ఆ మహత్తరశక్తితో సమస్త మానవ జాతియొక్క రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక భవిష్యత్తును తీర్చిదిద్దుటలో ఈ పురాణధాత్రి ప్రముఖపాత్ర వహించవలసి ఉంది.

ఇంతవరకు ఈ దినము నా జన్మదినముగా మాత్రమే నా దృష్టిలో ఉంది. నా సిద్ధాంతము నామోదించినవారు ఏటా ఈనాడు వార్షికోత్సవము జరుపుకుంటూ వచ్చారు. కాని ఈ సంవత్సరము ఆగష్టు 15 ఒక మహత్తర ప్రాముఖ్యమును సంతరించుకోవడం సహజంగానే నాకు సంతోషప్రదము.

ఈ విధముగా ఉభయ తిథులు ఏకంగావడము ఒక సంయోగమాత్రమని గాని, ఒక యాదృచ్ఛిక సంఘటనే అనిగాని యోగిగా నేను భావించడం లేదు; జన్మించినదాదిగా నేను చేపట్టిన కార్యమునకు నన్ను సదా నడిపే భగవచ్ఛక్తి ఒసగిన అనుమతి పత్రమని, దానిపై వేసిన అధికార ముద్ర యని నేను గ్రహించుతున్నాను.

భారత స్వాతంత్ర్యమేగాక, నిజానికి ఎన్నో ప్రపంచోద్యమాలు నా జీవితకాలములోనే సాఫల్యము నొందాలని నేను ఆశించాను. అయితే అప్పటికవి అసంభవమగు కలలుగా మాత్రమే కన్పించాయి. కాని నేడు

నిరీక్షించి చూచినపుడు, అవి సంసిద్ధికి అడుగు దూరములో నున్నవని, సంసిద్ధి పథములో అడుగిడి ముందుకు సాగుతూన్నవని గమనించగల్గు తున్నాను.

ఈ మహత్తర సందర్భమున నన్నొక సందేశ మివ్వమనికోరడం జరిగింది. కాని సందేశ మిచ్చే స్థితిలోలేననే చెప్పాలి. ఏ ఆశయా దర్శాలను నా బాల్య యౌవనాలలో సంకల్పించానో, వేటినిపుడు ఫలోన్ముఖము గావడం పరికించుతున్నానో, వాటిని స్వయముగా వెల్లడించడం మాత్రము ఇపుడు చేస్తాను. ఏలనంటే, ఆ ఆశయాలకు భారత స్వాతంత్ర్యానికి సంబంధమున్నది. భారతావని భావి కార్యమని నేను విశ్వసించుతూన్న దానిలో అవి అంతర్భాగము. వీటి విషయములో భారతాత్మ ప్రముఖస్థాన మాక్రమించక తప్పదు. కారణం, తన లౌకిక ప్రయోజనాలకు పాటుపడేందుకే భారతదేశము అభ్యుదయము నొందడంలేదు, విస్తృతిని, మహత్వమును, అధికారమును, ఐశ్వర్యమును సాధించడానికే అభ్యుదయమునొందడంలేదు; వీటని కూడ అది విస్మరించదుగాని, నిశ్చయముగా ఇతరులవలే పరులపై ప్రభుత్వమును చలాయించడానికిమాత్రము వీటిని అపేక్షించదు. తనఅభ్యుదయముద్వారా భారతము భగవంతునికొరకుకూడ జీవించుతుంది. సమస్తమానవజాతికి మిత్రునివలె, నేతవలె వ్యవహరించుతూ ప్రపంచము కొరకు గూడ జీవించుతుంది. ఈ సంగతిని నేను మున్నెతలంచి చెప్పాను ఇప్పుడూ చెప్పుతున్నాను.

వాటి సహజ క్రమంలో ఆ ఆశయాదర్శాలు ఏవంటే : 1. భారత దేశానికి స్వాతంత్ర్య సమైక్యతలు సాధించగల ఒకవిప్లవము. 2. ఆసియా ఖండ పునరుజ్జీవన, విమోచనలు. తరువాత తాను పూర్వము మానవ సభ్యతయొక్క పురోగతిలో ధరించిన మహత్తరపాత్రను తిరిగిచేపట్టడము, 3. మానవాళి కంతకూ ఒక నూతన, మహత్తర, ధామరతర, ఘనతర జీవితోదయము. ఇట్టి జీవిత వికాసముయొక్క సంపూర్ణ సంసిద్ధి వేరువేరు

ప్రజానీకముల అంతర్జాతీయ ఏకీకరణపై బాహ్యముగాఆధారపడిఉంటుంది. అయితే ఈ ఏకీకరణ జాతీయ జీవనానికి రక్షణ భద్రతలను కల్పించుతూనే వివిధ ప్రజానీకములను అన్నింటిని అధిగమించిన ఒకానొక సర్వసంయోజిక ఏకత్వములో సన్నిహితమును సమకూర్చును. 4. తన ఆధ్యాత్మిక జ్ఞానమునూ, జీవితమును ఆధ్యాత్మిక జీవితముగా రూపాంతరమొందించు కొనడానికి తన యోగసాధనములనూ, భారతభూమి జాతికంతటు కానుకగా అందివ్వడము, 5. చివరకు చేతనను ఉన్నత స్థాయికి లేవనెత్తడం ద్వారా పరిణామ క్రమములోకే ఒక పెద్ద అడుగు ముందుకు వేయడం, ఈ ముందడుగు మానవజాతి అస్తిత్వమునకు సంబంధించిన వివిధ సమస్యల పరిష్కారమునకు శ్రీకారము చుట్టగలదు. మానవుడు ఆలోచించడ మారంభించి, వ్యక్తిగత సంసిద్ధి, సమాజిక సిద్ధులను గురించి కలలు గనడం ప్రారంభించిన దాదిగా అతనిని కలవరపెట్టి, వేధించుతూన్న సమస్త సమస్యలకూ యీ ముందడుగే తరుణోపాయము కాగలదు. [మొదటి మూడు ఆశయాల సిద్ధిని గురించి ఉన్న సందేశ భాగమునువిడిచి వేస్తున్నాను.]

ప్రపంచానికి భారతదేశముయొక్క ఆధ్యాత్మికోపహారము అప్పుడే ఆరంభమైనది. భరతమాతయొక్క ఆధ్యాత్మికతత్వము అధికాధికముగా యూరోపు, అమెరికాలలో ప్రవేశించుతోంది. ఈ ఉద్యమము మరింతవృద్ధి పొందును; నేటి విపత్సంకులమైన విపరీత కాలములో ఎందరెందరి దృష్టో ఆశాభావముతో భారతావని వైపుకే తిరుగుతోంది. ఆమె బోధనలను అధికముగా ఆశ్రయించడమేకాక. అంతరాత్మ, ఆధ్యాత్మలకు సంబంధించిన ఆమె యోగవిధానాలనుకూడ విశేషముగా చేపడుతున్నారు ప్రపంచవాసులు.

తక్కినది (5వ అంశము) ఇంకనూ నా మనసులోని ఒక ఆశ, ఒకభావము, ఒక ఆదర్శముగా మాత్రమే ఉన్నది. అయితే నా ఈ ఆశా

దికము ఇండియాలోనూ, పశ్చిమ దేశాలలోనూ ముందు చూపుగలవారి మనస్సులను ఆకట్టుకోవడం ఆరంభించినది. ఈ మార్గములోని కష్ట నష్టాలు భయంకరములు. ఇంతటి కష్టాలు మరే కృషిలోనూ మన కెదురు గావు. అయితే అధిగమించడానికే కష్టాలు సృజింపబడ్డవి. అందుచేత అది ఈశ్వరేచ్ఛే అయితే, వాటిని తప్పక అధిగమించగలము. ఇచ్చటకూడ ఈ చేతనా వికాసమునందుకూడ, భారతదేశానికే చొరవతీసుకునే సామర్థ్య మున్నది. ఎలనంటే ఇది ఆత్మాభివృద్ధి ద్వారా, అంతశ్చేతనా వికాసము ద్వారా జరిగవలసి వుంది. (ఇట్టి సాధనలో భారతదేశానికే ప్రాచీన పరి జ్ఞానమున్నది గదా!) సర్వ ప్రపంచము ఈచేతనా వికాసమునకు క్షేత్రమే అయినప్పటికీ, ఈ ఉద్యమమూలము భారతమునందే ఏర్పడవచ్చు.

పవిత్ర భారతము విముక్తి గాంచిన ఈ తిధి గర్భములోనే నిట్టి ఆంతర్యమును పరికించుచున్నాను. నేను పరికించు ఈ సంబంధము సాఫ ల్యమునొందునో, లేదో, ఎంతవరకు, ఎంతత్వరగా సాఫల్యమునొందునో, అది ఈ అభినవ, స్వతంత్ర భారత ప్రయత్నముపై ఆధారపడి ఉంటుంది. మూలము :- శ్రీ అరవిందులు.

అనువాదము :- చె. నాగేశ్వరరావు.

# శ్రీ అరవిందుని అమూల్యానుభవాలు

సేకరణ :-

పక్కా సత్యనారాయణ

శ్రీ అరవిందులు బరోడానుండి తమధర్మపత్ని మృణాళినీదేవి గారికి 30—8—1905 న వ్రాసిన అద్భుతలేఖలోని కొన్ని విషయములు నీ క్రింద బొందు పఱచుచున్నాను, "భగవంతుడు ఏ గుణము, ఏ ప్రతిభ, ఏ ఉచ్చ శిక్షణము, విద్య, ఏ ధనమిచ్చెనో అదంతయును భగవంతునిదే. ఎంత భార్యా పుత్రాదుల భరణ పోషణమునకై వలయునో మఱియు నెంత అత్యంత ఆవశ్యకమో, అది మాత్రము వ్యయము చేయుచే తన యధికా రమని, ఏది మిగులునో అది భగవంతునికే తిరిగి యీయవలయునని నా దృఢవిశ్వాసము. నేనుగనుక సర్వమునునాకై, సుఖముకొఱకై విలాసము కొఱకై వ్యయము చేయుదునేని చోరుడను. హిందూ శాస్త్రము చెప్పు చున్నది—ఎవ్వడు భగవంతుని కడ నుండి ధనముకై కొని భగవంతుని కీయడో అతడు చోరుడు. ఈ పంటకు భగవంతునికై పెండపాలిచ్చి పదు నాలుగణాలు స్వసుఖమునకై వ్యయముచేసి లెక్కలు సరిపెట్టి సాంసారిక సుఖము నందు మత్తుడనై యుంటిని. జీవితములో సగపాలు వృథాయై పోయినది. పశువుకూడ తనయొక్క తన కుటుంబముయొక్క ఉదరమును పూరించి కృతార్థమగుచున్నది.

జన్మాంతరమునుండియు నేను పశువృత్తియు చోరవృత్తియు జేయు చుంటినని తెలిసికొంటిని. తెలిసికొనినపుడు మిక్కిలి యనుతాపము, నాపై నాకు హేయ భావమును కలిగినవి. ఇకపలదు, ఆ పాపమును ఈ జన్మమునకెల్ల వదలివేసితిని. భగవంతుని కిచ్చుట యనగా నర్థము ధర్మ కార్యములందు వ్యయము చేయుట. సరోజినికి (చెల్లెలు)గాని ఉషకుగాని యిచ్చిన పైకము విషయమై నాకే యనుతాపమును లేదు. పరోపకారము ధర్మము, ఆశ్రితుల రక్షించుట మహాధర్మము; కాని కేవలము అన్నదమ్ము లకును అక్క చెల్లెండ్రకును ఇచ్చినంతనే లెక్క సరిపోదు. ఈ దుర్దినము

లందు సమస్త దేశమును నాద్వారము కడవేచి యున్నది. నాకు ముప్పది కోట్లు సోదరీ సోదరులీ దేశమందున్నారు; వారిలో ననేకులు తిండిలేక చచ్చిపోవుచున్నారు. పెక్కుమంది కష్టముల చేతను దుఃఖములచేతను జర్జరితులై ఏరీతిగానో ప్రాణములతో మిగిలియున్నారు. వారికి హితము చేయవలయును.”

శ్రీ అరవిందులు బరోడాలో 1893 మొదలు 1906 వరకు పదమూడు సంవత్సరములు ఉద్యోగిగా నున్నకాలమున—‘దివా రాత్రము లొకే స్థలమునకలసి మెలసి రెండేండ్లపాటు శ్రీ అరవిందులతో నివసించు మహాభాగ్య మబ్బినందున వారి హృదయము గొంత ఎఱుంగ గలిగితిని.’ అని శ్రీ దినేంద్ర కుమారరాయిగారు ఈలా వెల్లడించియున్నారు.

“శ్రీ అరవిందులు చిరకాలముగ ధనమును తుచ్ఛముగా భావించెడి వారు. ధనమును గూడబెట్టుకొనుట వారికి గిట్టదు. ఆయన అపుడేకాకి; ఏ షోకులు, భోగ విలాసములులేవు. ఆ దృష్టియే వారికిలేదు. విలువయిన బూట్లు, కాలర్, కోటు, హ్యాటు ఉన్నిబట్టలు మున్నగునవి వారికి లేవు. ఒక దినమేని హ్యాటు వారు ధరించినదిలేదు. దేశవాళి మామూలు చెప్పులు, అహమ్మదాబాదు మిల్లు ధోవతలు, తలపాగా, సామాన్యమైన చొక్కా కోటు ఇవియే వారుపయోగించెవారు. తుదకు రాచదర్బారులకు విందులకు వెళ్ళవలసినప్పుడు గూడ ఈ మామూలు వేషమే. ఒక కాసైన దుర్వినియోగము చేయరు. ఇట్లుండియు నెలాఖరున నొక్క దమ్మిడియు చేతిలో నుండదు. ఎన్నో పర్యాయములు మిత్రులయొద్దనుండి చేబదుళ్ళు తీసికొను చుండుట నే నెఱుంగుదును.”

“గ్రంథములకే వారి ధనమెక్కువగా వ్యయమగుచుండెను. పోస్టు ద్వారా వారికెన్నడు గ్రంథములు వచ్చినదిలేదు. పెద్ద పెద్ద జాజికాయ పెట్టెలతో రైల్వే పార్శలుద్వారా వచ్చుచుండెను. అదియు మాసమునకు

రెండు పర్యాయములు. వచ్చిన గ్రంథములు పది దినములలో సాంతముగా పఠించిపైచి క్రొత్త గ్రంథముల కెదురు చూచుచుండెడివారు. వీరివలె గ్రంథ పఠవాను రక్తిగలవారిని నేను చూచి యుండలేదు. వీరి తల్లిగారికి మాత్రము వేతన మందగనే మొదట పైక మంపుచుండెడివారు. తల్లిగారి పట్ల వీరికిగల భక్తి ప్రేమలు నిరుపమానము 'మా తల్లి పిచ్చిది, పిచ్చితల్లి కొమారుడును పిచ్చివాడేగదా' యని యపుడపుడు నుడువుచుందురు."

మరియు "బరోడాలో వారుండిన బంగాళా మిక్కిలి ప్రాతది మరమ్మతు ఏనాడును చేయించలేదు. సున్నమైన కొట్టించిన పాపమునబోలేదు. వేయేల సామాన్య సంపన్నుల గోశాలలుగూడ నిట్లుండవు. ఇంటిపై పెంకులుగూడ పగిలి వర్షకాలములో గురియుచుండును. ఎండకాలములో మండుటెండలు, వేడిగాల్పులు, వీనితో దుస్సహముగా నుండును. వర్షకాలములో చలి యింతింతనరాదు. పగలు ఈగల బాధ, రాత్రులు దోమల బాధ. ఏ మానవుడు సహించలేడు. ఇట్లున్నను శ్రీ అరవిందులు బాహ్యజ్ఞాన శూన్యులై యోగమగ్నులైన మహా తపస్వివలె తదేక దృష్టితో ఘంటలకొలది యిటునటు గదలక గ్రంధావలోకన మొనర్చుచుండుట నాకాశ్చర్యముగా నుండెడిది. ఆ సమయమున నిప్పంటుకొని గది మండిపోవుచున్నను, వారికితెలియదనియేచెప్పవలయును. చలికి మనవలె వేరే కంబళ్లు వారుపయోగించెడివారు కారు. తుదకు దోమ తెరయువారికిలేదు." అని పైన తెలిపిన రాయిగారు వ్రాసిరి.

బరోడాలో నున్నపుడు శ్రీ అరవిందుల గృహమునకు శ్రీ రమేశ చంద్రదత్తుగారొక నా దతిథులుగా వచ్చియుండిరి. దత్తుగారు కవీశ్వరుడు మహా భారతమును, శ్రీమద్రామాయణమును నాంగ్లమున పద్యరూపమున ననువదించిరి. దత్తుగారు శ్రీ అరవిందులను గూర్చి ఇలా నుడివిరి. "బ్రహ్మచర్య నిరతి, పరదుఃఖ కాతరత, ఆత్మత్యాగము ఇవి తప్ప మరొక భావమే శ్రీ అరవిందులకు లేదు. జ్ఞాన సంచయమే వారి జీవన వ్రతము.

ఈ వ్రతోద్యాపన నిమిత్తమే కర్మకోలాహల ప్రతిధ్వనిపూరిత సంసారమున నివసించుచుండియు వారు కఠోర తపస్సున నిమగ్నులైరి. వేయేల, వీరు భూలోక మానవులుగారు. ఏదో శాపభ్రష్టుడైన దేవతయే."

శ్రీ అరవిందులు బరోడా నగరమున కళాశాలలో ఉద్యోగముచేయు సమయమున వారితో గడపిన దినములందు శ్రీ ఆర్. యన్. పట్కార్ గారు వారి అనుభవములను గూర్చి వ్రాసిన వాటినుండి కొన్నింటిని జెప్పుచున్నాను. "నేను బరోడా కళాశాలలో జదువుచున్నపు డాయనయొక్క విద్యార్థిగానే నుండుట నా అదృష్టము. ఏబది సంవత్సరములకు పూర్వమాయన వాక్కులను విన్నాను. కాని నేటికి నేను శ్రీ అరవిందునియొక్క మూర్తిని ఆ శ్రావ్యతను మరువలేను. శ్రీ అరవిందులు ఉపన్యాసము లిచ్చుతరి, కళాశాల మధ్య నున్నటువంటి మందిరమంతయు కిటకిట లాడిపోయెడిది. శ్రీవారి వాక్కులు అమృత ధారగా ప్రవహించి వినువారి హృదయములను చూరగొనుచుండెను." 'మరియు నాకు స్ఫురించిన యింకొక విశేషమేమనగా శ్రీవారికి ధనా కాంక్షలేకుండుట. ఆయనకు మూడు మాసముల వేతనము నొక సంచి యందుంచబడి వచ్చుచుండెను. ఆ సంచిని ఖాళీచేసి, బల్లమీదయుండు ప్లేటులోవేయుచుండిరి. డబ్బును పెట్టెయందుంచి తాళము వేసి భద్రముగా నుంచవలయునన్న అలవాటాయనకు లేకుండెను. ఆయన వ్యయము చేసిన డబ్బును గూర్చి జమా ఖర్చు వ్రాయువారు కారు. ఆయన యీ విధముగా డబ్బును నిర్లక్ష్యముగ నుంచుటను గమనించినవాడనై, ఒకా నొక సమయమున, నేను వారట్లు డబ్బు విషయమై ఇంతటి నిర్లక్ష్యమెందులకు జేయుచున్నారని శ్రీవారిని ప్రశ్నించితిని. అప్పుడాయన దరహాస వదనములతో "మనము సద్గుణ సత్యవంతుల నడుమ జీవించుచున్నామన్న యాదార్థమును నిరూపించుటకే" అట్లు జేసితిననిరి. "మీరు జమా ఖర్చు వ్రాసి నుంచుకొనిన కదా, సత్యవంతులయొక్క సత్యమును మంచితనమును దెలిసికొనుటకని" నేనంటిని. అపుడు యోగీశ్వరులగు

శ్రీఅరవిందులు 'నా జమాఖర్చు విషయము పైన మేజూచుకొనును. ఆయన నా కెన్నడును లోపము (కొఱత) చేయడు కాన నేనెందులకు భయము చెందవలయును ?" అనిరి.

"మనము - మనమే భగవంతుని వారమైతే, మనదంతా భగవంతునిదే. అలాగే మనము ఆశ్రమంలో ఉంటే, మనదంతా ఆశ్రమానిదే (భగవంతునిదే) కావాలి !" యిది గ్రహించినపుడు "ఆహో ! ఎంత సరళ, సహజ సత్యమిది !" అనిపించింది. కాని ఎందరు దీనిని ఎంత వరకు అమలుపరుస్తున్నారు ? ఆశ్రమములో నివసించడానికి ఎట్టి అర్హతఉండాలి! దాపరికముతో, మినహాయింపులతో జీవించడం ఆ తల్లిపట్ల గావించిన అపచారం కాదా ! - అని కూడ మనగుండెకు గ్రుచ్చుకుంటుంది. "ఈ ఆశ్రమానికి ప్రాణ సూత్రము ఆత్మనివేదనము, అమ్మకు విధేయత (Self giving and surrender) ఈ తాటిపైననే నడవాలి ఆశ్రమస్థుల బాహ్యాభ్యంతర జీవితము.

"ప్రతివ్యక్తి భగవంతునికి చెందును, ప్రతివ్యక్తికున్న సమస్తమూ ఆ భగవంతునికే చెందును. ఒకరేదైనా ఆశ్రమానికిచ్చినపుడు, అతడుతన స్వంతము నివ్వలేదు. అంతకు పూర్వమే భగవంతునిదైన దానిని భగవంతునికి (ఆశ్రమానికి) ఇస్తున్నాడు. అందుచేత ఈ విషయంలో లావాదేవీల, బేరసారాల ప్రశ్నే ఉదయించదు; అధికారములకు, కోరికలకు అవకాశమే లేదు.

జై శ్రీమా, శ్రీఅరవింద.

# శ్రీ అరవింద సందేశాలు

## కోరిక

దుఃఖము, ఆశాభంగము, క్లేశము—వీనికి మూలము కోరికే, ఏల నంటే, ప్రయత్నమునందు, విషయప్రాప్తి [తృప్తి] యందు దానికొక కల్లోలిత మోదము కలుగుతూన్నప్పటికీ, అది సదా మానవుని ప్రయాస పెట్టును. అందుచేత దాని ప్రయత్నమునందు, ప్రాప్తియందుకూడ తృష్ణా శ్రమలు తనను వెంటాడుతూ ఉండును; పోరాటము, పరిక్లేశము, అలజడి, అశాంతి తనను వేధించుతూనే ఉండును; పరిమితత్వ భావముతనను బాధిం చుతూనే ఉండును; అది త్వరగా అలసటకు లోనగును: నిర్విరామ సము ద్వేగమనే రోగగ్రస్తమై కొట్టుకొనును; ఎంత పొందిననూ అసంతృప్తి, ఆశాభంగము అనతికాలములోనే తనను పైకొనును.

ప్రపంచమును స్వాధీనపరచుకొని అనుభవించాలనే సహజప్రవృత్తి అంతరాత్మకునూ కలదు. అయితే ఈ ఆత్మ ప్రవృత్తి ఆనందము కొరకు ప్రవర్తిల్లే ఇచ్ఛారూపమైనది: ఇది ఆనంద సంకల్పము. ఇక తృష్ణాతృప్తి వలన ప్రాప్తించే భోగాభిలాష ఆనంద సంకల్పముయొక్క ప్రాణమయ, అన్నమయ తత్వములందలి నీచరూపము మాత్రమే.

# విముక్త మానవుడు

విముక్త మానవునికి స్వకీయ ఆశాభావము లుండవు. తన వ్యక్తిగత సంపత్తిగా వస్తువులను పరిగ్రహించడు. భగవదిచ్ఛ దేనిని ప్రాప్తింప చేస్తుందో దానిని స్వీకరించునే గానీ, తదన్యమునకు ఆరాటపడడు. ఎవని యందూ అతనికి అసూయ ఉండదు; తనకు లభించిన దానిని రాగద్వేష రహితముగా ఆమోదించును; తనకు దూరమగుదానిని కాలవాహినిలో కలసి పోనిచ్చునుగాని, దానికొరకు చింతించడు, దుఃఖించడు, అయ్యో పోయినదే అనుకోడు. హృదయము, ఆత్మ అతనికి పూర్తిగా వశమునందుండును; అతని హృదాత్మలు ప్రతిక్రియారహితమై, రజోభావయుక్తమై ఉండడం చేత బాహ్యవిషయ సంస్పర్శలకు ప్రసభముగా (ఉద్వేగముగా) ప్రతిస్పందించవు.

# స్వీకార యోగ్యమగు యజ్ఞము

తెలిసిగాని, తెలియకగాని మనముచేసే సమస్తక్రియలూ, సకల ప్రయత్నాలూ, తన అసంఖ్యాక రూపాలలో ఏకమాత్రుడై ఉన్న అతనిని ఉద్దేశించే తెలిసో, తెలియకో చేయబడుతూ ఉన్నాయి. ఏ రూపములో, ఏ భావముతో అతనిని మనము సమీపింతుమో, ఆ రూపములోనే ఆ భావములోనే అతడు మన నివేదనను స్వీకరించును. అట్టి యజ్ఞఫలము కూడ యజ్ఞకర్మనుబట్టే, కర్మాశయమును బట్టే, ఆశయమును పాలించు అంతరంగ భావమును బట్టి వుండును. ఒకే ఒక యజ్ఞముతప్ప, తదన్యము లన్నీ పాక్షికమూ, పరిమితమూ, తాత్కాలికమూ, అహంకారదూషిత మూనై ఉండును — అత్యున్నత శక్తులకూ, తత్త్వములకూ సమర్పించిన యజ్ఞనములు సైతమూ అట్టివే. ఇక అట్టి యజ్ఞముల ఫలితముకూడ పాక్షిక, పరిమిత, తాత్కాలికమై మిశ్రిత ప్రయోజనమునే సమకూర్చును. పూర్తిగా స్వీకర యోగ్యమగు ఆ ఏకైక యజ్ఞమేది యన, భక్తి జ్ఞానము

ఉతో, నిస్సంకోచముగా, నిశ్శేషముగా ఆత్మకు, పరమునకు, విశ్వము నకు సమర్పించిన యజ్ఞరాజమే. ఆత్మార్పణము గావించుకొన్న అంత రాత్మకు భగవాన్‌కూడ ఆత్మార్పణము గావించుకొనును. అపుడా అంత రాత్మ ఆత్మను కనుగొని, పరమును ప్రాప్తించి, విశ్వమును ఉపభోగిం చును.

* * *

ఒక విషయము ప్రతి ఒకరు గుర్తుపెట్టుకోవాలి. ఏది చేసినాయోగ దృష్టితో, సాధనా దృష్టితోచేయాలి; మాతృశ్రీ చేతనలో దివ్యజీవితమును ఆరోహించేందుకు చేయాలి. మన మనస్సుకే పట్టముగట్టి, దాని భావాలే చెల్లాలని పట్టుబట్టడం, మన ప్రాణ వృత్తులు, ప్రాణప్రతిక్రియలచేపాలింప బడడానికి అనుమతించడం - ఇది మన జీవననియమము కాగూడదిక్కడ. వీటినుంచి వెనుకకు తగ్గి, వేరుపడి, వాటి స్థానములో పైనుంచి యదార్థ జ్ఞానమును, లోపల అంతరాత్మనుంచి యదార్థ భావములను పొందనగును. కాని, మనః ప్రాణములు ఆత్మసమర్పణము గావించుకోనంతవరకు ఇది సాధ్యము కాదు, అలాగే తాము సత్య, ధర్మ, న్యాయములని పిలుచుకొనే తమ అజ్ఞానమునందలి ఆసక్తిని విడనాడనంతవరకు ఇది సాధ్యముకాదు. ఈ ఆసక్తి నుండే అన్ని కడగండ్లూ కలుగుతూన్నవి. ఈ ఆసక్తినిదాటి వెళ్ళినపుడు, జీవితము, కర్మ, సామరస్యము, సమస్తమునకు భగవత్సం పర్కము నందు యదార్థ ప్రాతిపదిక లభించి, ఆ ప్రాతిపదికమీది వ్యవ హారమే ఇప్పటి మన బాధలను, కష్టములను క్రమముగా తొలగించి వేయును.

— 15—8—1953

సమస్తము భగవంతుడు చేయగలడు అయితే దానికి — హృద యమూ, ప్రకృతీ విశుద్ధము చేయబడి, అంతశ్చేతన మేల్కొని, మను

గులు తొలగించబడి—సాధకుడు నమ్మికతో, విశ్వాసముతో తనను తాను భగవంతుని హస్తములందు అర్పించుకోవాలి. అలా ఒకేసారి అర్పించు-కోజాలనప్పటికీ, ఎంతెంత అర్పించుకుంటే అంతంత అంతః సహాయమూ, మార్గదర్శకమూ లభిస్తాయి; ఆంతరమునందు భగవదనుభూతికూడ వర్ధిల్లుతుంది. ప్రశ్నించే మనస్సు కొంత ఉపశమించితె నమ్రతా, సమర్పించుకోవాలనే సంకల్పమూ బలపడితే భగవదనుభూతి సంపూర్ణముగాసాధ్యమై ఒప్పారగలదు. అప్పుడు ఏ ఇతర బలముగానీ, తపస్సుగాని అవసరముండదు; ఇదొక్కటే చాలును.

— 4–4–1961

మాతృశ్రీ వైపుకు తిరిగిన ప్రతివాడు (మాత్రమే) నాయోగమును ఆచరించుతున్నాడు. ఒకడు తన స్వప్రయత్నము చేతనే పూర్ణయోగమును ఆచరించగలడనడం అంటే, పూర్ణయోగముయొక్క సర్వాంశములను అనుష్ఠించి, సంపూర్ణము చేయగలడనడం గొప్ప తప్పిదమే అవుతుంది. యే మానవమాత్రుడూ అట్లాచరించజాలడు. ఎవడైనా చేయదగిన దేమంటే, మాతృశ్రీ కరకమలములయందు తన్ను దాను అర్పించుకొని, సేవచేతను, భక్తిచేతను, ఆకాంక్షచేతను ఆమెకుఉన్మీలితుడు గావడమే; అప్పుడుఅతనియందు సాధన సాగునట్లుగా, అమ్మ తన తేజశ్శక్తులతో అక్కడ పని చేయును. పెద్ద పూర్ణయోగియో, గొప్ప అతి మానస ప్రాణియో కావాలనే అత్యాశతోనుండి, నేనా గమ్యముపైపుకు ఎంత దూరము వెళ్ళగలిగితినని ప్రశ్నించుకోవడం కూడ తప్పిదమే అవుతుంది. తల్లియందు భక్తికలిగి, తల్లికి నివేదితుడై వుండడమే సరియైన పైఖరి. నీవు ఎట్టి పరిణామము నొందాలని ఆమె కోరునో, అది ఎట్టిదైనా దానిని అభిలషించడమే శ్రేయస్కరము. తక్కినది తల్లిగారే నిర్ణయించి, నీయందు నిర్వహించవలసి వున్నది.

ఏప్రిల్ 1935, 21–2–1953 నాడు సందేశముగా ఇవ్వబడినది

తన కోరికలన్నింటిని గురించీ, తన బాధలన్నింటి విషయములో బిడ్డ ఆత్మ తల్లి ఆత్మను పరుగుపెట్టి ఆశ్రయించుతుంది. అది అలా కావాలనే దివ్య జనని అభిమతము. తల్లి తన బిడ్డపై ప్రేమామృతమును వర్షించడానికి అది సదవకాశము కదా! పైగా మాతృ ప్రేమయొక్క స్వయంభూ స్వభావముచేతనే జీవాత్మ ఆమెవైపుకు మరలడం జరుగును. అలా మరలడానికి మరొక కారణం, ఆ ప్రేమ ప్రపంచములో పరిభ్రమించి విసిగి వేసారిన మనకు నిజగృహము వైపుకు దారి చూపించును. మనకు విశ్రాంతి నిలయమగు అమ్మ ఒడిలోనికి దారి తీయును.

24–4–1963

దివ్య ప్రేమ వేగమును తట్టుకోగలగడానికి ముందు భక్తుడు (దివ్యుడు కావలెను) దివ్యుడై ఉండవలెను.

24–11–1963

పర్యవసానముగా చెప్పాలంటే మనలోని అత్యల్పులకు వలెనే అతి ఘనులకుకూడ, మనకున్న బలము మనదికాదు. మనము అభినయించ వలసిన పాత్ర కొరకు, అనుష్ఠించవలసిన కర్మ కొరకు ఆ బలము మన కివ్వబడుతున్నది. ఆ బలము మనలో ఒక ప్రత్యేక నిర్మాణ రూపం ధరించ వచ్చు. కాని దాని ప్రస్తుతరూపం చరమ రూపం మాత్రం కాదు—అది బల హీనతా రూపమైనా, ప్రబలతా రూపమైనా సరే, ఏక్షణమునందైనా దాని రూపము మారిపోవచ్చు——ముఖ్యముగాయోగశక్తి అదిమి వత్తిడి కల్పించు నపుడు, ఏ క్షణమందైనా దౌర్బల్యము ప్రాబల్యముగా మారిపోవడం మనము గాంచవచ్చు. అలాగే అసమర్థుడు సమర్థుడుగా నగును: ఒకే సారో, క్రమముగానో ఉపకరణ భూతమగుచేతన పైకి లేచి నూతన సమున్నతిని పొందవచ్చును, లేదా తనయందు నిద్రాణమైయున్న శక్తులను వికసింప జేసుకొనవచ్చును. మనపైన, మనలోను, మన చుట్టునుకూడ

(అన్ని బలములకూ మూలమైన) విశ్వబలము(All-Strength) ఉంది. మన కర్మవ్యాపారము కొరకు, మన వికాసము కొరకు, రూపాంతరము నొందించే మన మార్పుకొరకు ఈ విశ్వ బలముమీదే మనము ఆధారపడ వలసి వుంది. కార్యమునందు విశ్వాసముతో, ఆ కార్యమునకు మనము ఉపకరణ భూతులమనే విశ్వాసముతో, (ఆ కార్యమునందు) మనలను నియోగించిన శక్తియందు విశ్వాసముతో మనము ముందుకు సాగితే, పరీక్షా ప్రయత్నమునందే, కష్టములనూ, భంగపాటులనూ ఎదుర్కొని, అధిగమించే వ్యాపారమునందే ఆ బలము మనకు లభించును. అపుడు మన కవసరమైన మేరకు మన సామర్థ్యము ఆ విశ్వశక్తిని ధరించుతున్నదని మనకు గానవచ్చును. పోను పోను, ఈ విశ్వశక్తియొక్క అధికాధిక పూర్ణపాత్రలమై ఒప్పారుదుము.

29—2—1932

11—10—1954 నాటి సందేశము.

పరదేవత స్వయముగా వరించుకున్న తన నివాస స్థానమే భూలోక జీవితము. తమోమయ కారాగార దశనుండి తేజోమయ భవనముగా, స్వర్గ చుంబియగు సమున్నత దేవాలయముగా ఇహ జీవితమును రూపాంతర మొందించడానికే ఆ పై వేచ్ఛ యుగయుగాలుగా కొనసాగుతోంది.

4—5—1967

నా స్వీయసంకల్పమును, స్వీయవాదమును (Self Assertion) కడిగివేసి నన్ను విశుద్ధుని జేయ ప్రార్థింతును. అట్టి విశుద్ధితో మాత్రశ్రీకి విధేయుడనై, వినేయుడనై, (శిక్షణా యోగ్యుడనై) ఆమె కర్మయందు యోగ్యమగు ఉపకరణమగుదునుగాక! నే జేసే ప్రతి పనియందు ఆమె అనుగ్రహము చేతనే నడుపబడుతూ ఆమెకే సమర్పితుడనై మను దును గాక!

1942

ప్రపంచము విన్నది ఈమెను గురించే అయితే, ఎట్టి మంగళ ప్రద మైన మార్పు జరిగినా, ఇక ఆశ్చర్యపడవలసిన అవసరముండదు. ఆనం దాత్మకమై, అవలీలగా జరుగు ప్రతి అద్భుతము ఆమె స్పర్శవేది హృద యముయొక్క రసాయన ప్రక్రియయే అవుతుంది.

28—1—1955 నాటి సందేశము (సావిత్రి నుంచి)

శ్రీ తల్లిగారికి నిన్ను నీవు తెరచిన ద్వారము గావించుకొని, ఆమెతో సంపూర్ణ సంపర్కము నొంది యుండుము. ఆమె చేతిలో ఎట్టి పలుకులేని మృదుతర మృత్తికగా నీవు మారిపోయి, నిన్ను శీఘ్రముగా మలచి సంసిద్ధుని చేయడానికి ఆమె కవకాశమిమ్ము.

9—3—34

28—3—53 నాటి సందేశము.

# 1955 ఉగాది ముందు మాతశ్రీ వినిపించిన

## ఉ దా హ ర ణ లు :

## శ్రీ అరవిందుని రెండు లేఖలు

(1) ప్రశ్న : బౌద్ధమతము, వేదాంతము, లేక క్రైస్తవమతము అవలంబించినంత మంది పరివర్తన ప్రధానమగు మనయోగ సత్యమును ఆమోదించరేమోనని నా అనుమానము.

శ్రీ అరవిందుని జవాబు : సంఖ్యమీదనే ఏదీ ఆధారపడదు. బౌద్ధమతము, లేక క్రైస్తవమతములో అంతమంది చేరడానికి కారణము, అందులోని అధికాంశ ప్రజలు ఆ మతమును ఒక సిద్ధాంతముగానే స్వీకరించారు. వారి బాహ్య జీవితానికది ఎట్టి మార్పు గొనిరాలేదు. నూతన చేతనకూడ అలాంటి దానితోనే తృప్తిపడితే, అదికూడ భూలోకములోని అందరియొక్క ఆదరమును, ఆమోదమును కూడ ఎప్పుడో శాసించగలిగేది; ఎంతో ఎక్కువ సులభముగా శాసించగలిగేది. కాని అది ఒక మహత్తర చేతన, సత్య చేతన, అందుచేతనే అది యథార్థమగు మార్పుకొరకు పట్టు పట్టును.

(2) ప్రశ్న:- మన యోగలక్ష్యము నిర్వాణమును మించిన ఊర్ధ్వగమనమని మీరు వచించి ఉన్నారు. కాని మన ఆశ్రమములో నిర్వాణ స్థాయినైనా అందుకున్నవారు గాని, అందుకోడానికి యత్నించినవారు గానీ ఎందరున్నారు ? నిర్వాణ మాత్రానికైనా అహంకారమును, కామమును త్యజించడమవసరం గదా ! ఆశ్రమములోని కతిపయ సాధకులైనా అలా త్యజించగలిగారని చెప్పగలమా ? ప్రతిసాధకుడు ఇందు నిమిత్తం కొంత—ఎంతో కొంత—ప్రయత్నించుతూనే వుండాలి, ఆమాట నిజమే. అయితే వారి ప్రయత్నమెందుకు ఫలించడంలేదు? కొంత ప్రయత్నించి, పిమ్మట లక్ష్యమును విస్మరించి సామాన్య జీవితమును సాగించడమే దానికి కారణమా ?

శ్రీ అరవిందుని సమాధానం : నిర్వాణ లక్ష్యమునే వారిముందు ఉంచడం జరిగితే, ఎక్కువమంది దాని కర్తృతను సాధించి ఉండేవారని నాతలంపు. ఏలనంటే,నిర్వాణలక్ష్యము మన యోగలక్ష్యము కంటే సులభ సాధ్యము. అందుచేత వాని స్థాయి నందుకోవడం వారికంత కష్టమనిపించేది కాదు. ఇచ్చటి సాధకులలో అన్ని తత్త్వాలవారు ఉన్నారు, అన్ని తరగతులవారు ఉన్నారు. కొంత పురోగమించిన సాధకులకు కూడ అసలైన కష్టమెక్కడంటే, బాహ్య పురుషుని దగ్గరే. సాంప్రదాయిక ఆదర్శమును అనుసరించుతూ కొంత సాధించిన సాధకుల విషయములోకూడ బాహ్య పురుషుడు దాదాపు యథాతథముగానే ఉండిపోతున్నాడు. అంతఃపురుషుడు బంధవిముక్తి పొందగా, బాహ్య పురుషుడు ఇంకనూ తన ప్రకృతి గాడిలోనే తిరుగాడుతున్నాడు. బాహ్యమానవుడు కూడ మారినపుడే మన యోగము సిద్ధించినట్లగును. కాని అదే అత్యంత కష్టభూయిష్ఠము. భౌతిక ప్రకృతి మారినపుడే బాహ్య పురుషుడు మారగలడు. ఇక భౌతిక ప్రకృతి మారాలంటే, అత్యున్నతమగు పరంజ్యోతి, ప్రకృతియొక్క అత్యధమ భాగములోనికి అవతరించడ మావశ్యకము. ఇక్కడీ విషయములోనే పోరాటము కొనసాగుతోంది. ఇచ్చటి అధికసంఖ్యాక సాధకులయొక్క అంతఃపురుషుడు, ఇంకనూ ఎంత అపరిపూర్ణముగా ఉన్నా, సామాన్య మానవుని అంతఃపురుషునికంటే ఎంతో విలక్షణముగా నున్నాడు. కాని బాహ్యతత్త్వం మాత్రము ఇప్పటికీ తన పాత మార్గాలకు, మర్యాదలకు, అలవాటులకు అంటిపెట్టుకునే వుంది. పెక్కుమందిలో మార్పు అవసరమనే భావము కూడ మేల్కొన్నట్లు కన్పించదు. ఈ అవసరమును గట్టిగా గుర్తించి సాధించ మొదలిడినపుడే, ఆశ్రమములోనే ఈ యోగము పూర్ణఫలితముల నివ్వనారంభించును. అంతకు ముందుకాదు.

# 1955 మాతృశ్రీ ఉగాది ప్రసంగము

రాబోవు సంవత్సరము కష్టకాలమని నాకు ముందే కన్పించుతోంది. ఎంతో అంతఃపోరాటము, ఎంతో బహిఃపోరాటముకూడ విజృంభించుతాయి. అందుచేత అట్టి పరిస్థితులలో మీరెట్టి వైఖరి నవలంబించాలో ఇపుడు చెపుతాను. బహూశః ఈ కష్టాలు నూతనాబ్దములోని పన్నెండు మాసాలూదాటి పదునాల్గు మాసాలవరకూ కొనసాగవచ్చు. అవి ఎంతకాలము సాగినా, మీరు మాత్రము అవలంభించవలసిన వైఖరిని ఎప్పుడూ పట్టువిడవరని నేనెంతగానో ఆశించుతున్నాను.

ముందుగా నేనీ మాట మీకు చెప్పితీరాలి : నిజానికి పరిస్థితులెంత విషమించితే మీరంత ప్రశాంతంగా ఉండాలి, మీ విశ్వాసమంత సుస్థిరము కావాలి. ఇదే అతి ముఖ్యమైన సంగతి.

కష్టాలు పైకొన్నప్పుడు మానవమాత్రులు ఆందోళితులౌతారు. ఉద్రిక్తులౌతారు, అధీరులౌతారు, ఆ విధముగా ఒక వందరెట్లు వారి కష్టాలను పెంచుకుంటారు. అందుచేత మీరావిధముగా చలించగూడదని నా హెచ్చరిక : దానికి సరిగా ప్రతిగా మీరు నడుచుకోవాలి. ఇప్పట్టున నేనిచ్చిన నూతన సంవత్సర సందేశమును పునశ్చరణ చేయండి. మీకు ఉద్రేక కారణము దాపురించినపుడెల్లా, నేటి నామాటను స్మరించండి, సాలుపొడవునా స్మరించండి. ప్రాతః సాయములందు నిత్యమూ మీరీ సందేశమును జపించవచ్చు, మీకు మేలు కలుగును.

ప్రశ్న :— దేహము ధరించి ఏ రూపములోనున్న మానవేచ్ఛ ఇపుడు విదివ్యముగా (Anti Divine) నున్నది ?

సమాధానము :— మానవేచ్ఛ, అది ఏ రూపములోనున్నా, భగవద్విరుద్ధమైనపుడు విదివ్యమే; అది నీలో పొడసూపినా విదివ్యమే. భగవదిచ్ఛ యందు రాజకీయ స్వపక్ష విపక్షాలులేవు, నిజానికక్కడ వివిధచేతనా దశలు మాత్రమే వున్నాయి.

# 1955 మాతృశ్రీ ఉగాది ప్రసంగము

రాబోవు సంవత్సరము కష్టకాలమని నాకు ముందే కన్పించుతోంది. ఎంతో అంతఃపోరాటము, ఎంతో బహిఃపోరాటముకూడ విజృంభించుతాయి. అందుచేత అట్టి పరిస్థితులలో మీరెట్టి వైఖరి నవలంబించాలో ఇపుడు చెప్పుతాను. బహుశః ఈ కష్టాలు నూతనాబ్దములోని పన్నెండు మాసాలూదాటి పదునాల్గు మాసాలవరకూ కొనసాగవచ్చు. అవి ఎంతకాలము సాగినా, మీరు మాత్రము అవలంభించవలసిన వైఖరిని ఎప్పుడూ పట్టువిడవరని నేనెంతగానో ఆశించుతున్నాను.

ముందుగా నేనీ మాట మీకు చెప్పితీరాలి : నిజానికి పరిస్థితులెంత విషమించితే మీరంత ప్రశాంతంగా ఉండాలి, మీ విశ్వాసమంత సుస్థిరము కావాలి. ఇదే అతి ముఖ్యమైన సంగతి.

కష్టాలు పైకొన్నప్పుడు మానవమాత్రులు ఆందోళితులౌతారు. ఉద్రిక్తులౌతారు, అధీరులౌతారు, ఆ విధముగా ఒక వందరెట్లు వారి కష్టాలను పెంచుకుంటారు. అందుచేత మీరావిధముగా చలించగూడదని నా హెచ్చరిక : దానికి సరిగా ప్రతిగా మీరు నడుచుకోవాలి. ఇప్పట్టున నే నిచ్చిన నూతన సంవత్సర సందేశమును పునశ్చరణ చేయండి. మీకు ఉద్రేక కారణము దాపురించినపుడెల్లా, నేటి నామాటను స్మరించండి, సాలు పొడవునా స్మరించండి. ప్రాతః సాయములందు నిత్యమూ మీరీ సందేశమును జపించవచ్చు, మీకు మేలు కలుగును.

ప్రశ్న :— దేహము ధరించి ఏ రూపములోనున్న మానవేచ్ఛ ఇపుడు విదివ్యముగా (Anti Divine) నున్నది ?

సమాధానము :— మానవేచ్ఛ, అది ఏ రూపములోనున్నా, భగవద్విరుద్ధమైనపుడు విదివ్యమే; అది నీలో పొడసూపినా విదివ్యమే. భగవదిచ్ఛయందు రాజకీయ స్వపక్ష విపక్షాలులేవు, నిజానికక్కడ వివిధచేతనా దశలు మాత్రమే వున్నాయి.

చుతాడు. కాని తన జీవితానికి. కొంచెం సంవత్సరముల తర్వాతనే ఏమి సంభవించనున్నదో ఎవరు చెప్పగలరు ? మానవ దృష్టి సరళరేఖను అనుసరించును. అంటే, దానికి వస్తువులు ఒకే పంక్తిలో ఒకదాని తర్వాత నొకటి కన్పిస్తాయి. దైవదృష్టి యిందుకు భిన్నము! అది సమ్యగ్దర్శనము గోళకాత్మక దర్శనము (Global vision) అది సమస్యను సమగ్రముగా పరికించును. అంటే అన్నివైపులనుంచీ, చుట్టుముట్టి పరికించును. ఒకవైపునుంచిగాని, ఒక కోణమునుంచిగాని చూడదు. పరాత్పర దృష్టి అన్ని పార్శ్వములనూ, అన్ని ముఖములనూ, ఒకే చూపులో అమర్చుకోగలదు; అది బాహ్యములనేగాక, ఆంతరములనుకూడ ఆలింగనము చేసుకుంటుంది. అది ప్రశ్నయొక్క అన్ని అంశాలనూ ఆలింగనము గావించుకొని, ఏ అంశమునూ ఉపేక్షించక ఆ ప్రశ్నను పరిష్కరించును. ఇక మానవుడో, దీనికి విపరీతముగా ఒక సరళరేఖ (Straight Line) ననుసరించి ముందుకు సాగును. ఆ రేఖలో లేనిదేదైనా అతని దృష్టి నుంచి తప్పించుకొనును. అందుచేత అతని కార్య విధానానికే విడిచివేస్తే, ఆ తప్పించుకున్నదేదీ సిద్ధించదు. దైవగతి వృత్తప్రాయ (Circular) మైనా అదే అత్యంత సాక్షాన్మార్గము (సమగ్ర మార్గము గనుక).

ప్రశ్న :— ఈ కష్టములు వ్యక్తిగతముగా నుండునా, సామూహికముగానా ?

సమాధానము :— ఇంచుమించు అవి అందరికీ నుండును—ప్రపంచానికి, ఇండియాకు, ఆశ్రమానికి, చివరికి వ్యక్తులకుకూడ, ఇది ఈ ప్రతిఘటన వర్తమాన నాగరికతపై తమ ప్రాబల్యమును నిలుపుకోడానికి అహిత శక్తులయొక్క చివరి ఆశాకిరణ ప్రేరితమని నేను చెప్పనొప్పును. కాని మనము మాత్రము నడుము బిగించి నిలబడాలి; నిలబడి ముందుకు సాగి కష్టకాలము గట్టెక్కితే, తర్వాత మన పని సుకరమగును. ప్రతిఘటన క్రమముగా కాళ్ళు తేలవేయును, విచ్ఛిన్నమైపోవును.

చెప్తాడు. కాని తన జీవితానికి. కొలది సంవత్సరముల తర్వాతనే ఏమి సంభవించనున్నదో ఎవరు చెప్పగలరు? మానవ దృష్టి సరళరేఖను అనుసరించును. అంటే, దానికి వస్తువులు ఒకే పంక్తిలో ఒకదాని తర్వాత మరొకటి కన్పిస్తాయి. దైవదృష్టి యందుకు భిన్నము! అది సమ్యగ్దర్శనము గోళకాత్మక దర్శనము (Global vision) అది సమస్యను సమగ్రముగా పరికించును. అంటే అన్నివైపులనుండీ, చుట్టుముట్టి పరికించును. ఒకవైపునుంచిగాని, ఒక కోణమునుంచిగాని చూడదు. పరాత్పర దృష్టి అన్ని పార్శ్వములనూ, అన్ని ముఖములనూ, ఒకే చూపులో అమర్చుకోగలదు; అది బాహ్యములనేగాక, అంతరములనుకూడ ఆలింగనము చేసుకుంటుంది. అది ప్రశ్నయొక్క అన్ని అంశాలనూ ఆలింగనము గావించుకొని, ఏ అంశమునూ ఉపేక్షించక ఆ ప్రశ్నను పరిష్కరించును. ఇక మానవుడో, దీనికి విపరీతముగా ఒక సరళరేఖ (Straight Line) ననుసరించి ముందుకు సాగును. ఆ రేఖలో లేనిదేదైనా అతని దృష్టి నుంచి తప్పించుకొనును. అందుచేత అతని కార్య విధానానికే విడిచివేస్తే, ఆ తప్పించుకున్నదేదీ సిద్ధించదు. దైవగతి వృత్తప్రాయ (Circular) మైనా అదే అత్యంత సాక్షాన్మార్గము (సమగ్ర మార్గము గనుక).

ప్రశ్న :— ఈ కష్టములు వ్యక్తిగతముగా నుండునా, సామూహికముగానా?

సమాధానము :— ఇంచుమించు అవి అందరికీ నుండును—ప్రపంచానికి, ఇండియాకు, ఆశ్రమానికి, చివరికి వ్యక్తులకుకూడ, ఇది ఈ ప్రతిఘటన వర్తమాన నాగరికతపై తమ ప్రాబల్యమును నిలుపుకోడానికి అహిత శక్తులయొక్క చివరి ఆశాకిరణ ప్రేరితమని నేను చెప్పనొప్పను. కాని మనము మాత్రము నడుము బిగించి నిలబడాలి; నిలబడి ముందుకు సాగి కష్టకాలము గట్టెక్కితే, తర్వాత మన పని సుకరమగును. ప్రతిఘటన క్రమముగా కాళ్ళు తేలవేయును, విచ్ఛిన్నమైపోవును.

# మాతృశ్రీ ఇచ్చిన మరి కొన్ని సందేశములు

## దైవ సన్నిధి

యథార్థమగు బలమూ, రక్షణా హృదయము నందలి దైవసన్నిధి నుండియే మనకు లభించును.

ఇట్టి దైవ సన్నిధి స్థిరముగా నీయందు నిలిచి యుండగోరుదువేని, సదా జాగరూకుడవై యుండి వాక్కునందూ, వర్తనమునందూ, వ్యవహారమునందూ అసభ్యతను సర్వధా పరిహరింపుము. స్వేచ్ఛ అంటే యథేచ్ఛా వ్యవహారమనీ, స్వాతంత్ర్యము అంటే అమర్యాదా వర్తనమనీ ఎంత మాత్రమూ భ్రమింపకుము. నీ ఆలోచన పరిశుద్ధమై, నీ ఆకాంక్ష ప్రజ్వలమై తేజరిల్లాలి [అప్పుడే స్థిరమైన దైవ సన్నిధి.]

—మాతృశ్రీ 26–2–65

గమనిక :— దైవమునుంచి లభించిన బలమే బలము. అది ఉత్తమ భూమికకు చెందిన బలము కనుక, అధరభూమికలోని బలము దానిముందు ఆగజాలదు. రాక్షసమాయాబలము రాముని సత్యపరాక్రమము ముందు పని చేయలేదు.

రాముడు 'సాధుః సత్యపరాక్రమః' అని అభివర్ణించబడినాడు. ఇందులో మరొక రహస్యముంది. ఈ సత్యపరాక్రమము సాధుత్వానికి విరుద్ధముకాదు. పైగా దానికికూడ బలము చేకూర్చి దోహదముచేస్తుంది. అందుచేత హృదయ సన్నిధినుండి సంక్రమించిన ఈ సత్యబలమే సాధనోపయోగి కాగలదు.

ఈ సన్నిధిని సాధించుకోడానికి అంతఃకరణ సంశుద్ధి, ఆకాంక్షా తీవ్రత. సన్నిధిలభించిన తరువాత అది వుపసంహరించుకొనకుండా ఉండాలంటే, ఆ సన్నిధికి బాధ కలిగించే ఏ మోటుమాట మన నోటినుంచి వెలు

# మాతృశ్రీ ఇచ్చిన మరి కొన్ని సందేశములు

## దైవ సన్నిధి

యథార్థమగు బలమూ, రక్షణా హృదయము నందలి దైవసన్నిధి నుండియే మనకు లభించును.

ఇట్టి దైవ సన్నిధి స్థిరముగా నీయందు నిలిచి యుండగోరుదువేని, సదా జాగరూకుడవై యుండి వాక్కునందూ, వర్తనమునందూ, వ్యవహారమునందూ అసభ్యతను సర్వధా పరిహరింపుము. స్వేచ్ఛ అంటే యథేచ్ఛా వ్యవహారమనీ, స్వాతంత్ర్యము అంటే అమర్యాదా వర్తనమనీ ఎంత మాత్రమూ భ్రమింపకుము. నీ ఆలోచన పరిశుద్ధమై, నీ ఆకాంక్ష ప్రజ్వలమై తేజరిల్లాలి [అప్పుడే స్థిరమైన దైవ సన్నిధి.]

—మాతృశ్రీ 26—2—65

గమనిక :— దైవమునుంచి లభించిన బలమే బలము. అది ఉత్తమ భూమికకు చెందిన బలము కనుక, అధమభూమికలోని బలము దానిముందు ఆగజాలదు. రాక్షసమాయాబలము రాముని సత్యపరాక్రమము ముందు పని చేయలేదు.

రాముడు 'సాధుః సత్యపరాక్రమః' అని అభివర్ణించబడినాడు. ఇందులో మరొక రహస్యముంది. ఈ సత్యపరాక్రమము సాధుత్వానికి విరుద్ధముకాదు. పైగా దానికికూడ బలము చేకూర్చి దోహదముచేస్తుంది. అందుచేత హృదయ సన్నిధినుండి సంక్రమించిన ఈ సత్యబలమే సాధనోపయోగి కాగలదు.

ఈ సన్నిధిని సాధించుకోడానికి అంతఃకరణ సంశుద్ధి, ఆకాంక్షా తీవ్రత. సన్నిధిలభించిన తరువాత అది వుపసంహరించుకొనకుండా ఉండాలంటే, ఆ సన్నిధికి బాధ కలిగించే ఏ మోటుమాట మన నోటినుంచి వెలు

అంయుచేతనే అమ్మ ఇలా హెచ్చరించారు. కొలది ఏండ్ల క్రిందట "మానవ జాతి సహకరించితే సరే, నూతన ప్రపంచ నిర్మాణము సౌమ్యముగా జరిగిపోతుంది. లేని యెడల, ఇప్పటి ప్రపంచ శ్మశానముపై నూతన లోకము నిర్మింపబడుతుంది. అంతేగాని, అది ఆగదు సుమా!" అని.

ఆకాంక్షలో చిత్తశుద్ధి, ఆచరణలో విశ్వాసము, ప్రయత్నములో పట్టుదల — ఈ శక్తిత్రయవాహనముపై నీవు గమ్యమును చేరుకొందువు.

— మాతృశ్రీ 3–4–1965

గమనిక :— త్రికరణ శుద్ధిలేని ఆకాంక్ష హృదయమును స్పృశింపదు. అది అంతరాత్మ ఆకాంక్షతో సంయోగము పొందజాలదు. అంతరాత్మతో సంయోగము పొందినపుడే, అది సహజము, సముజ్జ్వలమునై భగవదనుగ్రహమును కదిలించ గలుగుతుంది.

విశ్వాసము లేకపోతే, ఎంతో కాలము మనము ఆచరించలేము. ఫలితాలు వెనువెంటనే కలుగవు గనుక, పైగా విశ్వాసము అమ్మ శక్తికి అస్పష్టముగానైనా ద్వారము తెరుస్తుంది. అపుడు ఆచరణ సుకరమూ, గుణవత్తరమూ అవుతుంది.

ప్రయత్నము పట్టువిడవకుండా దీర్ఘకాలము కొనసాగవలసి వుంటుంది. —ముఖ్యముగా అసదృశమైన ఆధ్యాత్మిక లక్ష్యాల విషయంలో, భూమి పుట్టిన దగ్గరనుండీ శ్రీమాత శ్రీ అరవిందులు కీలక సంధి సమయాలలో అవతరిస్తూన్నారట. ఆ మాట అమ్మే అసందిగ్ధంగా వెల్లడించారు. అల్పచేతస్కులమగు మనకు సాయంకాలానికే ఫలము సంచిలో పడాలి! అమ్మ తన లక్ష్యసాధనకు అసంఖ్యాక జన్మపరంపరకైనా ఆయత్తమయ్యే ఉన్నారు.

* * *

భగవన్మూలము నుండియే నీ సుఖ సంతోషములను పొందగోరి ప్రతీక్షించుము. ఆయన యందే నీవు సహాయము నర్థించి, ఆధారమును బడయుము. అప్పుడాయన నిన్ను నీ ప్రతిబాధలోను ఆదుకొని ఓదార్చును: మార్గమునందు నడిపించును; పడిపోయినపుడు లేవనెత్తును. మార్గాయాసముచేత అలసి, సొలసి పోయిన క్షణములు సంప్రాప్తమైతే, తన బలీయమగు ప్రేమ బాహువులలోనికి లేవనెత్తుకుని, చల్లని వాత్సల్యామృతమును చిలకరించి నిన్ను సేద తేర్చును.

—శ్రీ మాత.

గమనిక :— మనకేది కావలసినా అతని వైపునకే తిరగాలి. అతనే మన జీవితాని కాధారము కావాలి ! —— ఇది ఎంతటి కఠోరమైన అసిధారా వ్రతమో మనకు తెలుసు. కాని పరమ సత్యము కూడాను. కేవలము తల్లిదండ్రులమీదే ఆధారపడిన పసిబిడ్డకు ఆ తల్లిదండ్రులెట్లు సమకూర్తురో మనకు విదితమే గదా ! వయసు వచ్చిన కొలదీ అహంకారము పెరిగిన మనము అలా అనన్య భావముతో ఆశ్రయించగలగడం ఒకనాడు జరిగే పనికాదు.

కాని అహంకారము విడనాడి, అంతరాత్మను ఆశ్రయించితే, అంతరాత్మతో తాదాత్మ్యము పొందితే, అదిమనకు అచిరకాలములో అలవడుతుంది. ఎందుచేతనంటే, భగవదంశమైన అంతరాత్మ ఎల్లప్పుడూ భగవంతునే ఆశ్రయించి ఉంటుంది. అందుచేతనే శ్రీ అరవిందుడు మున్ముందు అంతరాత్మ భావమునూ, ప్రభావమునూ (Psychicisation-) సాధించుకోవాలంటారు.

# కర్మయోగవిశేషము

సమస్త కర్మలు సన్యసించి, చదువుతూ, ధ్యానించుతూ కూర్చోవడమే శ్రేయస్కరమని అమ్మ అనుకోవడం లేదు, కర్మాచరణం యోగ సాధనలో ఒక భాగమే, ప్రాణమయ సత్తలోనికి, దాని క్రియాకలాపము లోనికి దివ్య తేజః శక్తి, సన్నిధులను ఆహ్వానించుకొనేందుకు కర్మయోగము ఉత్తమావకాశమును కల్పించును. అది సమర్పణ పరిధిని, తదవకాశమునుకూడ విస్తృతపరచును.

కర్మ తల్లిగారిది, తత్ఫలితములు తల్లిగారివి—అని స్మృతియందు ధరించినంత మాత్రముతో సరిపోదు. నీ వెనుకనే పనిచేస్తూ ఉన్న మాతృశ్రీ శక్తి సంస్పర్శను సాక్షాత్తుగా పొంది, తత్ప్రేరణ కుస్మీలితుడవై, తన్నిర్దేశమును అనుసరించ నేర్చుకోవాలి ! పైగా మానసిక ప్రయత్నముచేతనే సంతతమూ స్మరించడం మిక్కిలి దుష్కరం ! కాని నీయందున్న, లేక నీకాధారముగా నున్న మాతృశ్రీ శక్తి సంస్పర్శను సరాసరి పొందగల చేతనా భూమికలోనికీ నీవు అడుగిడుదువేని—అదే యదార్థమగు అనుభవము. —శ్రీ అరవిందుడు 18—4—1932

గమనిక :— యోగమునకు శక్తి ప్రాణ తత్వమునుండే రావాలి ! ప్రాణతత్వము సహకరించకపోతే, ఆ యోగి ఏ ఘనకార్యమును సాధించలేడు. చివరకు స్వీయముక్తికూడ సంశయగ్రస్తమే అవుతుంది. అందుచేత ప్రాణకోశమును శోధించి, సంసిద్ధము గావించగల కర్మయోగము అత్యంతావశ్యకము—కర్మయోగములో కర్మ మనలను బంధించును గదా ? అవును, ఒక దశవరకు మాత్రమే అమ్మశక్తే కర్మచేస్తోంది—అది మనము స్మరించడం మాత్రమేకాదు. సాక్షాత్తు తదుపలబ్ధిని పొందినపుడు, కర్మ విముక్తి మనకు కరతలామలక మవుతుంది. అయితే ఈ ఉపలబ్ధి బాహ్య చేతనలో సాధ్యం కాదు; అంతశ్చేతనా విశేషములో మాత్రమే. అంటే బ్రహ్మచర్య ప్రాప్తి విషయంలోవలే, ఇక్కడ కూడ ఉన్నత భూమికలో ప్రవేశించాలి !

# శ్రీ అరవిందుని అమూల్య అనుభవాలు

సే క ర ణ :

చక్కా సత్యనారాయణ

భగవానుని యెడ తమకున్న ప్రేమను గురించి ఇతరులు గొప్ప చెప్పుకుంటారు. కాని నేను ఏమని చెప్పుకుంటానంటే – భగవానుని నేను ప్రేమించడంలేదు. భగవానుడే నన్ను ప్రేమించి, నావెంట దగిలి, బలవంతాన నన్ను తన వానిగా జేసుకొన్నాడు.

శ్రీ కృష్ణుని నేను తొలుతగాకలుసుకున్నప్పుడు చెలికానిగా అతనిని ప్రేమించాను. ఆ కాలంలో అతడు నన్ను మోసం చేసినప్పుడు నాకు చాల కోపంవచ్చింది. అతనిని నేను మన్నించలేకపోయాను. తరువాతనే నతనిని ప్రియునిగా ప్రేమించడం జరిగింది. అప్పుడు కూడ నన్ను అతడు మోసం చెయ్యడం మానలేదు. నాకు కోపం మరింత ఎక్కువగా వచ్చింది. కాని ఈ పర్యాయం నేనతనిని మన్నించకుండా వుండలేకపోయాను.

భగవానుడు నాకు స్త్రీ మూర్తిగా తెలియబడినప్పుడా ప్రేమస్వరూపం అతి దూరాన చూచాయగా మాత్రమే నాకు గోచరించింది. నేనే స్త్రీనై భగవానుని నా ప్రభునిగా ప్రియునిగా సేవించగలిగిన తర్వాతగాని, ప్రేమ తత్వం నాకు పూర్తిగా అవగాహన కాలేదు.

నేనూ, నా కృష్ణుడూ — మా యిరువురితోపాటు ఇతరులుకూడ ప్రపంచములో నాకు గోచరించిన కాలమందు నాతో ఆయన జరిపిన లీలలన్నీ నేను ఎవ్వరికి వెల్లడిచేయక చాలా రహస్యంగా ఉంచుతూ వచ్చాను. అలా కాక యిప్పుడు ప్రపంచంలో ఎల్లెడలా మా యిర్వురను మాత్రమే నేను చూడ నేర్చుకున్నప్పటి నుండీ నాకు సిగ్గనేది లేకుండాపోయి వాగేస్తున్నాను.

కృష్ణ ప్రేమ ఈసును పుట్టించేది కారాదు. కృష్ణుడు చంద్రచాలిని ప్రేమిస్తున్నప్పుడు, నేనుకూడ ఆమె నెందుకు ప్రేమించరాదు? నా తగాదా

నా ప్రియుడైన కృష్ణుని ప్రేమించని వారితోనే కాని నాతో సాధించుకునే వారితో కాదు.

పూర్వం నాకు బాధ అంటే గిట్టేదికాదు. బాధను తప్పించుకోడానికే ఎంతసేపూ ప్రయత్నిస్తూ వుండేవాణ్ణి. నాకు బాధ కలుగజేయబడి నందుకు నిరసన ప్రకటిస్తూ వుండేవాణ్ణి. కాని బాధలే కనుక నేను అనుభవించి వుండకపోతే నా మనస్సులో, హృదయంలో, శరీరంలో ఈ అపార బహుళానందానుభవ శక్తి సంపద నాకు లభ్యపడివుండేదిగాదు. భగవానుడు తొలుత అత్యంత బాధాకరుడుగా ముసుగు వేసుకొని కనిపించినా, అదంతా మన మంచికేనని తుద కాయన నిరూపించుకుంటాడు.

ఒప్పిదములైన హేతువులు చూపి, భగవంతుడనేవాడు లేనేలేడని కొందరు నాకు నిరూపణచేసి చెప్పారు. నేను వారిని విశ్వసించాను. కాని అటు పిమ్మట భగవంతుడే నా చెంతకు వచ్చి నన్ను కౌగలించుకున్నందువల్ల నేనాయనను చూడడం తటస్థించింది. ఇప్పుడు నేను దేనిని విశ్వసించాలి ? ఇతరుల హేతువాదాన్నా, నాసొంత అనుభవాన్నా? ద్వంద్వాత్మకంగా ఆలోచించే తర్కబుద్ధి నాశ్రయించియుండిన కాలంలో అనేక విషయాల ఎడ నాకు ఏవగింపు వుండేది. సాక్షాదర్శనలో తర్కబుద్ధి తిరోహితమైన పిమ్మట ఏవగింపు కలిగించే వికార వస్తువులకొరకు లోకమంతా గాలించాను. గాని అవియెక్కడా నాకు కనిపించలేదు. భగవానుడు నా కన్నులు తెరిచాడు. ఏలనంటే నీచ వస్తువులలోని ఉదాత్తతను, అసహ్యవస్తువుల లోని మనోజ్ఞతను, వికలాంగులలోని సౌష్టవాన్ని, వికార రూపంలోని సౌందర్యాన్ని నేను చూడగలిగాను.

పాపమేమిటో, పుణ్యమేమిటో నేను పూర్తిగా మరచిపోయాను. నాకు కనిపించేదల్లా భగవానుడు. జగత్తులో ఆయన లీల, మానవజాతిలో ఆయన సంకల్పం ఇవి మాత్రమే. మురికిలో పొర్లాడుతున్న పసిబిడ్డను

చూచాను. ఆ పసిబిడ్డనే తల్లినీళ్ళుపోసి శుభ్రం చేసిన మీదట మిసమిస లాడుతూ వుండగా చూచాను. రెండు సందర్భాలలోనూ ఆ పసిబిడ్డ పరమ విశుద్ధత నన్ను వర్ధిల్లజేసింది.

నేను అజ్ఞానంలో నిద్రిస్తూ వుండిన కాలంలో పుణ్యపురుషమయమైన ఒక ధ్యానమందిరానికి వెళ్ళినప్పుడు వారి సాంగత్యం నాకు విసుగు జనింపజేయగా ఆ స్థలం నాకొక చెరసాలవలె తోచింది. జ్ఞానంలోనికి నేను మేల్కొనిన పిమ్మట భగవానుడు నన్నొక చెరసాలకు గొనిపోయి; దానినే ఒక ధ్యానమందిరంగానూ, తన తోడి కలయికకు సంకేతస్థలం (ముందుగా మాటాడుకొని నిష్కర్ష చేసికొన్న స్థలం)గానూ మార్చివేశాడు.

నేను అజ్ఞానంలో వున్నప్పుడు చోరులను, హంతకులను, పాపజీవులను ఏవగించుకొన్నాను అజ్ఞానం తొలగిన మీదట చోరునికీ, హంతకునికీ ఆత్మలో నమస్కరించాను. జారస్త్రీ పాదాలను పూజించాను. ఏల నంటే ఈ జీవులు విపరీతమైన పాప భారాన్ని మోస్తూ, సంసారసాగర మథనంలో పుట్టిన కాలకూట విషంలో విశేష భాగాన్ని మనందరికోసమూ ఓడ్చివేస్తున్నారు.

నేను అపజయాలు పొంది కష్టాలనుభవించడ మనేదే జరుగక పోతే నా జీవిత పరమార్థం నాకు దక్కకుండా పోయేదని వెనుకటి జీవితం సింహావలోకనం చేసి చూచుకుంటే నా కిప్పుడు స్పష్టంగా తెలుస్తున్నది. కాని ఆ అపజయాలు, కష్టాలు అనుభవించే సమయంలో మాత్రం ఒక మహా విపత్తు సంఘటిల్లినట్లే భావించి తల్లడిల్లిపోయాను. ఎట్టయెదుట సన్నిహితంగా కనిపించేది తప్ప మరేది చూడజాలని హేతువుచే మనం నానా విక్షేపాలూ చెందుతూ వుంటాము. శాంత చిత్తులమై, అహంకారం విసర్జించి, విశ్వవిశాల దృష్టిని మనం అలవరచుకోవాలి.

నీచత్వం, స్వార్థపరత్వం ఈ రెండే క్షమించరాని పాపాలుగా నాకు కనిపిస్తున్నాయి. కాని దాదాపు ఎక్కడ చూచినా కనిపిస్తూ వుండేవి యివే.

కావున ఇతరులయందు వీటిని సైతం మనం ద్వేషించరాదు. మనయందు వీటిని నిర్మూలించుకోవానికి మాత్రమే శ్రద్ధవహించాలి.

క్షమించే గుణం చాల గొప్పదని క్రైస్తవులు, వైష్ణవులు కీర్తిస్తూ వుంటారు. కాని నేను క్షమించవలసినది ఎవరిని, ఎందుకోసం అని నా ప్రశ్న. భగవానుడొక మానవ హస్తాలతో ప్రహరించి(దెబ్బకొట్టి)నప్పుడు ఓ భగవానుడా, నీ దుస్సాహసాన్ని (సహింపగూడనిది) క్షమిస్తున్నానని యా నేననవలసినది? భగవానుడొక ప్రహారం (దెబ్బ)తో నాకు మేలు కూర్చినప్పుడు ఓ భగవానుడా నీ క్రూరత్వాన్ని క్షమిస్తున్నాను. యిలాంటి పని మాత్రం తిరిగి ఇంకొకసారి చెయ్యవద్దనియా నేనాదేశించ (అజ్ఞాపించ) వలసినది ?

నీ ప్రత్యర్థిని దనుమాడ (చంప) బోతున్నప్పుడు కూడా అతనిలో నున్న భగవంతుని ప్రేమించు. అప్పుడు మీ యిరువురిలో నెవరికీ నరక ప్రాప్తివుండబోదు. లోకం శత్రువులను గురించిన ప్రస్తావన చేస్తూ వుంటుంది. కాని ఎక్కడ వున్నారా శత్రువులు? నాకు కనిపించేది విశ్వ క్రీడారంగంలో ఏదో ఒక పక్షానికి చెందిన మల్లయోధులు మాత్రమే.

మంచివాడు మరణించడం, అపజయం పొందడం — చెడ్డవాడు జీవించడం, విజయం పొందడం — వీటినిబట్టి ఈశ్వరి తత్వం చెడ్డ దన వలసినదేనా ? ఇది సరియైన తర్కంగానాకు తోచదు. అసలు మృత్యువు, అపజయము చెడ్డవి ఎట్లయినాయి? అవి సంప్రాప్తమైనట్లు నేనొక్కొక్క సారి భావిస్తూవుంటాను. మన చిత్తవృత్తులు మనలను వివేక భ్రష్టులను చెయ్యడం వలన వాటి కిష్టం కాని ప్రతిదీ చెడ్డదని వాదించడం మనకు పరిపాటి అయిపోయింది.

# గాంధీగారిని గురించి శ్రీ అరవిందుని అభిప్రాయాలు

యథాలాపంగా గాంధి ప్రసక్తి పొడమినపుడు శ్రీ అరవిందుడు శ్రీ మాత చెప్పిన మాటలను కొన్నింటిని 'Talks with Sri Auro Bindo' By Nirod Barn—లోనివి వ్రాస్తున్నాను.

ప్రశ్న :— ఇప్పటికీ దేశరక్షణ అహింసద్వారా సాధ్యమనే ఆయన (గాంధి) నమ్ముతున్నారు.

సమాధానముSri Aurobindo :— అహింస రక్షించలేదు. అహింసా యోధుడు ప్రాణము కోల్పోతాడు; అంతే.

ప్రశ్న :— ఆధ్యాత్మిక నైతిక శక్తుల అంతరము ఆయనకు అంతగా గోచరిస్తూన్నట్లు లేదు.

సమాధానము :— 'అంతగా' గాదు. ఎంతగానూ గోచరించడంలేదు.

ప్రశ్న :— "గణేశ్ శంకర్ విద్యార్థివలె నేనుకూడ ఒక ఆతతాయి చేతిలో చనిపోతే ఎంతో అదృష్టమని నేను భావించేవాడను !" గాంధి వాపోయారు.

సమాధానము :— అంటే ఆ ఆతతాయితో గాంధి ఇలా చెప్పినట్లయినది : "నీ వెంత మంచివాడవు, నాయనా ! హత్యచేయబడడానికి నీవు చక్కని అవకాశము ప్రసాదించావు నాకు !"

[అలా హత్య చేయబడడమే గాంధి తన ఆశయముగా భావిస్తున్నాడు. దానివలన ప్రయోజనముండదని ఆయనకు తట్టడములేదు] అని శ్రీ అరవిందుని భావము.

ప్రశ్న :— కాంగ్రెసు మంత్రివర్గాలు ప్రదర్శకులమీద గుళ్లు ప్రయోగించడం — ఇది హింసా మార్గమని నిరసించారు గాంధి.

సమాధానము :— కాని బలప్రయోగం ఏ రూపములో ఉన్నా అది హింసే, బలప్రయోగం ద్వారా మద్యపాన నిషేధము ఇదికూడ హింసే. అసలు ఆయన ఎప్పుడైనా ఆలోచించారా? అహింసద్వారా పరిపాలన ఎలా సంభవమని (ఇప్పటి పరిణామ దశలో అని శ్రీ అరవిందుని అర్థము.)

ప్రశ్న :— గాంధి క్రైస్తు అవతారమంటున్నారు.

సమాధానము :— అవతారమా? ఆయన బోధలకూ, క్రైస్తు బోధలకు కొంత సాదృశ్యమున్నది; అంతే.

ప్రశ్న :— హిట్లరు దండెత్తి వచ్చినపుడు అతని మనసు మార్చవచ్చునని గాంధికి నమ్మకము.

సమాధానము :— హిట్లరు టాంకులను చరఖాలతో ఎదుర్కొంటారా? అది కావడానికి మనోహరమైన భావమే కాని ఆయన అహింసా విధానములో నిజముగా ఎవరికైనా నమ్మకమున్నదా! అని? ఆయన అనుచరులలో కొద్దిమంది మాత్రమే ఆ నమ్మకముతో ఉన్నారు. పటేలుకు మాత్రము అలాంటి నమ్మకములేదు. [స్వాతంత్ర్యానంతరము ఢిల్లీని ఆక్రమించుకోవాలని మహమ్మదీయులు కుట్ర చేసినపుడు పటేలు నిర్దాక్షిణ్యముగా మూక ఉమ్మడిగా కాల్పించి వేశాడు— గాంధిని త్రోసివేసి ఈ సంగతి చాలమందికి తెలుసు.]

ప్రశ్న :— 1919 లో గోవర్ధన్‌దాస్, పంజాబు నాయకుడు కారాగారము తప్పించుకొనేందుకు పాండిచ్చేరి పారిపోయి వచ్చాడు. కాని 'నీ మాటను నిలబెట్టుకోవాలి. నీ ధర్మము నీవు నెరవేర్చాలి' అని

చెప్పి గాంధి ఆయనను అప్పుడు పిలిపించి వేశాడు. ఏ సందర్భ ములోకూడ మాటను పాటించి, ఆ ప్రకారము చేయవలసిందేనా?

సమాధానము :— ఉత్తమ (శ్రేష్ఠతర) జీవితము గడపాలని లోపలినుండి పిలుపువస్తే, వాగ్దానమును పాటించవలసిన అగత్యంలేదు. ఏ ఆశయ సాధనకు వాగ్దానము చేశామో, ఆ ఆశయము మారినపుడు కూడ మాటను చెల్లించకపోవచ్చును.

నా జ్ఞాపకము నుంచి 1,2 విషయాలు వ్రాస్తాను. మహానుభావులే హరిజనులుగా పుడతారు — అని గాంధీగారు అన్నారట. దానిమీద శ్రీఅర విందులు "ఆయన అతిశయోక్తులలో ఇదొకటి. మహాభాగులు కేవలము హరిజనులుగానే ఎందుకు పుట్టాలి ?" అని వ్యాఖ్యానించారు.

బీహారు భూకంపము అస్పృశ్యతా ప్రకోపమువల్లనే — అని గాంధి గారు తన నమ్మకముతో వాదించినపుడు, "హాస్యాస్పదము ! భూతలం మీద మానవుడు మనుగడ ప్రారంభించక పూర్వమే, భూకంపాలు చెల రేగుతూ ఉండేవి కదా:" అని శ్రీ అరవిందుని వ్యాఖ్య.

తన ప్రాయశ్చిత్తాలతో, ప్రాయోపవేశాలతో గాంధిని క్రైస్తవు డనుకోవచ్చు.—అని ఒకానొక సందర్భములో శ్రీ అరవిందులు ఉపవాస విధానాలు దేశానికి హాని చేస్తున్నాయని గాంధిగారికి నచ్చ చెప్పేందుకు దిలీప్‌కుమార్‌రాయ్‌ని శ్రీ అరవిందాశ్రమం నుంచి ఒకసారి పంపారు.

Crucifixion of The Flesh—దేహ శోషణం దేహము పట్ల కఠోర నిర్దాక్షిణ్యము; అవర ప్రవృత్తులను అరికట్టేందుకు గాంధి గారు తరచు అవలంబించిన సాధనమిది. నైతిక శక్తి మాత్రమే మన చేతిలో నున్నపుడు అలా చేయడం దాదాపు అనివార్యమవుతుంది. శ్రీ అర విందుని పద్ధతిలో ఉన్మీలనము ద్వారా పరాశక్తికి అవకాశమిస్తే అదే పరి వర్తనము సాధించుతుంది. దీనిని బట్టి గాంధిగారికీ, అధిగతాత్ములకు

ఉన్న అంతరము మనకు తెలుస్తుంది. "చేతనలో మార్పుగాని రాకుండా పరిస్థితులలో మార్పు తేవాలను కోవడం వ్యర్థమగు తియ్యని భ్రమ మాత్రమే—అని శ్రీ అరవిందుల వచనము.

ఒక రొకప్పుడు గాంధిగారి అహింస మున్నగు విషయాలను గురించి ప్రకటంచిన పత్రమును శ్రీ మాతకు చూపి, ఈ విషయములో అమ్మా : 'మీరేమంటారో వినగోరుతున్నాను.' అని ఆయన అమ్మను అర్థించాడు. దానికి అమ్మ ఇలా అన్నది.

"సత్య ప్రాప్తికి, తదభివ్యక్తికి ఎవరెట్టి స్వల్ప విషయమును కను గొన్ననూ, మానవ ప్రయత్నములో వారికొక స్థానమున్నది. అట్టి వారిలో గాంధి ఒకరు.

"అయితే మనము చేసే గొప్ప తప్పిదమేమిటంటే, ఈ పాక్షిక సత్యాలను ఒక పరమ సామరస్యంలో (Harmony) చక్కగా పొదగ డానికి బదులు ఒకదానితో మరొకదానికి పోటీ పెడతాము. అందుచేతనే మానవ జాతి ఇంకను అంధకారములో తడుము కొంటోంది.

"ఇలాంటి పరమ సామరస్య మొకటున్నదనీ తెరచి చూపేందుకు (తెలియజేసేందుకు) దానిని కనుగొనుటకు దారి చూపేందుకు శ్రీ అర విందుడు మన మధ్యకు వచ్చారు." అని అమ్మ వివరించారు—అస్తు. అట్టి శ్రీమాతారవిందులకు ప్రణామాలు.

# శ్రీ అరవిందుని అజన్మ ప్రతిభ

రచన : చెలసాని నాగేశ్వరరావుగారు

[సోదరులు శ్రీ చెలసాని నాగేశ్వరరావుగారు ఆజన్మాంత బ్రహ్మచారి, నిరంతర సాధకులు. ఇది వారు నాకోరికు వ్రాసి పంపగా అది ఈ పుస్తక ప్రచురణ సమయములో నా కందినది వ్రాస్తున్నాను. చదవండి;]

1. శ్రీమాత, శ్రీ అరవిందుల మహనీయతనుగురించి ఎంతవిన్నా, ఇంకా వినాలనే ఉంటుంది. తనివితీరదు! అని ఒకసారి మీరు అపేక్షను వెలిబుచ్చారు నిజమే, ఆ దృష్టిగలవారికి తనివితీరదు, 'చెవులకు తనివయ్యే ననెడి చెనటియుగలడే!' అనే భాగవత వచనముగూడగలదు. ఒకనవలను ఒకసారి చదివితే, మళ్ళీ దానిని ముట్టబుద్ధిగాదు. కాని మహాత్ముల విషయము వేరు. వారిని గురించి విన్నదికూడ- ఒకసారి విన్నదికూడ-తరిచిన కొలది వింత చవులను ఊరించును.

2. ఇపుడు శ్రీ అరవిందుని గురించి ఇతః పూర్వము మనము వినని విషయము ఒకటి చెప్పకుందాము - కనీసము నేను విననిది. దానిని ప్రథమముగా పఠించునపుడు - 'అబ్బా! శ్రీఅరవిందుడు ఎంత గొప్పవాడు!' అని ఒడలు జలదరించింది. ఆ హర్షమును మీతో పంచుకొందును.

3. 1947, ఆగష్టు 15 న శ్రీ అరవిందు డిచ్చిన సందేశములోని వాక్యాలివి.

4. "1947 ఆగష్టు 15—స్వతంత్ర భారతమునకు జన్మదినము.... ఆగష్టు 15- నా జన్మ దినము కూడ, ఈ సంయోగమును ఒక యాదృచ్ఛిక సంఘటనగా నేను భావించడములేదు, ఏ కార్యముతో నేను జీవితము నారంభించానో, ఆ కార్యముపై, నా అడుగులనునడుపు భగవచ్ఛక్తి వేసిన

ఆమోదముద్రయని, అధికారముద్ర యని నేను స్వీకరించుతున్నాను. ఈ స్వాతంత్ర్యము ఆ కార్యముయొక్క ప్రథమ సాఫల్యము...."

5. ఈ ప్రకటనను మనము ఇదివరకే విన్నాము. స్వాతంత్ర్యము ఆవిర్భవించిన తర్వాత చేసిన ప్రకటన ఇది. శ్రీ అరవిందుడు అంతకు ముందు ఆ విషయమును ప్రస్తావించలేదుగదా? అయినప్పుడు అది తన కృషి ఫలితమే అని ఎలా అనుకోవాలి? ఎలా నమ్మాలి?

6. శ్రీ అరవిందుడు 1905 లోనే తన భార్యకు అతి గుప్తముగా బెంగాలీ భాషలో వ్రాసిన లేఖలో అతి స్పష్టముగా పై సూచనను చేశారు. అప్పటికి వారు యోగమును ఆరంభించను కూడ లేదు. ఆ లేఖలోనికొన్ని అంశాలివి :

7. ఈ పతిత జాతిని సముద్ధరించగల శక్తి నా యందున్నదని ఎరుగుదును. అయితే ఇది కండబలము కాదు, ఆ కండబలముతో కత్తిని చేపట్టి నేను కదన రంగానికి పోవడంలేదు. అది జ్ఞానశక్తి, జ్ఞానమూలమైన ఆత్మశక్తి, ఆత్మశక్తి యనే ఒక వస్తువున్నది....

8. "ఈ నా భావము నేడు రెక్కలు విప్పిన ఒక మధుర భ్రాంతి కాదు, అది నిన్నటిదికూడా కాదు. అసలు నా పుట్టుకే ఈ భావముతో, అది నా రక్తములోనే ఉన్నది. ఈ మహత్తర కార్యము నిర్వహించేందుకు భగవంతుడే నన్ను భువిపైకి పంపాడు....అయితే ఈ గమ్య ప్రాప్తిని నా జీవిత కాలములోనే గాంచగలనని నేననడంలేదు. కాని గమ్యప్రాప్తి మాత్రం తథ్యం...."

9. ఇదిగో, దీనినే మొదటిసారిచదివినపుడు తనువుపులకరించింది. తన కర్తవ్య జ్ఞానము తనకు భువిపై కన్ను విప్పిన దగ్గరనుంచి కలదట. ఇది ఎంత అపూర్వము! జన్మ ప్రతిభ ఇట్టి జ్ఞానముగల వారెవరున్నారు? పైగా అందుకొరకు భగవంతుడే తన్ను పంపాడట. ఈ కర్తవ్యజ్ఞానము,

భగవత్ప్రేరణా జ్ఞానము - ఉభయము ఉండబట్టే 4 వ పేరాలో 'నా అడుగు లను నడుపు భగవచ్ఛక్తి' అన గలిగారు.

10. ఇక తాను సాధించవలసిన కార్యమెలాంటిది? అది భగీరథ కార్యము, కాదు అంతకు మించినది. భగీరథుడు ఆకాశ గంగను అవత రింపజేసి తన పూర్వులను తరింపజేశాడు. ఇక శ్రీ అరవిందుడో, భగవ చ్ఛక్తిని అవతరింపజేసి భారత జాతినంతను ప్రబోధించి పైకెత్త నెంచి కట్టాడు! బాలారవిందుని రక్తములో ఉరకలు వేస్తున్న భావన ఇది! బాలారవిందుని ఈ భవ్య దృశ్యము మనకెలా కన్పిస్తోంది!

11. అమెరికాలోని పరిస్థితిని గురించి ఒక రచయిత యిలా వాపోతాడు:

12. "అమెరికా వారి ప్రతిభ దాదాపు సమస్తమును మార్చివేసింది —అమెరికాలోని మనలను తప్ప, ముందు మనము మారితేనే తప్ప, సమాజ మును మార్చడం కేవలం అసంభవము."

13. ఇక మనలను మార్చడానికీ [illegible] మాత్రమే మార్చ గల మనశ్శక్తి చాలదు. అందుచేతనే నాది కండబలముగాదు, నాది ఆత్మశక్తియని శ్రీ అరవిందుడు 7 వ పేరాలో స్పష్టపరిచారు.

14. మనలను మార్చడమంటే, మన చేతనయందు పరివర్తనగొని రావడం, దీనికి సంబంధించే మాతృశ్రీ ఇలా అంటున్నారు—"చేతనా పరి వర్తనము వినా, పరిస్థితుల పరివర్తనము సాధింపజూడడం వృధా భ్రమ మాత్రమే." అట్టి చేతనా పరివర్తనానికి మనస్సును మించిన దైవశక్తిని లేక ఆత్మశక్తిని అవతరింపజేసుకోవాలి. ఈ అవతరణ (Descent) శ్రీ అరవిందుని యోగానికి వెన్నెముక. అందులోనే పూర్ణయోగ వైశిష్ట్య మున్నది.

ఆమోదముద్రయని, అధికారముద్ర యని నేను స్వీకరించుతున్నాను. ఈ స్వాతంత్ర్యము ఆ కార్యముయొక్క ప్రథమ సాఫల్యము...."

5. ఈ ప్రకటనను మనము ఇదివరకే విన్నాము. స్వాతంత్ర్యము ఆవిర్భవించిన తర్వాత చేసిన ప్రకటన ఇది. శ్రీ అరవిందుడు అంతకు ముందు ఆ విషయమును ప్రస్తావించలేదుగదా ? అయినప్పుడు అది తన కృషి ఫలితమే అని ఎలా అనుకోవాలి ? ఎలా నమ్మాలి ?

6. శ్రీ అరవిందుడు 1905 లోనే తన భార్యకు అతి గుప్తముగా బెంగాలీ భాషలో వ్రాసిన లేఖలో అతి స్పష్టముగా పై సూచనను చేశారు. అప్పటికి వారు యోగమును ఆరంభించను కూడ లేదు. ఆ లేఖలోనికొన్ని అంశాలివి :

7. ఈ పతిత జాతిని సముద్ధరించగల శక్తి నా యందున్నదని ఎరుగుదును. అయితే ఇది కండబలము కాదు, ఆ కండబలముతో కత్తిని చేపట్టి నేను కదన రంగానికి పోవడంలేదు. అది జ్ఞానశక్తి, జ్ఞానమూలమైన ఆత్మశక్తి, ఆత్మశక్తి యనే ఒక వస్తువున్నది....

8. "ఈ నా భావము నేడు రెక్కలు విప్పిన ఒక మధుర భ్రాంతి కాదు, అది నిన్నటిదికూడా కాదు. అసలు నా పుట్టుకే ఈ భావముతో, అది నా రక్తములోనే ఉన్నది. ఈ మహత్తర కార్యము నిర్వహించేందుకు భగవంతుడే నన్నీ భువిపైకి పంపాడు....అయితే ఈ గమ్య ప్రాప్తిని నా జీవిత కాలములోనే గాంచగలనని నేననడంలేదు. కాని గమ్యప్రాప్తి మాత్రం తథ్యం...."

9. ఇదిగో, దీనినే మొదటిసారిచదివినపుడు తనువుపులకరించింది. తన కర్తవ్య జ్ఞానము తనకు భువిపై కన్ను విప్పిన దగ్గరనుంచి కలదట. ఇది ఎంత అపూర్వము! జన్మ ప్రతిభ ఇట్టి జ్ఞానముగల వారెవరున్నారు ? పైగా అందుకొరకు భగవంతుడే తన్ను పంపాడట. ఈ కర్తవ్యజ్ఞానము,

భగవత్ప్రేరణా జ్ఞానము - ఉభయము ఉండబట్టే 4 వ పేరాలో 'నా అడుగులను నడుపు భగవచ్ఛక్తి' అన గలిగారు.

10. ఇక తాను సాధించవలసిన కార్యమెలాంటిది? అది భగీరథ కార్యము, కాదు అంతకు మించినది. భగీరథుడు ఆకాశ గంగను అవతరింపజేసి తన పూర్వులను తరింపజేశాడు. ఇక శ్రీ అరవిందుడో, భగవచ్ఛక్తిని అవతరింపజేసి భారత జాతినంతను ప్రబోధించి పైకెత్త నమకట్టాడు! బాలారవిందుని రక్తములో ఉరకలు వేస్తున్న భావన ఇది! బాలారవిందుని ఈ భవ్య దృశ్యము మనకెలా కన్పిస్తోంది!

11. అమెరికాలోని పరిస్థితిని గురించి ఒక రచయిత యిలా వాపోతాడు:

12. "అమెరికా వారి ప్రతిభ దాదాపు సమస్తమును మార్చివేసింది—అమెరికాలోని మనలను తప్ప, ముందు మనము మారితేనేతప్ప, సమాజమును మార్చడం కేవలం అసంభవము."

13. ఇక మనలను మార్చడానికి [illegible] మాత్రమే మార్చ గల మనఃశక్తి చాలదు. అందుచేతనే నాది కండబలముగాదు, నాది ఆత్మశక్తియని శ్రీ అరవిందుడు 7 వ పేరాలో స్పష్టపరిచారు.

14. మనలను మార్చడమంటే, మన చేతనయందు పరివర్తనగొనిరావడం, దీనికి సంబంధించే మాతృశ్రీ ఇలా అంటున్నారు—"చేతనా పరివర్తనము వినా, పరిస్థితుల పరివర్తనము సాధింపజూడడం వృథా శ్రమ మాత్రమే." అట్టి చేతనా పరివర్తనానికి మనస్సును మించిన దైవశక్తిని లేక ఆత్మశక్తిని అవతరింపజేసుకోవాలి. ఈ అవతరణ (Descent) శ్రీ అరవిందుని యోగానికి వెన్నెముక. అందులోనే పూర్ణయోగ వైశిష్ట్యమున్నది.

15. పతిత భారతమును ఉద్ధరించాలి. అది ఆత్మశక్తికే సాధ్యము —అనే జ్ఞానము శ్రీ అరవిందునికి ఆబాల్యమునుండి ఉన్నప్పటికీ, ఆశక్తిని ఎలా అవతరింపచేయాలి అనే దానికి ఆయన తన పూర్ణయోగానికి రూపు రేఖలుదిద్ది, అంతకాలము సాధించవలసి వచ్చెను.

పూర్ణయోగములో సాధనా సమన్వయమేకాదు, సాధ్యసమన్వయము కూడ ఉన్నది. దాని లక్ష్యము వైయక్తిక సంసిద్ధి మాత్రమేకాదు. సామాజిక సంసిద్ధి దాని పరమ లక్ష్యము. ఈ విషయమునే సహేతుకముగా శ్రీ అరవిందులు ఇలా వివరిస్తున్నారు :

"వ్యక్తి తనయందు తానునివసించిడంలేడు, తనయందు మాత్రమే నివసించడంలేదు. సమాజమునందుకూడ నివసిస్తున్నాడనిమనము గుర్తించాలి. మరియు వ్యక్తిగత విమోచన సంసిద్ధులు మాత్రమే ప్రపంచమునందు భగవంతుడు సాధించ నెంచిన పరమార్థముకాదు. మన విమోచన యొక్క పూర్ణోపయోగములో ఇతరుల, మానవాళియొక్క విమోచనము అంతర్భాగమగును. మనలో భగవత్సంకేతమును సాధించి, మరి కొందరి యందు దానిని రేకెత్తించి, దానిని ఇంకను విస్తరింపజేసి, చివరకు దానిని విశ్వవ్యాప్తము గావించినపుడే మన సంసిద్ధియొక్క పూర్ణప్రయోజనము దక్కును."

పూర్ణయోగముయొక్క ఈ ఆశయముకూడ అసాధారణమే. భగవత్సంకల్పము నంటిపట్టికొని పురోగమించువాడు గావున శ్రీ అరవిందునికి ఈ లక్ష్యము సాక్షాత్కరించెను. నేను నాలో సిద్ధిపొంది, నేనే అయిన ఇతరులలోకూడ సిద్ధి పొందాలి. అపుడే నాసిద్ధి పరిపూర్ణము కాగలదు. అదే అసలు పరిపూర్ణత ! ఈ లక్ష్యమును గమనించి మనము బెదిరిపోతాము — నాముక్తి కొరకే ఏండ్లూ పూండ్లూ పడుతూవుంటే, ఇక అందరి ముక్తికొరకు ఎక్కడ శ్రమించను — అని దిగులు చెందుతాము :

నా స్వీయ ముక్తికే అయితే పూర్ణయోగముయొక్క ఆవశ్యకత లేదు—అని శ్రీ అరవిందుడే ఒకసారి చెప్పివేశారు. ఆది నుంచి అందరి ముక్తిని, సిద్ధిని సాధించాలనే ఆకాంక్షాశయాలు తనకుండబట్టే, పూర్ణ యోగానికి పూనుకున్నారు. బాల్యములో లక్షించిన లక్ష్యము నిమిత్తము ఆయన ఆజన్మాంతము చలించకుండా తన జీవిత హవిస్సును ఎలా ఆహుతి గావించారో !

సంసిద్ధికి సంబంధించి ఒక రహస్య సత్యము. సంసిద్ధి ఒక నిశ్చల స్థితి కాదు, అది ఒక శిఖరాగ్రముకాదు, అది ఒక అవధి (Extreme) కాదు. అది సమతాయుక్తమైన అనంతమగు పురోగతి. ఈ విషయమై అమ్మ సత్యమును ఇలా ఆవిష్కరించుతున్నారు.

"సంసిద్ధి ఒక శిఖరమూకాదు, ఒక అవధీకాదు. నిజానికి అవధి అనునది లేనేలేదు. అవధి ఉంటే, అది సంసిద్ధి కానేకాదు. ఏలన, ఆ అవధి వరకు పురోగమించి, యిక ముందుకు వెళ్ళేందుకు వీలులేక, ప్రకృతి అంతవరకు సాధించిన దానిని భగ్నము గావించి, తిరిగి వెనుకకు పోతుంది. అయినప్పుడు దేనిని భగ్నము గావించడానికి వీలున్నదో అది సంసిద్ధి ఎలా అవుతుంది?" అని అమ్మ ప్రశ్నించుతున్నారు. ఉదాహరణకు ప్రకృతి శరీరమును భగ్నము కావించుతోంది. అంటే శరీర విషయములో ఇంత దనుక సంసిద్ధిని సాధించలేదన్నమాట. అలాగే ఇంతవరకు ఏరంగ ములోనూ ప్రకృతి నిజమైన సంసిద్ధిని సాధించనేలేదని అమ్మ ఉద్ఘాటిం చారు. కారణము, ఇంతవరకు మానవుడు అందుకోగలిగిన గరిష్ఠ ప్రమా ణము నిష్క్రియస్థితి మాత్రమే—అని అమ్మ తెలియజేస్తున్నారు. "సంసిద్ధి ఒక నిష్క్రియస్థితి గాదు, అది ఒక సమత, సక్రియ సమత" అని అమ్మ సిద్ధాంతము.

సంసిద్ధి స్థితి గాదు, గతి అన్నప్పుడు — అందులో అంతర్గతమై ఒక అపూర్వ సత్యం ఉన్నదని మనము గ్రహించగలము. పురోగమిం

చూతూ ఉన్న సంసిద్ధియొక్క ప్రతి దశకూడ సంసిద్ధియే కావాలి. అంటే ఒక సంసిద్ధి నుంచి మరొక సంసిద్ధికి పోతాము : అంటే, అజ్ఞానమునుంచి జ్ఞానానికి గాక, జ్ఞానమునుంచే జ్ఞానానికి పోతాము. ఉదాహరణకు, సక్రియ సంసిద్ధిని ప్రకృతి పరివర్తనముద్వారా మనము సాధించినపుడు, దేహము, ప్రాణము, మనస్సు వానిపైనున్న అనేకానేక అంతస్తులు అలాగే నిలిచి వుంటాయి, వాటిలో అజ్ఞానమయ ప్రకృతిలేదు కనుక.

కావున సామూహిక ముక్తియే మన లక్ష్యమని శ్రీ అరవిందులు అన్నప్పుడు మనము బెదిరిపోనవసరములేదు. మనలో విమోచన సంసిద్ధులు విరాజిల్లుతూ వుంటాయి గాన, ఇతరుల ముక్తికొరకు పడేపాటు బాధాకరముగాఉండదు. ఒకదశ తర్వాత అది లీలాప్రాయముగా ఉంటుంది. అహంలేని మనలో ఈశ్వరుడే వ్యవహరిస్తాడు గాన, ఆ వ్యవహారము అతని కెలా వీలో, మనకూ అలాగే అప్పుడు మన ప్రయాణము వెలుగు నుంచి వెలుగునకు. ఆ దశలో ఇతరుల చీకటిలో మునిగిపోకుండానే, తద తీతులమై వారికి వెలుగు ప్రసాదించ గలుగుతాము. ఇంత చెప్పినప్పటికీ, అందులోనూ కష్టములు లేకపోలేదు. శ్రీమాత శ్రీ అరవిందులు ఎలాంటి కష్టములనుభవించుతున్నారో, అది మనకు ఇంచుకంత తెలుసు. కాని వారు అదే సమయములో ఆ కష్టాలకు అతీతులుకూడా గావుననే, అంతటి కష్టాలను అనుభవిస్తూనే, దానిని లీలగాకూడ అనుభవిస్తారు.

కొన్ని యోగ సంప్రదాయాలలో ఈశ్వర ప్రసక్తిలేదు, ఉండగూడదని వాదించే శాఖలుకూడ వున్నాయి. కాని యోగానికి అవశ్యం ఈశ్వరుడు కావాలని శ్రీ అరవిందులు ఇలా చెప్తున్నారు.

"యోగములో మనకు మూడు భావాలుంటేనే తప్ప, అది ఆచరణ సాధ్యముకాదు; పరస్పరామోదముతో వ్యవహరించే మూడు పక్షాలు అచట ఉండి తీరాలి — ఈశ్వరుడు, ప్రకృతి, అంతరాత్మ, ప్రకృత్యంతరాత్మలు

మాత్రమే వుంటే, అంతరాత్మ ప్రకృతి బద్ధమై ఉంటుందిగాన, అది నత్త నడకతో సాగే ప్రకృతిని అంతగా మించిపోలేదు. కావున ప్రకృతికి అతీతము తద్విముక్తము, తదధికము అయినదేదో వుండి, ప్రకృతిపైనా, మనపైనా పనిజేస్తూ, మనలను తనలోనికి ఊర్ధ్వముగా ఆకర్షించుకుంటూ, మన ఆరోహణకు నయానో, భయానో ప్రకృత్యామోదమును సమకూర్చవలసి వుంటుంది.

"ఇదిగో, ఈ సత్యమే ప్రతియోగశాస్త్రములోను అవశ్యముగా ఈశ్వర భావానికి తావు కల్పించుతుంది. మనయోగానికి లక్ష్యము ఈ ఈశ్వరుడే, ఈ పరమాత్మయే. ఇతడే మనకు తేజోమయ సంస్పర్శను, లక్ష్య ప్రాప్తికి ప్రభూతశక్తిని ప్రసాదించును." ఈశ్వరునికి యోగములో, ముఖ్యముగా పూర్ణయోగములో, ఇట్టి స్థానమున్నది గావుననే, ఈ విషయమును 4వ పేరాలో ప్రస్తావించారు శ్రీ అరవిందులు. 8వ పేరాలో ఆ ఈశ్వరుదే నన్నీ భువిపైకి పంపాడనికూడ ఉద్ఘాటించారు.

ఈశ్వరుడు పంపగావచ్చి, ఈశ్వరశక్తితో, ఈశ్వర కార్యమును జన్మ ప్రవృత్తి సచేతనముగానిర్వర్తించిన పరమ ప్రతిభావంతుడు శ్రీ అరవిందులు.

# శ్రీ మా త సం దే శా లు

ఇక్కడ, ఒక పనిని ఒకని కిచ్చినపుడు, దానిని చేయదగిన రీతిగా చేసేందుకు సంపూర్ణ అనుగ్రహ సామర్థ్యములు సదా ఆ పనితోనే అతని కివ్వబడినాయి. ఆ అనుగ్ర సామర్థ్యములను అతడు అనుభవములో (ఒకవేళ) గుర్తించలేకపోతే—అతని వైఖరిలో ఏదో తప్పిదమున్నదన దానికే అది నిదర్శనము. అయితే అతనికి విశ్వాసము కొరవడి వుండాలి; లేకపోతే పాతదారులకు, పాత మతాలకు దిగ జారిపోవడం చేత అతడు స్వీకరణశక్తిని కోల్పోయి వుండాలి!

1—10—52

నీవు ఏకాకివిగా ఉన్నావని ఎప్పుడూ అనుకోవద్దు. నీకు సహాయ పడుతూ, నిన్ను నడుపుతూ నీతో వున్నాడు ఈశ్వరుడు. అతడు నిన్ను ఎన్నడూ భంగ పుచ్చని సఖుడు. తన ప్రేమతో ఊరట గలిగించి, బలము నిచ్చే మిత్రుడు విశ్వాసము కలిగి వుండుము. అతడు నీకు ప్రతి విషయ మును చేసిపెట్టును.

29—3—52

"నిరాశా నిస్పృహలకు లోనుగాకుము. సమస్తమూ నశించిపోయి నట్లు కన్పించినపుడే, సమస్తమూ సమకూరును. ఇదే సత్యం!" అని ఓ ప్రభూ! నీవు మాకు స్పష్టీకరించావు.

1—1—1953

శ్రీ అరవింద ప్రభూ! ఇది నూతన సంవత్సరమున అందరకు యిచ్చిన నా సలహా: "ఎట్టి విషయంలోనూ ఆత్మ స్తుతి యెన్నటికీ వద్దు, నీ పనులనే మాట్లాడనీ."

1954

కడకు దైవేచ్ఛకు ప్రతికూలంగాఎంతటి మానవ సంకల్పమూ నెగ్గ జాలదు.

బుద్ధిపూర్వకంగా ముమ్మాటికి మనము పైవ పక్షమే వుందాము. పర్యవసానం దిగ్విజయం రూఢి.

1955

ఆ శుభ దినము రాగలదు. వచ్చి తీరును. ఆనాడు చివరిసారిగా ఆ దివ్యశక్తుల బారినుండి బైటపడి, ప్రపంచము నందున్న సమస్త సంపత్తి భువిపై భగవత్కార్య నిర్వహణమునకే తనను తాను సహజముగా, సంపూర్ణముగా సమర్పించుకొనును.

6—1—55

మహోన్నత విజయాలకు ఆర్భాటం అన్నదే శూన్యం.

నూతన సృష్టియొక్క ఆవిర్భావము "టాంటాం" చాటించరాదు. (చాటింపుద్వారా ఘోషింపబడదు)

1956

# 29-2-1956 బుధవారము

# సమిష్టి ధ్యాన సమయములో మాతృశ్రీ ప్రవచనము

ఈ సాయంకాలము దృఢమూ, గాఢమూ అయిన దివ్య సన్నిధి మా మధ్య విలసిల్లెను. విశ్వమును మించి విస్తరిల్లిన సజీవ సువర్ణాకృతితో ఒప్పారిన నేను, దైవమునుండి ప్రపంచమును వేరుచేయు, ఒక బ్రహ్మాండమైన స్థూల సువర్ణ కవాటమున కెదురుగా నిలబడి ఉంటిని.

ఆ కవాటమున కేసి చూస్తూ ఉండగా "సమయ మాసన్నమైనది" అని ఒకే ఒక చిత్త వృత్తితో తెలిసికొని, (బలీయముగా) ఇచ్ఛించాను, ఇచ్ఛించి, రెండు చేతులతో సువర్ణ మయమగు ఒక పెద్ద సమ్మెటను పైకెత్తి; ఆ కవాట పై ఒక దెబ్బ, ఒకే దెబ్బ వేశాను. ఇంకేముంది, ఆ కవాటము తుత్తునియలై పోయింది!

అపుడు అతిమానస చేతనా శక్తి తేజస్సులు భువిపై అవిచ్ఛిన్న ధారగా దుమికి ప్రవహింప సాగెను.

29—2—60

ప్రభూ! నీవు ఇచ్ఛించిన దానిని నేను నిర్వహించు తున్నాను. పృథివిపై నూతన ఉషోదయ మవుతోంది; ఒక నూతన ప్రపంచము జన్మించుతోంది. నీవు మాట యిచ్చిన విషయాలు నిజము లవుతున్నాయి.

29 ఫిబ్రవరి—29 మార్చి, 1956

ప్రభూ! నీవు తలపెట్టిన పరివర్తన కార్యమును పరిపూర్ణ మొనరించ డానికే మేమీ భూతలముపై నున్నాము. అదే మా ఏకైక సంకల్పము, అదే మా ఏకైక తత్పరత (Pre Occupation). అది మా ఏకైక

వృత్తి (Occupation) కూడ అగునట్లు అనుగ్రహించి, మా సమస్త క్రియలు ఆ ఏకైక గమ్యమును చేరడానికే అనుకూలించు నట్లు చేయుము.

1957

ఏ దుశ్శక్తులకు అందని ఆ ఒక్క పరాశక్తి మాత్రమే జయించ గలిగేది; ఈ లోకాన్ని ఉద్ధరించేది. దేదీప్యమానం కాబడిన దేహంకాని శిలువ ఎక్కిందికాదు.

1957

నా దివ్య స్వభావమును పరిత్యజించి, ఈ నీచమగునేలపై వచ్చి చేరాను. జనన మరణ రూపమగు యవనికల మధ్య అజ్ఞానాంధకారమున తీవ్రముగా శ్రమించుతూ, మానవ దశను అధిరోహించాను.

భయంకరాకారముగల పంక గర్భములో బహుకాలముగా, అతి లోతుగా త్రవ్వుతూ సంగీత సదృశమగు సువర్ణ జీవన నదీ ప్రవాహము నకు ఒక మార్గమునూ, మరణ మెరుగని చైత్యాగ్నికి ఒక గృహమును నిర్మించుతున్నాను.

24—11—1960.

జడ ప్రకృతి స్వరూపిణీ! ఓ తల్లీ! నీవు మాట అన్నావు. తోడు యిచ్చెదనని. మరి అప్పుడు ఆ సహచర్యశోభ అంతులేని ఆహ్లాదము.

1958

అతి దృఢమై మొద్దుబారి శిల అయి, ఊపిరి సలపనంత కూపమై యున్న ఈ అగాధ నిశ్చేతస్సు యొక్క పాతాళాన్ని తన్నిన తన్నుతో ఒక మహాశక్తి—విజృంభించి నన్ను ఒక అఖండ విశాల అనంతంలో ఉద్భవింప కంపిస్తూన్న క్రొత్త క్రొత్త జగత్తుల మధ్యకు ఎత్తి వేసింది.

1959

ఇక్కడకు సాధన నిమిత్తం వచ్చి, చిత్తశుద్ధితో సాధన చేసే వారు మాత్రమే—వారే ఇక్కడ సంతోషముగా సంతృప్తి చెంది ఉండ

గలరు. ఇతరుల కెప్పుడూ ఏదో వ్యధే ఉంటుంది. కారణం, వారి కోరికలు తీరడం లేదు (ఇక్కడ)

2–10–1959

ఒక పని ప్రారంభించి, దానిని సగములో విడిచివేసి, మరొక చోట మరొక పనికి పూనుకోవడం—ఇది ఆరోగ్యకరమైన అలవాటు కాదు.

5–7–1959

(సత్యమును) తెలిసికోవడం మంచిదే,

ఆచరణ మరింత గొప్పది.

మరి 'తాదాత్మ్యం' - అదే సిద్ధి

1960

# శ్రీ అరవింద సందేశము 1961

జగజ్జననీ! నీవేకదా కారణము—ఈఆత్మ పరమేశ్వరుని సమీపింప ప్రాకుటకు!

ఆంతరంగికమైన సంబంధము—అనగా ఆ పరమేశ్వరి ఉనికిని అనుభవంలోనికి తెచ్చుకొనుట, ఎల్లవేళల ఆమె కటాక్షమునకై ప్రాధేయపడుట, మరి దారి చూపుతూ, నడుపుతూ, ఆదుకుంటూ వస్తూన్న ఆ దివ్య శక్తిపట్ల మెళకువ, నిండు భక్తి, స్థూలంగా దగ్గరలో ఉన్నా లేకపోయినా ఆ తల్లి సామీప్యం ప్రతిక్షణం అవగాహన చేసుకొనుట.

ఈ సంబంధము సాధకుని మనస్సు, ప్రాణము, భౌతిక చేతస్సులను ఆదేవి పరంచేసి వాటికి దైవ సంపన్నతతో సామరస్యం సంపాదించే వరకు వదలదు.

*　　　*　　　*

ఈ ప్రపంచము దయనీయమగు దౌర్భాగ్యాలతో నిండి జాలిగొల్పుతోంది. కాని, మలిన వ్యవహారము విడనాడ జాలనంతటి క్షుద్ర, దుర్బలాత్మలే అందరిలోనూ మిక్కిలి జాలిపడదగినవారు.

18—9—63　　　　　　　　　　　　మాతృశ్రీ

శ్రీ అరవింద సంఘము—అఖిల ప్రపంచ మహాసభలు.

10. 14 ఆగష్టు, 1964

సదస్సు చర్చనీయాంశాలకు మాతృశ్రీ సమాధానాలు.

(1) మానవాళి ఎట్లు ఏకము కాగలదు?

తన మూలమును తెలిసికోవడంచేత.

(2) మానవుల యందు మానవ సమైక్యతా జ్ఞానమును పెంపొందింప జేయడానికి మార్గమేది?

ఆధ్యాత్మిక విద్యావిధానము అంటే, అంతశ్చేతనా వికాసానికి అధిక ప్రాముఖ్యమిచ్చే విద్యావిధానము, ధార్మిక, లేక నైతిక బోధనకు

గానీ, జ్ఞానమని వ్యవహరింపబడే భౌతిక జ్ఞానానికి గానీ ఈవిద్యావిధానము అంతప్రాముఖ్య మివ్వదు.

(3) చేతనా పరివర్తన మంటే ఏమిటి ?

చేతనా పరివర్తనమును నూతన జన్మతో పోల్చవచ్చును. సత్తయొక్క ఒకానొక ఊర్ధ్వ భూమికలో జన్మించడమే అది.

(4) చేతనా పరివర్తనము పృథివీ తలముపై మానవజీవితమును ఎలా మార్చగలదు ?

ఒకానొక ఉచ్చతర శక్తి, ఒకానొక విశుద్ధతర తేజము, ఒకానొక సమగ్రతర సత్యముభువిపై అభివ్యక్తమవడానికి మానవ చేతనలో వచ్చిన మార్పు సదవకాశమును కల్పించును.

* * *

మానవుని యందలి ఆకాంక్షాబీజము ఆధ్యాత్మికతా జలముతో పోషింపబడితే, మానవుడు పెరిగిపెరిగి భగవద్భావములో పర్యవసించును.

24—4—1966

మానవులారా, దేశములారా, ఖండములారా! సత్యమో, అంధకార బంధురమైన అగాధమో, ఏది కావాలో వెంటనే ఎన్నిక చేసితీరాలి. (ఈ సమయము విలంబము నెంతమాత్రము సహించదు.)

1—1—67

దివ్యప్రేమ అభివ్యక్తిని త్వరితపరచడానికి ఉత్తమమార్గమేమంటే పరసత్యముయొక్క విజయాధి పత్యాలకు చేయూత నివ్వడమే!

27—2—68

ప్రపంచమొక మహా పరివర్తనానికి సిద్ధపడుతోంది. నీ సహాయ మందిస్తావా ?

1–1–1970

ఆకాంక్షించు వారికి అనుగ్రహ సాహాయ్యములు. అనుక్షణమూ ఉండనే ఉన్నవి. పైగా విశ్వాసముతో, నమ్మికతో, స్వీకరించినపుడు వాని శక్తిసామర్ధ్యములు అపారమై ఒప్పారును.

*　　　*　　　*

సాధకుడు భగవంతుని మీద ఆధారపడి వుండాలి. అయినా తాను సాధన చేయవలసినదే. అయితే అతని సాధన ఆ ఆధారభావానికి అనువైనదిగా ఉండాలి. ఏలనంటే, భగవంతుడు సాధనా ప్రమాణమును (తీవ్రతను) బట్టి ఫలమివ్వడు. హృదయ ప్రమాణమును బట్టి మాత్రమే ఫలమిస్తాడు. "నేనిలాకావాలి, నేనలాకావాలి, నేనెలాకావాలి?" అనే–చింత కూడ శ్రేయస్కరముకాదు. "నా కోరిక ననుసరించికాక, భగవంతుడు నేనెలా కావాలని ఇచ్ఛించితే అలా కావడానికి సిద్ధమైఉన్నాను" అని (స్థిరచిత్తముతో) చెప్పుకో : తక్కినదంతా ఆ ప్రాతిపదికమీదే పరిణమించాలి.

24–11–1971

# శ్రీ మాతారవిందుల వాణి

సేకరణ : చక్కా సత్యనారాయణ

చేతనా వికాసానికి ఈ ఆశ్రమము వంటి వాతావరణము మరెక్కడా లేదని—అమ్మే ఒక సందర్భములో వక్కాణించారు. అనుభవము నుంచి పలికిన అపూర్వ సత్యాలు కూడ వినాలని ఆసక్తి అనే ఆకలి వున్నచో వానిని చక్కగా జీర్ణము చేసుకోడానికి తోడ్పడును. నిజానికి అహంకారం విడిచి పనిచేయడంలోనే స్వేచ్ఛా సుఖాలున్నాయి అన్ని పనులు సామాన్యుల వలె చేస్తూ గర్వరహితులైన హెచ్చుమంది బ్రహ్మచారులు ఈ ఆశ్రమములో నున్నారు. వీరు బైట ప్రపంచమునకు వచ్చినచో ఎంతయో గొప్పగా పరిగణింపగలరు. సందేహములేదు. ఇటువంటి ప్రముఖపూర్ణ యోగ సాధకులు 'ఆనంద పుత్రుల' వంటి వారితో కలిసి పనిచేయడం సహజమైన ఆనందావిర్భావానికి శ్రీ అరవిందాశ్రమము అనుకూలమైన వాతావరణము.

ఆశ్రమములోని కొంతమంది బడిపిల్లలు శెలవలకు ఇంటికి వెళతామంటే శ్రీ తల్లిగారు వారించారు. 'మీ తల్లిదండ్రులకు మీరు చదువుకొని సంపాదించాలని మాత్రమే ఉంటుంది. ఆ భావము మీ మనస్సులను తెలియకుండానే కలుషితం చేస్తుంది' అని శ్రీతల్లిగారు తెలియజెప్పారు. మరొకసారి ఒక విద్యార్థి క్రిస్మస్‌నాడు చర్చిలోనికి వెడతానంటే శ్రీతల్లిగారు మందలించారు. 'శ్రీ అరవిందుడు తన జీవిత కాలమంతా మత దాస్యము నుంచి మానవులను విడిపించడానికి కృషిచేశారు. ఇప్పుడు నీవు వారి కృషికి విఘాతము కలిగించుతావా ?' అని ఆ విద్యార్థికి బోధించారు. కాని ఆరోవిల్‌లో నివసించ దలచినవారిని గురించి—'మతభావమును అతిక్రమించనివారు వారిమతములను ఉపాసించుకోవచ్చును.' అని వేరొకచోట అన్నారు. సామాన్యముగా మత మనునది ఆధ్యాత్మికానుభవముయొక్క (చిట్టము గట్టిన) బాహ్యరూపము మాత్రమే. అందుచేత ఆత్మపరిణతికి కావలసిన స్వేచ్ఛను అది అరికడుతుంది—అని శ్రీ తల్లిగారి భావము.

అందుచేతనే అట్టి ప్రతిబంధకాలు అతి తక్కువగా ఉండే ఆశ్రమములో నిజమైన సాధకులతో కలిసి పనిచేయడం అపూర్వ అవకాశమే అనుకో వాలి—ఆసక్తి, ఆకాంక్ష ఉన్నవారికి.

శ్రీ అరవిందులు ఒకచోట వాడిన సక్రియధ్యానం (Dynamie Meditation) అంటే ఏమిటని ఒక విద్యార్థి శ్రీతల్లిగారిని అడిగెను. అప్పుడు మాతృశ్రీ—"నిష్క్రియ ధ్యానంలో సర్వ వ్యాపారమును కట్టి వేసి ఒక విధమైన నిశ్చల సుఖమును అనుభవిస్తారు. కాని లేచిన పిమ్మట దాని ప్రభావము తన ప్రవృత్తిమీద కించిత్తుకూడ కనిపించదు. కాని కర్మసమయములోనే మనము భగవచ్ఛక్తితో సహకరించి, దానినిపనిచేయ నిస్తే, అది మన తత్వమును క్రమముగా మార్చివేస్తుంది. అది సక్రియ ధ్యానము—అని శ్రీతల్లిగారు వ్యాఖ్యానించారు. దీనిలోని స్వారస్యమును గ్రహించిన తరువాత, అది క్రమముగా మనకు సాధ్యపడిన పిమ్మట "అహో ! భగవ దర్పిత కర్మమార్గములో ఎంత ప్రభావమున్నది ! అని మనకే అనిపించగలదు పైగా, పూర్ణయోగ లక్ష్యం శరీరముతో సహా ప్రకృతి పరివర్తనము. ఉదాహరణకు, శరీర చేతన మారాలంటే, నిష్క్రియధ్యానములో కూర్చుంటే అయ్యేపనిగాదు అది. భౌతికములోనున్న భగవంతుని (The Divine) కనుగొని, సేవించాలి అని కూడ శ్రీ తల్లి గారు చెప్పిరి.

ఈ కర్మయోగము పోను పోను చాల సులభమవుతుంది. కర్మచేసే వాడు వాడే గనుక ప్రతిక్షణము ఇది సాగవచ్చు, ఏదో అవనస్థులమై కూర్చొన్న అరగంట మాత్రమేగాక ! అయితే అహంకారము తగ్గుతూ వచ్చి, మనము ఈశ్వరుని కంకితమైనపుడే ఈ యోగము మనకు అధికాధికముగా అధీనమవుతుంది.

మాతృశ్రీ మనలను సదాకనిపెట్టి పాలించుతూనే ఉన్నారు, నడుపుతూనే ఉన్నారనే స్మృతిని పనిచేస్తూన్నపుడు కూడ నిలబెట్టుకోవడానికి ప్రయత్నించితే—అది ఆంతరంగిక సంపర్కమునకు దారి తీస్తుంది. యీ ప్రయత్నములో చేతన ద్విధా విభజింపబడి బాహ్య భాగము పనితో ఉన్న స్థితికీ, అంతరభాగము శ్రీమాతమీద అధికాధికముగా నిలిచి వుంటుంది. క్రమముగా శ్రీమాతయే మన కార్యమును చేస్తూన్నారనేది కూడ తెలియ వస్తుంది. ఇది కర్మవిముక్తి. ఈ దశనుంచి కర్మ ఆనందమయముగాకూడ పరిణమిస్తుంది. అప్పుడు మనము శ్రీ తల్లిచేతిలో పిల్లలము. శ్రీ అరవిందులు యిట్టి శ్రీ తల్లి స్మృతికి అత్యంత ప్రాధాన్యమిస్తారు. చేతనా విభాగమునుకూడ నొక్కి చెపుతారు.

మన కంటిముందేకాదు, కంటికి వెనుక కన్నా హృదయంలోకూడ శ్రీతల్లిగా రున్నారు. ఈ హృదయస్థమైన శ్రీతల్లిని దర్శించడమే అన్నింటికి మించిన దర్శనము—అణువులో శక్తిని దర్శించడం కంటే విశిష్ట దర్శనము : ఆమె అందరి హృదయాలను అధివసించి వున్నది గనుకనే అన్నివేళలా మనలను చూస్తున్నారు.

ఒక నూతన చేతన భూమిపై అవతరించి ఉద్ధృతంగా పనిచేస్తున్నదని శ్రీ తల్లిగారు అనేకసార్లు వివరించారు. ఈ చేతన స్వేచ్ఛగా పని చేయాలంటే మేమేమి చేయాలి ? అని ఒకరు ప్రశ్నించగా;

1. చేతులుసాచి స్వీకరించుస్థితిలో నుండుము[Be Receptive]
మరియూ,

2. విధేయ మృదుత్వమును గలిగి ఉండుము [Be Plastic]అని శ్రీ తల్లిగారు చెప్పిరి. ఆ చేతన ప్రవేశించడానికి స్వీకార ప్రవణత, ప్రవేశించి మనలను సునాయాసంగా మలచి మార్చడానికి మృదుత ఈ గుణములు పిల్లలలో ఎక్కువ సహజంగావుంటాయి. శ్రీ తల్లిగారిపట్ల మనము

కూడ పై రెండు ధర్మాలు కలిగి ఉండాలి. మనము అమ్మముందు పిల్లల మనే భావనకూడ పై ధర్మాలకు చాల తోడ్పడుతుంది.

ఈ చేతన (ఇదికూడ అమ్మచేతనే) శరీర జీవాణువులకు తమ యందున్న భగవంతుని జ్ఞప్తికి కలిగించుతున్నదనీ, అందుచేత అవి భగవత్ప్రభావానికి, ఉన్మీలితమై (తెరచుకొని) ఆ ప్రభావముచేతనే నడవబడడం నేర్చుకుంటున్నాయనీ, నడుపబడుతున్నాయనీ, శ్రీ తల్లిగారు తెలియపర్చారు. అంటే భౌతిక చేతనకుండే యంత్రపాయత్వమును విడనాడి చేతనా పరిప్లుతమై అమరత్వము వైపుకు సాగిపోతున్నాయి - శరీరామరత్వము !

"వ్యక్తిగత సంపత్తిని విడనాడి విముక్త్యానందములను చవి చూడ దలచినవారికి ఆరోవిల్ ఆదర్శనివాసము"అని అమ్మ వచనము. యోగసాధకులతోకలసి ఆశ్రమములో పని చేసే కర్మ ఈ విధముగా యోగముగా రూపొందుతుంది. ఈ సాధనా సిద్ధికి ఎంత కాలము పట్ట వచ్చో, పడుతుందో దానిని గురించి ఒకమాట. అయితే మధ్య కాలములోకూడ పురోగతిని సాధిస్తూనే ఉంటాము. అపూర్వ విజయాలను పొందుతూనే వుంటాము. అతిమానస సిద్ధికి ఎంత కాలమవసరమో గుర్తించినపుడు శ్రీ మాతారవిందుల కృషిని గురించి మనకు కొన్ని అపోహాలు తొలగిపోతాయి.

"వెనుకటి కాలంలో మనస్సు భువిపై నవతరించిన తర్వాత, ఆ మనస్సును ధరించిన ప్రథమ మానవుడు ఆవిర్భవించడానికి దాదాపు పది లక్షల సంవత్సరాలు పట్టింది. కాని అతి మనస్సు త్వరితగతిని ముందుకు సాగడం చేత, దానికంత వ్యవధితో పనిలేదు. మానవుడు అతి మనస్సును అపేక్షించి ప్రతీక్షించుతున్నాడు గనుక, కొలది వేల సంవత్సరాలలోనే అతి మానవుడు రూపొందగలడు." అని మాత యదార్థమును స్పష్టీకరిం

చారు. మరియు ఇలా అనిరి "పృధివీతలముపై అతిమానస అభివ్యక్తి— ఒక వాగ్దానము మాత్రమే కాదు — ఇప్పుడది సజీవ సత్యము - పరమ యధార్థము. ఇది ఇపుడు తన కృషిలో నిమగ్నమై ఉంది. ఇక్కడి భూమి మీద, అత్యంత అంధులు, అత్యంత జడమతులు, చివరకు అత్యంత విముఖులుకూడ దానిని అవశ్యముగా గుర్తించి తీరవలసిన ఒకానొక శుభదినము రాగలదు. వచ్చి ఒప్పారగలదు."

ఈ సందర్భములో అమ్మ చెప్పిన ఈ సంఘటన ఎంతో ఆసక్తి దాయకము. 1956 నాటికే సుమారు 20 సంవత్సరాలకు పూర్వము ఆశ్రమ వాసానికి వచ్చిన కొంతమంది బుద్ధిమంతులు ఆశ్రమంలో ఎవరో చనిపోవడం చూచి—"అయ్యో! అయితే మనము ఇక్కడికి రావడమెందుకు? మనము అరుదెంచిన ఆశయం అమరులము గావాలని గదా!" అని వాపోయి నిష్క్రమించారట!

మరికొందరు అతిమానస అవతరణము జరిగిందని విని ఆశ్రమానికి పరుగుపెట్టి 'మాకు దీనివలన ఏమిలాభము కలుగుతుందని' ప్రశ్నించేవారట. అమ్మ ఆ మాటవిని—"లాభమా! ఎట్టి అసంబద్ధమైన భావము!" అని ఆశ్చర్యము అభినయించారు. దీనిపై అమ్మ ఎంతో వివరించారు.

"ఎవరు అతి మనస్సుకొరకు మాత్రమే జీవించుతూ వచ్చారో, ఎవరి జీవితానికి తదాంక్షయే ఆధారమో, ఎవరు దానిని గురించియే కలలు గన్నారో అట్టి ఆశ్రమవాసులుకూడ— దాదాపు అందరు ఆ శుభముహూర్త మరుదెంచి, అతి మనస్సు నిజముగా అవతరించినపుడు దాని గుర్తించలేకపోయారు. కనీసం పసికట్టలేకపోయారు. అయినపుడు యెవరో ఉత్సుకతా మాత్రముతో వచ్చిన ఆగంతకులు — 'మాకేమి లాభం కలిగింది? కలుగుతుంది? అని" ప్రశ్నించడం, ఎంత అసంగతం? — అని అమ్మవారి ధోరణిని నిరసించారు. లాభం పొందాలనుకోవడమే రవంత లాభముకూడ

పొందలేకపోవడానికి మార్గమని చెప్పి మన అపోహలను ఎత్తిచూపారు. అమ్మ ఈ సందర్భములో ఇంకా చెప్పిన ఈ అక్షరాలు హృదయ ఫలకంపై లిఖించుకోవలసిన అద్భుత బీజాక్షర సముదాయము.

"దేనిని స్వీకరించడానికైనా ఉత్తమ సూత్రం — లాగుకోవడం కాదు — ఇచ్చుకోవడం — స్వాహా చేయడం కాదు. స్వాహా కావడం, నూతన జీవితానికి తమను తాము అర్పించుకోడానికి అభిలాష గల వారి యందే — ఔను — వారి యందే ఆ నూతన జీవితము ప్రవేశించును. కాని ఆ నూతన జీవితమును ఎవరు తమ లోనికి లాగుకోవాలని చూస్తారో వారు — (తాము ప్రవేశించ వలసిన ద్వారమును) తమ ద్వారమును తమ అహం చేతనే మూసివేసు కొందురు. ఇదే సార సంగ్రహాము," ఇది అమ్మ అందించిన మంత్రరాజము. దీనికి సంబంధించిన అనుభవాలను— అవి లవలేశములే అయినా — మనము ఎంతో శ్రద్ధగా, మహాత్తర ధనముగా భద్రవరచు కోదగును.

ఈ చెప్పిన దెవరో మనము స్మరించుకుంటూ ఉండాలి। 'తత్రాపి నమాహాత్మ్య జ్ఞాన విస్మృత్యపవాదః' — నారద భక్తి సూత్రాలు [అర్థము:- గోపికల ప్రేమ అంత ఘనిష్ఠ మైనప్పటికి, వారు కృష్ణుని మహాత్మ్యమును విస్మరించారనే అపవాదునకు అందులో తావు లేదు.] అలాగే మనము కూడ అమ్మ సన్నిధానంలో, అమ్మ ప్రేమ చవిచూస్తూ ఉన్నప్పటికీ అమ్మ ఎవరో విస్మరించ కూడదు.

వేదాలలో, అందులోనూ ఉపనిషద్భాగము నందుకంటే, సంహితా భాగములో వైదిక ఋషులు అతి మనః శిఖరాగ్రమును అందుకొన్న సందర్భాలు తనకు అక్కడక్కడా కాన వచ్చాయని శ్రీ అరవిందులు వెల్లడించారు. కాని దాని అవతరణకు వారు ప్రయత్నించలేదు. దానికి కారణము అప్పటికింకా అతి మనోవతరణకు కాలము పరిపక్వము కాలేదు.

శ్రీ రామ, శ్రీ కృష్ణాద్యవతారములు రాకపోయినట్లైయితే, శ్రీ అరవిందులుకూడ ఇప్పుడీ పని చేయగలిగే వారుకాదు. అందుచేత ఎవరెక్కువ, ఎవరు తక్కువ, అనే దానిని గురించి కాదు మన మనసులను కలవరపెట్టుకోవలసింది. అంతా దైవనిర్దిష్టమైన ఒక ప్రణాళిక ప్రకారము జరుగుతోంది. అని గ్రహించి, ఆత్మోద్ధరణము, జగత్కల్యాణము సాధించుకోవడం అవసరము.

"చేతనా స్వభావములయొక్క సంపూర్ణ పరివర్తనమువలె ఈ విధానముకూడ సంపూర్ణమూ, సమగ్రమునై ఒప్పారుతోంది. ఈ విధానము ప్రాత పద్ధతులను, ఆ పద్ధతులకంటే విశిష్టమగు తదన్య పద్ధతులను అంశ ప్రక్రియగానూ, ప్రస్తుత సహాయముగాను మాత్రమే చేపట్టును. ఈ విధానమును—(దీని పూర్ణరూపమును) కనీసం స్పష్టంగా ప్రకటించి, సాధించడం జరిగిన దీనిని బోలిన మరిదేనినైనా గానీ ప్రాచీనయోగాలలో నేను కనుగొనలేకపోయాను. అలా కనుగొనడమే జరిగితే (వినూత్న) మార్గాలను ఛేదించి, నిర్మించడానికి నా కాలమును వృధాపుచ్చేవాడినికాదు. ముప్పది సంవత్సరాలు పరిశోధనలో మునిగి అంతః సృష్టికి పూనుకోవలసిన అవసరముండేది కాదు. గుర్తులుపెట్టి, నిర్మాణానికి వుపక్రమించి, నిర్దుష్టంగా పటాలు తయారుచేసి, రాయిపరచి, రక్షణ కల్పించి, ప్రకటించబడిన ప్రాచీనమార్గాలే ప్రాప్తమైతే, ఆయాసము కలిగించని చిన్న పరుగులతో గమ్యస్థానమగు స్వస్థానానికి త్వరత్వరగా పురోగమించి, నిరపాయంగా చేరుకొని ఉండేవాడను. మన యోగము పాత బాటలపై తిరిగి పయనించడంకాదు. అది ఒక ఆధ్యాత్మిక సాహస యాత్ర" అని శ్రీ అరవిందులు వ్రాసిరి.

పూర్ణ యోగలక్ష్యము :— (1) సత్తాస్వభావాల పరివర్తనము. (2) పూర్ణయోగ ప్రయోజనము:— భువిపై దివ్య జీవనము. (3) ఈలక్ష్యమునందలి వైశిష్ట్యము :— ప్రయోజనమునందలి అపూర్వత. (4) పూర్ణ

యోగ సోపానములు :— చైత్యీకరణము (Psychicisaton) ఆత్మీకరణము (Spiritualisation) అతిమానసీకరణము (Supramentalisation) (5) పూర్ణయోగసారము :— అవరోహణము, మనకు ఆరోహణ మొదటిమెట్టు మాత్రమే. అది అవరోహణకు సాధనము మాత్రమే. ఆరోహణచేత అందిన నూతన చేతనయొక్క అవరోహణే ఈ యోగసాధనను తెలిపే ప్రత్యేక ముద్ర, నిజమైన ప్రామాణ్యము. (6) పూర్ణయోగ సమగ్ర విధానము :— అన్ని పద్ధతులను ఉపయోగించుకుంటుంది. గాని వాటిని దాటి ముందుకు వెళ్ళే స్వతంత్ర సంపూర్ణ విధానము. (7) పూర్ణయోగానికి అర్హత :— పిలుపు వచ్చినవారే అర్హులు, తక్కినవారు ఆ పిలుపును పొందడానికి ఆకాంక్షించుకోవాలి. (8) దీని ఆధారములు :— నిశ్చల మనోత్వము. (9) ఇక్కడ ఉన్మీలన, నివేదనా సమర్పణాత్రయము యొక్క ప్రాముఖ్యము. (10) ఈ యోగములో సాధకుడు ఈశ్వరుడు : సమర్పణ సమగ్రమైన కొలదీ ఈ సత్యము మనకు పొడకట్టి స్పష్టపడుతుంది. (11) శ్రీమాత, శ్రీ అరవిందుల వారి సాయమావశ్యక మిక్కడ, చరమ దశలలో వారి భౌతిక సన్నిధిలో వుండడం కూడ అవసరమని శ్రీ అరవిందుని మాట. (12) ఈ యోగము అపూర్వమైనా, ఒక దశనుండీ అత్యంత సులభం. కారణం సాధకుడు ఈశ్వరుడు; అహంకారము వుండదు గాన ప్రతి కదలిక ఈశ్వర సంపర్కముచేత లభించే ఆనందమునే అందిస్తుంది.

శ్రీ మాతారవిందులకు ప్రణామాలుతో.

# శ్రీ దివ్య జననియొక్క
# శ్రీ అరవిందుని యొక్క శక్తి

పరిణామము నందుతూన్న పృథివీచేతన క్రిందనుంచి పిలిచే పిలుపునకూ, పైనుంచి పరమేశ్వరుడు దానికిచ్చే అనుమతికీ మధ్య మధ్యవర్తిత్వము నెరిపేశక్తి దివ్యజననియొక్క సన్నిధి సామర్ధ్యములే. ఈ జనని సామీప్యమున నుంటూ వారి ముద్దుబిడ్డలమైన మనము, వారి భౌతిక శరీరములో లీనమైన, విశాలమైన మూర్తిస్వరూపమునకు సరియైన నామధేయము తెలియక ఊరక "మాత" అని పిలచుచున్నాము.

వేదములు ఈ మాత నిత్యశక్తిని "అతిథి" అని పిలుచుచున్నవి. ఉపనిషత్తులు ఈ మాతను "ఉమా" అని దేవతలకు కాంతిని ప్రాప్తింపజేయుచున్న హిమగిరి శిఖరములని వర్ణించుచున్నవి. తంత్రములు ఈ మాతను "ఆదిమహేశ్వరి" అని ఆరాధించుచున్నవి.

అమ్మ ఫొటోలోని ముఖములోనికి, ముఖ్యంగా అమ్మ నయనాల లోనికి చూడడంచేత మనకు లాభం కలుగుతుంది. క్రమముగా, విగపట్టకుండా, అనన్యముగా అమ్మను చూస్తూ అమ్మ తత్వములోనికి ప్రవేశించడం జరుగుతుంది. ఈ సందర్భముగా 1971 నవంబరు బుల్లెటిన్‌లోనే ఉన్న, నీరద్‌బరన్ అమ్మ, ఉత్తర ప్రత్యుత్తరాలలోని అంశము-

నీరద్‌బరన్ : అమ్మా ! నిన్నుగానీ, నీ ఫొటోనుగానీ, వీక్షించి, నందువల్ల లాభముంటుందా నాకు ?

అమ్మ:- అవును. ఉంటుంది. చాలామందికి ఉంటుంది.

గమనిక : మాతృశ్రీ ఫొటోలో, ఆ దివ్య నేత్రాలలోనికి నియతంగా నిత్యమూ ఒకసారి చూస్తే, అప్పుడు ఎలాంటి అనుభూతులో ! అందుకే సర్వద్వారాలు అనుకోవచ్చును మనమా నేత్రాలను.

ప్రజలు సామాన్యముగ బాహ్యమునే చూచెదరు; అంతరమున చూచుటకు వలయు సూక్ష్మదృష్టి, వికాసము వారికింకను కలుగలేదు. శ్రీ తల్లిగారు 29-9-1971 తేది సందేశములో "శ్రీ అరవిందుడు సదా ఇచ్చట సన్నిహితుడయ్యే ఉన్నాడు. విశుద్ధ చిత్తుడవు. విశ్వాసపూర్ణుడవు కమ్ము. ఇదియే ప్రథమ నిబంధన (Condition)." మరియు శ్రీ అరవింద చేతనకు ఉన్మీలితుడవై, అది నీ జీవిత పరివర్తనము సాధించడానికి అవకాశమిమ్ము.

శ్రీ అరవిందులు "తననుగూర్చి వ్రాసుకొన్న ఒక పద్యము :-

తే॥ గీ॥ మనుజరూపంబు దాల్చిన
మహిమ నాది, మూఢ జనులు
తెలియరు, మోసమగును,
పరమ పురుషుడనేనను భక్తికల్గు,
వారలకు, సాధ్యమగు నన్ను అరయగాను;

శ్రీ అరవిందులు"

శ్రీ తల్లిగారు ఏనాడో వ్రాసుకున్న రాధికాప్రార్థన మన అందరకు ఆదర్శమైనది. కనుక ఈ దిగువ వ్రాస్తున్నాను.

రా ధి కా ప్రా ర్థ న

హే ప్రభో, ఆనాడు ప్రథమ సందర్శనమునందే నిన్ను నా హృదయేశ్వరునిగా నా యాత్మప్రభునిగా గుర్తించితిని, నా అర్పణము నికనంగీకరింపుము.

నా సకల సంకల్పములును, నా సకలోద్రేకములును, నా హృదయమందలి సకల రసానుభవములును, సకలేంద్రియ జ్ఞానములును నా జీవసమందలి సకల ప్రవృత్తులును, నా దేహమందలి ప్రత్యణువును, నా హృదయ శోణిత (రక్తము) మందలి ప్రతికణమును, సర్వమును నీదియే

నేనిక కేవలము నీ దాననే, నిశ్శేషముగ (అంతయు) సంపూర్ణముగ నీదాననే, నాయెడ నీ ఇచ్ఛ యెటులనో యటులే యైయుండెదను. నా కొఱకై జీవనమునో, మరణమునో, దుఃఖమునో, భోగానుభవమునో, బాధానుభవమునో, నీవెద్దాని నిర్ధారణ (నిశ్చయము) చేయుదువో నీనుండి నాకు సంప్రాప్తించు ఆ ప్రతివరముగూడా ఎల్ల వేళల నాకొక దివ్యవరమై దీపింప (ప్రకాశింప)గలదు; నీయొక్క ఆ ప్రతి దివ్యవరమును అద్దానితో గూడ నీయొక్క దివ్యానందమును నాకు దెచ్చియే యిచ్చును—

The Mother

ది 24-4-1972 వ తేదిని శ్రీ తల్లిగారిచ్చిన సందేశము:-

"అతడు కానరాకుండానే మనలోని చీకటిభాగములందు ప్రవేశించి ఆ చీకటినే తెర చేసుకొని దానివెనుక తన కార్యము గావించుతూ, ఆ చీకటిభాగములుకూడ తదవసరమును గుర్తించి, మారడానికి స్వయముగా సంకల్పించుకొనేవరకు సర్వజ్ఞుడైన ఈ అతిథి సూక్ష్మరూపమున మనలను నడుపుతునే ఉండును. ఇచ్చటి సమస్తము ఒక సమున్నత ధర్మమునకు విధేయతను అలవరచుకోవాలి; సూక్ష్మాతిసూక్ష్మములగు మన శరీర కణములుకూడ ఆ అమరజ్యోతిని తమ గర్భమున ధరించి మించాలి."

—శ్రీమాత

గమనిక:- మానవునకు దేవుడొసగిన శక్తులను పాడుజేసికొన్నచో అతడేమి చేయగలడు? అతడు జంతువుకంటే హీనమైపోవును. ఏలన జంతువు హాని కలుగజేయు ఆహారము తినదు. పానీయము సేవించదు.

ఈ విశాల ప్రపంచమున, మంచిపనులు చెయుటకెన్నియో గలవు; వాని భారమును వహించుట కెందరో మహాపురుషులు గలరు. కాని నిజముగా లోపించినది. మంచికార్యమును కడపటివరకు నడిపించగల కార్య దీక్షయే.

# శ్రీ మాతృ వచనములు

"మానుష ప్రేమను నైష్ఠుర్యము ఎల్లప్పుడును అనుసరించును— దైవప్రేమ మాత్రమే ఆశాభంగము కలిగించదు."

5-5-1945

"నేను ఏ రాష్ట్రమునకు, ఏ ధర్మ శాస్త్రమునకు, ఏ సంస్కృతికి, ఏ సమాజమునకు, ఏ గోత్రమునకు, చేరినదానను కాను. అయితే భగవంతునకు మాత్రము చేరినదానను."

"నేను ఏ ప్రభువునకు, ఏ రాజ్యాధికారికి, ఏ ధర్మశాస్త్రమునకు, ఏ సమాజిక సాంప్రదాయములకు లోపడను. అయితే భగవంతునకు మాత్రము విధేయురాలను."

మానవు డాచరింపవలసిన నాలుగు సోపానములలో దైవదృష్టి గలిగి యుండుట మొదటిది. దైవానుభూతిని బొందియుండుట రెండవది. దివ్యజీవితమును గాంచుట మూడవది. దైవమునకై జీవించుట నాల్గవది యగును.

దేహి నీపై ఆదిపత్యమును వహింపరాదు. అది ఆత్మానుసారిగా నడుచునదిగా నుండవలెను. దేనిని డాంబికముగా (గొప్పగా) చెప్పకుము. నీ పనులే నిన్నుగూర్చి తెలుపనిమ్ము.

ఈ సందర్భములో శ్రీ అరవిందులు వ్రాసిన పద్యము జ్ఞాపకము వస్తూయున్నది:-

తే॥ గీ॥ ఎవరు తమ్ము శేషముగను నివ్వగలరో,
దైవమున కన్ని భాగంబులందు నెరిగి,
వారికై శాంతి తేజంబు వరుసగాను,
సౌఖ్యమున్నత జ్ఞానంబు శక్తి మిగుల
అతి విశాలత విజ్ఞాన అంతములును,

అంతులేనట్టి ఆనంద వార్ధులెల్ల,
మించు సంపదల్గల్గించి పెంచి మరల,
తన్నె తానిచ్చి బ్రోచును సతతముగను.

—శ్రీ అరవిందుడు.

# శరీర - మనస్సు

శరీరమునకు [కూడ] ఉండే మనస్సునందు అతి మనస్సు అభివ్యక్తమయినపుడే, దాని సన్నిధి (యిక్కడ, భువియందు) స్థిరపడిపోగలదు.

29—2—1972 — మాతృశ్రీ

శరీర మనస్సు—అనే పదము, ఆ శరీరమనస్సుయొక్క స్థానము, అది నిర్వహించవలసిన పాత్ర మున్నుందు శ్రీ అరవిందులు ఒక లేఖలో ప్రస్తావించారు. ఆలేఖ అనువాదమిది :

“శరీరానికి, శరీరములోని ప్రతికణానికి కూడ అంధకారమయమైన ఒకానొక మనస్సున్నది. నిజానికి ప్రతిరక్తాణువులోనూ, ద్రవ్యాణువులోనూ కూడ ఆ మనస్సు దాగి వున్నది. జడవాదియైన జర్మన్ శాస్త్రవేత్త హెకెల్ కూడ పరమాణువు నందు ఇచ్ఛాశక్తి గోచరించు చున్నదని ఎక్కడో వచించినాడు. విద్యుత్ కణములయొక్క గమనమునందు ముందుగా నిర్ణయించడానికి శక్యముకాని ఒక స్వేచ్ఛావర్తనము తెలియ వచ్చింది. దానిని పురస్కరించుకుని ఆధునిక భౌతిక శాస్త్రము కూడ జడ మనబడే జడములో కూడ ఇచ్ఛాశక్తి ఉన్నదని చెప్పడము ఒక అలంకార

ముగా భావించకూడదనే నిశ్చయానికి వచ్చినది. ఆ ఇచ్ఛాశక్తి దాగియున్న ఒక గుప్త సత్యముయొక్క ప్రక్షిప్తమగు ప్రతిబింబమే కానోపునని ఆధునిక శాస్త్రము అభిప్రాయపడుచున్నది." ఇక శ్రీఅరవిందుడు తన స్వీయాభిప్రాయమును, కాదు అనుభవమును ఇలా ప్రవచించారు, అదే లేఖలో :

"ఈ శరీర మనస్సు స్పష్టముగా స్పృశింపదగిన సత్యమే. అది అంధకారమయము, యాంత్రికమై తిరిగిన గాడిలోనే తిరుగుతూవుంటుంది. పైగా ఇట్టే మరచిపోవడము దాని స్వభావము. అలాగే నూతన విషయమును అది స్వభావము చేతనే నిరాకరిస్తుంది. అందుచేతనే అతిమానస శక్తి తనయందు ప్రవేశించడానికి, ప్రవేశించి శరీర ధర్మములను మార్చివేయడానికి అది ఒక ప్రధాన ప్రతిబంధకముగా అడ్డుపడుతుంది. కాని ఒకసారి మారిపోయినపుడు, మారిపోయి కార్యసమర్థమైనపుడు, స్థూలప్రకృతియందు అతి మానస తేజఃశక్తుల సంస్థాపనకు మిక్కిలి విలువగల ఉపకరణమై విరాజిల్లగలదు."

ఇక్కడ మనము శ్రీ అరవిందుని ఆధిక్యము గమనించాలి! జడ పరమాణువులలో కూడ ఇచ్ఛాశక్తి, అంటే మనస్సు ఉన్నదని, కొన్ని ప్రయోగ ఫలితములు ద్వారా శాస్త్రజ్ఞులు పరోక్షముగా కనుగొన్నారు. శ్రీఅరవిందులు అది ప్రత్యక్ష సత్యమంటున్నారు. పైగా, ఆ మనస్సుయొక్క ధర్మాలను కూడ ఏకరువు పెట్టారు. అక్కడితో ఆగలేదు. అతిమనస్సు ఒకటి ఉన్నదని, దాని శక్తుల వ్యాపారమునకు ఆ శరీరమనస్సు స్థిరమైన ఉపకరణము కాగలదని, అలా అయినపుడే అతిమనస్సు భువియందు స్థిరపడగలదని ఉద్ఘాటించారు !

శ్రీఅరవిందులు తన అనుభవమును పురస్కరించుకుని, పై లేఖలో వెలిబుచ్చిన నిర్ణయానికి వచ్చారు :- అనే కుతూహలము మనకు కలుగ

వచ్చును. డిశంబరు 22, 1971 - న మాతృశ్రీ శిష్యునితో జరిపిన సంభాషణ లోని సంగతి మన కుతూహలమును తీర్చగలదు. అది ఇది :

"ఆయన (శ్రీ అరవిందులు) కనుగొన్నదేమంటే -అతి మానసము తనలో ప్రవేశించింది. పిమ్మట ఉపసంహరించుకున్నది. తిరిగి ప్రవేశించింది. మళ్ళీ ఉపసంహరించుకున్నది. అది స్థిరముగా నిలువలేదు."

ఇలా శ్రీ అరవిందులు దేహముతో నున్నకాలములో ఏమిజరిగిందో వెల్లడించి, అదే సంభాషణలో మాతృశ్రీ ఇలా అన్నారు :

"అతి మానసము ఇక్కడ స్థాపితము కావాలంటే, సుస్థిరము కావాలంటే, అధి భౌతిక మనస్సులో అడుగుపెట్టి అక్కడ కుదురుకుపోవాలి- అని శ్రీ అరవిందులు ఉద్ఘాటించారు. అనేక మాసాలనుంచీ సరిగా యీ కార్యమే నాలో అవిచ్ఛిన్నముగా జరుగుతోంది." ఈ కార్యము ఏ విధముగా జరుగుతోందో, శ్రీమాత ఇలా అభివర్ణించారు.

"సాధారణ మనస్సు ఉపసంహరించివేయబడింది. దాని స్థానమును భౌతిక మనస్సు ఆక్రమించింది. శరీరగతమైన ఈ భౌతిక మనస్సు విశాలమయింది. అదిపుడు విశ్వవ్యాప్తియై దృక్కోణముతో వస్తువులను చూస్తోంది. అది చూచే విధానమంతా అత్యంత భిన్నముగా మారిపోయినది. ఇపుడు భౌతిక మనస్సులో అతిమానసము పని చేస్తోందని కనుగొన్నాను. అసాధారణమైన అద్భుత క్షణములను గడుపుతున్నాను."

శ్రీమాతలో ఈ పరివర్తనానికి నాంది సాధారణ మనస్సుయొక్క ఉపసంహరణము. ఇక్కడకూడ అమ్మ పై శిష్యం కన్పించుచున్నది. అమ్మలోని సర్వ సమర్పణము మరెక్కడా నాకు గోచరించలేదని ఒకసారి శ్రీ అరవిందుడు ఆశ్చర్య చకితుడైనారు. (ఎప్పుడనగా 1926 నవంబరు 24 వ తేదిని అధి మనస్సు శ్రీ అరవిందుని యందు అవతరించిన దివ్య

దినము; తత్ప్రభావముచేత అప్పట్లో మహిమలు కో కోల్లలుగా వెల్లివిరిసి కొంతకాలము కొనసాగాయిట ! అప్పుడు శ్రీ అరవిందులతో శ్రీతల్లిగారిలా వివరించిరి. 'సృష్టి శబ్దము (The word of Creation) నా హస్తగతమయింది." సృష్టిశబ్ద మిపుడు నాచేతిలో వుంది. ఏమిచేయాలి అని అడిగారట, శ్రీ అరవిందులు కొంత తడవాగి చివరకు తన ముఖారవిందమును విప్పి ఇలా అన్నారు. "ఈ సృష్టి పదము అధి మనస్సుకు సంబంధించినది. అధి మనలోకమే అవతరించినను అందులోకూడ-అజ్ఞానమునకు తావు వుంటుంది. కనుక మనకు కావలసినది అతీత మనస్సు" అని అనగానే ఆమాటవిని శ్రీమాత వెంటనే తన గదికివెళ్ళి కొద్దిగంటలు చిత్తము నేకాగ్రముచేసి 'ఎప్పుడెప్పుడు అభివ్యక్త, అవతరణము !' అని ఎదురు చూస్తున్న ఆ అపూర్వ సృష్టినంతటిని శ్రీ తల్లిగారు అవతరింపజేసిరి !" శ్రీతల్లిగారివలె నిరపేక్ష, నిస్సంకోచముగా ఆత్మ సమర్పణము చేసిన వారిని నేనెక్కడా, ఎప్పుడూ చూచిఎరుగను. అశేషంగానూ, అవలీలగానూ తమను తాము సమర్పించుకొనే శక్తి బహుశః స్త్రీ రత్నములకే సాధ్యమేమో ! అదివారి సొత్తేనేమో" అని శ్రీ అరవిందులు నుడివిరి. ఆ సమర్పణ కారణముగానే జరిగింది అని అనుకోదగిన దానిని గురించి అమ్మ యిలా ప్రస్తుతం విషయము తెలియజేశారట. 18—12—1971 సంభాషణలో.

"నా స్వంత మనస్సు (సాధారణ మనస్సు) కేవలము పట్టి పంపివేయబడింది....నా కొరకు, నా కొరకు ఈపని చేయబడింది ఎలాగో నాకు తెలియదు. నేనేమి చేయలేదు. నాకు చేయబడింది. సమూలంగా చేయబడింది." ఆ సంభాషణలో మరొక సందర్భములో—

"ఈ సాధన ఒకరికి ఒకొక విధంగా ఉంటుంది....నా విషయంలో అది సమూలమై తీవ్ర రూపం ధరించింది. నా ఇచ్ఛకు అక్కడ తావేలేదు. ఇపుడు తెలిసిందా, అది ఎంత తీవ్రమో ?"

ఇలా తన ఇచ్ఛతో నిమిత్తము లేకుండానే తన మనస్సు దూరము చేయబడినపుడు, మనస్సు లేనివానివలె అమ్మకూడ పిచ్చిది కాలేదా ?— అంటే, అమ్మ చెపుతున్నారు.

"బాహ్య దృష్టికి నేను విమూఢనయ్యానని, నాకేమి తెలియలేదని నీవు చెపితే చెప్పుకోవచ్చు. ఈ మూఢత్వములోనే భౌతిక మనస్సు క్షణ క్షణము వికసింప నారంభించింది, క్రమానుభూతులద్వారా పెంపొందింది." ఈ సంధి సమయములో యింకేమి అసాధారణము జరిగిందో చూద్దాము.

" సమూల పరివర్తనము సాధ్యపడింది. అంటే, దానికి కారణం నేను నా అంతరాత్మపట్ల మిక్కిలిసచేతననై (Conscious) ఉండడమే. (ఏ అంతరాత్మ జన్మ పరంపరలో వికసించి రూపం ధరించిందో) అది అనుక్షణం నిలిచి పని చేసింది. ఈ అంతరాత్మ సన్నిధి స్థిరమై ఉండబట్టే, నేను యథాపూర్వం (మనసు లేనపుడు కూడ) ఇతరులతో వ్యవహరించ గలిగాను. అందుచేతనే బాహ్యముగా చెప్పుకోదగ్గంత మార్పు సంభవించ లేదు. అందుచేత (ఈ రూపాంతరానికి కీలకమేదని నీవు పదేపదే అడుగు తున్నావు గాన) నాకు తెలిసిందే నేను చెపుతున్నాను; అంతరాత్మముందుకు వచ్చి, స్థిరపడి, సమస్త సత్తపై - సమస్త శారీరకసత్తపై అధిపత్యము వహించి, ప్రాణసత్తకు మార్గమును చూపించాలి. అపుడే మన సత్తకు స్వీయ పరివర్తనము సాధించుకోడానికి సమయము చిక్కుతుంది.

"నా విషయములో శరీర — మనస్సుయొక్క రూపాంతరము అనివార్యమయింది—జరగకుండా ఉండేందుకు వీలే లేకపోయింది. కారణం నాలో అచేతన తప్ప మరేమీలేదు."

ఇపుడు మనము గ్రహించుకోగలవు, అంతరాత్మ వికాసానికి శ్రీమాత శ్రీ అరవిందులు అంత ప్రాముఖ్యమెందుకిస్తున్నారో, సాధారణ మనస్సు నిష్క్రమించితేనేగాని, శరీర మనస్సు వికసించదు. ఇక జీవన

క్రియలను చేపట్టి నడిపించడానికి అంతరాత్మ ముందుకువస్తేనేగాని, సాధారణ మనస్సు నిష్క్రమించడానికి వీలులేదు. పైగా అంతరాత్మ శరీర ప్రాణాలను నడుపుతూ ఉన్నపుడేగాని, శరీర మనస్సు పరివర్తనము చెందడానికి తగిన విశ్రాంతి, అవకాశము చిక్కవు.

శ్రీమాతలోవలె అంత పెద్ద ఎత్తున కాకపోయినా, మన సాధనా విషయములోకూడ అనేక ముఖ్యమగు మార్పులు మన ఇచ్ఛతో నిమిత్తము లేకుండానే జరిగిపోతాయి. ఒకొకప్పుడు వలదన్నా ఆ మార్పులు ఊరుకోవు. కారణం, జన్మాంతర సాధనచేత ఏర్పడిన సంస్కారమే అలా బలాత్కారముగా కూడ మలుపు త్రిప్పుతుంది. ముందుకు నెడుతుంది.

ఇక సమూలమగు ఈ పరిణామ దశలో వ్యక్తిగత భావము ఎలా పరిణమిస్తుందో, అమ్మ చవి చూపుతున్నారు :

"ఈ పరిణామములో ప్రాణికి, వ్యక్తికి తాను కేవలము నిర్వీర్యుడను (నిస్సహాయుడను) అనే భావము ప్రభవిస్తుంది. వ్యక్తియొక్క శూన్యత్వము, కేవల శూన్యత్వము, సామర్థ్య రాహిత్యము, అపుడు నీ.... ....నీ భారము దిగిపోతుంది, ప్రాణము తేలిక పడుతుంది. అతి సహజముగానే నీవు చిన్న పిల్లవానివలె మారిపోతావు. అపుడు భగవంతునితో నీవిలా చెప్పుకుంటావు :— "సమస్తము నాకు చేసిపెట్టుము' (నేను చేయవలసినదిగాని, చేయగలిగినదిగాని ఇపుడేదీ మిగిలిలేదు)—అని, అపుడు సకలము చక్కబడును, వెంటనే—వెంటనే చక్కబడును."

ఆది శక్తియైన అమ్మకు తిరిగి ఈ దశరావడం, ఈ దశనుండి పైన, చెప్పుకొన్న విశ్వ వ్యాపిదశతిరిగి విజృంభించడం——ఇదంతా ఎంత విచిత్రం ! అయితే శ్రీ అరవిందుడు వివరించినట్లు, అమ్మకు లోలోపల భగవతీ భావము పదిలమయ్యే ఉంటుంది. అమ్మగారి శరీర చేతనే ఆ విధముగా వివిధ దశలద్వారా శిఖరారోహణము చేస్తోంది.

1972 పురస్కరించుకొని అమ్మ—ఇచ్చిన 2 — వ సందేశమును ఇప్పట్టున చూడదగును.

పై విధముగా పరిణతి చెందిన శరీర మనస్సువలన కలిగె బాహ్య ఫలితాలు ? అమ్మ చెపుతున్నారు :

"నా చక్షువులు చూడడంలేదు—అని చెప్పడం సరిగాదు. యదార్థ మేమన, ఆంతర జీవితమును.........ఆంతర జీవితమును అభివ్యక్తము చేసే బాహ్యరూపమునే నేను చూస్తున్నాను. అలా అభివ్యక్తము చేయ లేని దంతా అస్పష్టముగానో, అవృతముగానో గోచరిస్తుంది. నేత్రము చూస్తోంది; కాని చూచేది బాహ్యేతరము — సమస్తమూ నవీనమే !" అందుచేతనే అమ్మ అంటున్నారు :

"ఇపుడు నేను మరొక వ్యక్తి నయ్యానని కచ్చితముగా చెప్ప గలను. (తన శరీరముయొక్క బాహ్యరూపమును స్పృశించుతూ) అదొ క్కటి మాత్రమే పూర్వమువలే నిలిచి ఉంది..........ఎంతవరకు అది మారగలదు ? శ్రీ అరవిందు డయితే చెప్పారు: భౌతిక మనస్సురూపాం తరము చెందినపుడు, శరీర రూపాంతరీకరణము మిక్కిలి సహజముగానే దాని అడుగు జాడల్లోనే జరుగుతుంది. అని సరే చూద్దాం."

శరీర మనస్సు పరివర్తనానికి, శరీర పరివర్తనానికి మధ్య నున్న అంతరమును గురించి అమ్మ మరొకచోట ఇలా వివరించుతున్నారు :

"ఇప్పటి ప్రశ్న ఏమిటంటే, శరీరము శరీర మనస్సును అనుగ మించగలుగునా ? అనుగమించాలంటే, శరీరము కేవలము సహించ గలి గితే సరిపోదు. అది నూతన రూపమును సంపాదించి, నూతన ప్రాణ ముతో స్పందించాలి ! అలా చేయగలదో లేదో నాకు తెలియదు. అయినా, కాకపోయినా బాధలేదు—చేతన స్పష్టముగా ఉంది. ఇక చేతన దానికి (అమ్మ శరీరమును చూపుతూ) అధీనముకాదు. ఈ కార్యములో శరీర

మును ఉపయోగింప వీలైతే మంచిదే కాకపోతే........అట్టి వస్తువులను మనమింకనూ కనుగొనవలసి ఉంది.

"అవును నూతన వస్తువులను కనుగొనాలి : పురాణ వ్యవస్థ ముగిసింది, ముమ్మాటికీ ముగిసింది.

"కనుగొనవలసినది జడ పదార్థముయొక్క నమనీయత (ప్రకృతి యొక్క మృదుత) అపుడు జడ ద్రవ్యము సదా పురోగమించ కలుగుతుంది. అవును అదే సంగతి :

"దాని కెంతకాలము పడుతుంది ? నాకు తెలియదు. దీనికి ఎంత అనుభవము అవసరం ? నాకు తెలియదు. కాని మార్గము స్పష్టముగాకన్పిస్తోంది, స్పష్టముగా కన్పిస్తోంది ?"

తన శరీరము రూపాంతరము చెందగలదో, లేదో తనకు తెలియదని అమ్మ అన్నపుడు మనకు ఆందోళన కలగడం సహజం, ఈ ఆందోళనకు ఈ క్రింది అనుభవముకూడ దోహదముచేస్తోంది. (18–12–71)

"[అమ్మ అటూ, ఇటూ, కొంచెము ఊగుతూ] జీవించనూవచ్చు, మరణించనూ వచ్చు, లేక శాశ్వతముగానూ జీవించవచ్చు — అనే అనుభవము ప్రతిక్షణమూ కలుగుతోంది—అని చెప్పుకోవచ్చు. ఈ రెండు ప్రత్యామ్నాయములను ఉన్న స్వల్ప భేదము ఎంత గ్రహించరానిదిగా ఉంటుందంటే; 'ఇలా చేస్తే జీవిస్తావు, అలా చేస్తే మరణిస్తావు' అని చెప్పడం సాధ్యం కాదు. ఇది ఉనికియొక్క ఒకానొక ప్రకారము, దీనిని వర్ణించడం దాదాపు అసంభవం."

దీనిపై, దీనిని 'బుల్లెటిన్' లో ప్రకటించబోయే సమయము 15–1–72 న అమ్మ ఇంకా ఇలా వ్యాఖ్యానించారు :

"ఒకసారి. ఇది, ఒకసారి అది — అనే ఈ అనుభవము పోను పోను స్థిరతరమవుతోంది. తీవ్రతరమవుతోంది. కాని అదే సమయములో,

దానితో పాటే, 'విజయ ప్రాప్తికి ఇదే సమయము' అనే జ్ఞానము అంతరాత్మ నుంచి ఉద్గమించుతూ ఉండగా, 'విజయ ప్రాప్తికి ఇదే క్షణము' అనే జ్ఞానము అంతరాత్మ ద్వారా (అమ్మ చూపుడు వ్రేలిని పైకెత్తి) పై నుంచి దుముకుతోంది." ఇది చదివిన తరువాత ఆందోళన తగ్గి, ఆవంత తృప్తి కూడ కలుగుతోంది. దీనికి సంబంధించే 22-12-71 మళ్ళీ ఇలా చెప్పారు :

"నీకు జీవితము కావాలా, నీకు మృత్యువు కావాలా, నీకు జీవితము కావాలా, నీకు మృత్యువు కావాలా ? అనే ప్రశ్నకు సంబంధించిన బలీయ మగు అనుభవము, పూర్వము తెలిపినట్లుగా, ప్రతి క్షణము ఉదయించుతూనే ఉంది....ఇదే సాగుతోంది. కానీ నిన్నో, లేక మొన్నో—సరిగా గుర్తు లేదు. 'లేదు! ఇపుడు ఈ ఊగులాటకు కాలము చెల్లిపోయింది—నాకు జీవితమే కావాలి, మరేదీ కాదు; అని శరీరము అకస్మాత్తుగా చెప్పివేసింది. ఇక అప్పటి నుంచీ పరిస్థితి మెరుగు పడుతోంది." అమ్మ శరీరము చేసిన ఈ నిర్ధారణ వలన మనకు మరింత తృప్తి, సంతోషము కూడ పొడము తున్నాయి.

ఈ నూతనానుభవము యొక్క అపూర్వతను గూర్చి అమ్మ అభిప్రాయము వినండి.

"ఆహా! ఇప్పటి అనుభవ పరంపరను అను వర్ణించడానికి ఎన్ని సంపుటాలు వ్రాస్తే సరిపోతుంది?........అది........అది అసాధారణముగా అభిరుచి కలిగించే విషయము. కే–వ–లము నూతనము, కేవలము నూతనము." ఇప్పట్టున శ్రీతల్లిగారు తన లోతుల లోనికి దిగి, మళ్ళీ (కొంచెము సేపు తర్వాత).

"శరీర మరణము వలన అవచేతన పరాజయ వాదిగా పరిణ మించింది. అవును. ఎంత పురోగమించినా, ఎట్టి యత్నము గావించినా

శరీరానికి మరణమే ముగింపు. ఎప్పటికైనా దానికదే పర్యవసానం— అనే భావము అవచేతనలో పాదుకొని పోయింది. కారణం, నేటి దనుక శరీరానికి సదా ఆ గతే పడుతూ వచ్చింది. కావున ఇపుడు జరుగుతున్న కృషి అవచేతనలో విశ్వాసమును ప్రవేశ పెట్టడానికే, రూపాంతర ప్రాప్తి నిశ్చయమనే భావమును దానిలో ప్రవేశ పెట్టడానికే. ఇక అది అనుక్షణము జరిగే సంఘర్షణ." ఈ సంఘర్షణ చేతనే, దీనికి సంబంధించిన శక్తుల యొక్క విరోధము వల్లనే అమ్మ శరీరము కూడ అంత కాలము ఏ నిర్ధారణ చేసుకోలేక ఊగులాడుతూ వచ్చింది.

అయితే మనము ఒకటి జ్ఞప్తి యందుంచుకోవాలి. శ్రీమాత శ్రీఅరవిందులకృషి సమిష్టికృషి, అంటే, మనఅవచేతనలోని అపనమ్మకము, విరోధముకూడ వారి కృషికి బాధాకరములే. అందుచేత వారు ప్రవచించి నది మనస్సున పట్టించుకుని, తదాచరణకుపూనుకొని మనము వారిఅపూర్వ కృషికి బాధ కలిగించ కుందుము గాక! అపుడు ఎన్ని సంపుటాలైనా అభి వర్ణించలేని అమ్మ విజయమునకు తోడ్పడు ఆ మహత్తర విజయమును పంచుకోగలుగుతాము! అస్తు.

చెలసాని నాగేశ్వరరావు.

# అతి మానవుడు

## (THE SUPERMAN)

మూలము :- శ్రీ అరవిందులు

అనువాదము :- ఏ. జి. కృష్ణమూర్తి.

## 3 - వ అధ్యాయము

## కర్మ యందలి యానందము

నీవు చేయు ప్రతి కర్మ యందును ఈశ్వరుడు, కర్త, యంత్రము- అనే మూడంశములు ఎల్లప్పుడును ఉన్నవి. ఈ మూటిని సరిగా అర్థము చేసికొని వాటిపై సరియైన అధికారమును కలిగియుండుటే కర్మరహస్యము; కర్మానంద రహస్యమున్ను—

ప్రపథమమున నీవు నేర్చుకొనవలసినది "నేను భగవానుని యంత్రమును, ఆయనను ఈశ్వరునిగా స్వీకరించుచున్నాను." అని, నేను అనిపిల్వబడు ఈ కర చరణాత్మకమైన బాహ్య వస్తువే యంత్రము. అది మనస్సు యొక్క మూస; శక్తియొక్క ప్రేరణ బలము. ఆకారము కలిగిన యంత్రము, స్ప్రింగులు, చక్రములు, దంతములు, నానావిధ కీలకోపాయములతో నిండిన వస్తువు. దీనిని కర్తయనిగాని ఈశ్వరుడనిగాని పిలువకుము. ఇది ఎన్నటికిని కర్త ఈశ్వరుడు కానేరడు.

"నేనొక దివ్య యంత్రమును" అని వినయముతో సగర్వముగా భక్తి ప్రపత్తులతో ఆనందముతో స్వీకరింపుము.

ఈశ్వరుని అనవద్యమైన (లోపములేని) యంత్రమగుట కంటె మహత్తమైన గర్వము గౌరవము వేరొకటిలేదు.

ప్రపథమున సర్వ భావముతో విధేయుడగుట (వినయముగల వాడగుట) అలవరచుకొనుము. ఖడ్గము నేనెక్కడ భేదించగలనని ఆలో

చించదు. బాణము నేనెక్కడ కొట్టగలనని అడుగదు. యంత్రములోని స్ప్రింగులు మాత్రమ ఫలితముగ దేనిని ఉత్పన్న మొనర్చగలమని నిర్ధారించి యడుగవు. ఈ విషయములన్నియు ప్రకృతియొక్క ఉద్దేశక్రియల ద్వారా నిర్దిష్టమైనవి. చైతన్యవంతమైన ఈ యంత్రము తన ప్రకృతి యొక్క శుద్ధమైన స్వధర్మమును ఎంత అధికముగా అనుభవించి అనుసరించుట నేర్చుకొనునో అంత త్వరితముగ తనచే నుత్పన్నమైన కర్మ అనవద్యము నిర్దిష్టముకాగలదు. ఇంద్రియస్పానము(సన్నపు సిరము) ప్రేరితమై దేహమానసికోపకరణముల తిరుగుబాటుకులోనై తాను కోరుకొనిన క్రియా కలాపము దోషయుక్తము కాకతప్పదు.

ఈశ్వరుని ప్రశ్వాసములో (ఉచ్ఛ్వాసంలో) ప్రవాహితుడ వగుము. (మహావాయువులో బహిర్గమనమగుము) పెనుగాలిలో ఆకుపోచవలెనగుము. తదీయ హస్తములందు నిన్నర్పణ చేసుకొని, ఖండించు ఖడ్గమువలె, లక్ష్యము. (కోరబడిన వస్తువు) కై ఎగయు శరము (బాణము) వలె కమ్ము. నీ మనస్సు యంత్రములోని స్ప్రింగువలె, నీ శక్తి ముందుకు వెనుకకు నూగు పిస్టన్‌వలె, నీ కర్మ చూర్ణము చేయుచు వస్తువునకు రూపకల్పన చేయు సుత్తియొక్క ప్రఘాతము (యుద్ధము) వలె నుండనగును. నీ వాక్కు దాగర (Anvil) మీద ఖంగుమని మ్రోగు సమ్మెట పెట్టుగను, యంత్రము శ్రమించు మూలుగువలెను, ఈశ్వరశక్తిని ఘోషించుచు ఎల్ల దిశలకు మ్రోగు ఢంకావలె నుండనగును. ఏది చేసినను నీకు సహజమైన స్వధర్మమైన నిర్దిష్టమైన కర్మను యంత్రమువలె చేయనగును.

ఖడ్గమునకు యుద్ధ క్రీడలో ఒక హర్షము కలదు. శరీరమునకు రివ్వుమని ధ్వని చేయుచు దూసికొనిపోవుటలో ఒక ఉల్లాసము కలదు.

భూగోళమునకు ఆకాశముగుండా పరిభ్రమించుటలో నొక విలాసము కలదు. సూర్యునకు తన సతత భ్రమణము (తిరుగుట) యందును మండు

చుండు జ్యోతిః పుంజము లందును, రాజోచితమైన మహానందము కలదు. ఓసచేతన (జీవము గలదైన) మైన యంత్రరాజమా! నీకు నిర్దిష్టమైన (నిర్దేశింపబడిన) కర్మాచరణమందు నీవుకూడ ఆనందము నాస్వాదింపుము. (అనుభవింపుము.)

ఖడ్గము తనను నిర్మింపమని కోరుకొనలేదు; తన నుపయోగించు వానిని నిరాకరించలేదు, భగ్నమైనపుడు (నాశనమైనపుడు) విలపించలేదు. చేయబడుటలో ఒక ఆనందము; ఉపయోగింపబడుటలో నొక యానందము; నిరుపయుక్తమైన దశలో వేరొక యానందము. భగ్నమగుటలో మరొక యానందము. అట్టి ఆనందముతో సమమైన ఆనందమును ప్రకటింపుము. (వెల్లడి చేయుము.)

నీవు ఏ హేతువు (ఏ కారణము) చే యంత్రమును కర్త - (అధికారి) గాను ఈశ్వరునిగాను భ్రమపడితివో, (పొరపాటు పడితివో) నీ కోరికల అజ్ఞానముచే నీ స్థితిని లాభమును ఉపయోగమును వరించి అన్వేషించు చుంటివో ఆ హేతువుచేతనే నీకు బాధా దుఃఖములు కలుగుచున్నవి; అగ్ని కుండము (నిప్పుల గుండము) యొక్క రక్త నరకములోనికి త్రోయబడుచున్నావు. ఈ మానవ పాఠమును సరిగా నేర్చునంతవరకు తిరిగి తిరిగి నానా రూపముల ద్వారా గట్టిపడుటకు చచ్చుచు పుట్టుచున్నావు.

మరియు ఈ సర్వ మిట్లుండుటకు కారణము — ఇవన్నియు అపరిసమాప్త ప్రకృతిలో నుండుటయే. ఏలన ప్రకృతియే కర్త, అయితే అది ఏ కర్మ చేయుటకు నియుక్తమైనది? తనఅసంస్కృత మనఃప్రాణాన్న కోశములనుండి పూర్ణచైతన్య వంతమైన (తెలివిగలదైన) సత్తా (నివాసము, లేక స్థితి)ను అది ఆకారించ నున్నది.

తరువాత నిన్నే కర్తగా ఎఱుగుము. అనగా నీ స్వకీయ ప్రకృతిని కర్తగా తెలిసికొనుము. మఱియు నీ స్వకీయ ప్రకృతిని విశ్వ ప్రకృతిని స్వయముగా 'నేనే' అనియు ఎరుగుము.

ఈ నీ స్వప్రకృతిని నీ స్వంతము అనుట సరికాదు. అది నీచే పరిమితమైన (తెలియబడిన) దని చెప్పుటయు సరికాదు. నీ ప్రకృతి సూర్యుని తదితర మండలములను, భూమిని తత్ప్రాణి సమూహములను, నిన్ను నీకు సంబంధించిన వాటిని నీకు గోచరించిన వాటిని, సర్వమును సృష్టించినది. అది నీకు మిత్రుడు; శత్రువు, నీకు మాత, సంహారకురాలు; (నాశనము చేయు ఆమె) ప్రేమించునది, హింసించునది; ఆత్మ సహోదరి, అపరిచిత పరదేశిని; హర్షము, విషాదము; పాపము, పుణ్యము; పరాక్రమము, దౌర్బల్యము; జ్ఞానము, అజ్ఞానము; మఱియు ఈ పైన చెప్పినవేవియు కాదు. అయినప్పటికి ఈ పైన చెప్పిన వన్నియు దేనియొక్క ప్రతిరూపములై దేనిని తెలుపుటకు ప్రయత్నించుచున్నవో అట్టి అనిర్వచనీయమైన ఒకానొకటి, ఏలనగా అది పైవాటి అన్నిటికంటె అతీతమైనట్టియు ఆదియందున్నట్టియు ఆత్మజ్ఞానము; అనంతశక్తి; అసంఖ్యాక గుణ సమూహము.

కాని నీలో ఒక ప్రత్యేక చాలనము (చలింపజేసేది) నిజ ప్రకృతి వ్యక్తిగత శక్తి కలదు, పోను పోను నిడివి (దీర్ఘము) యగుచున్నదివలె నున్న దాని ననుసరింపుము. అది నిన్ను తన అనంతము, ఆదికారణమునకు జన్మస్థానమున చేర్చును.

కావున నీ శరీరము అన్న తత్త్వములో నొక గ్రంథి (గునుపు) (ముడి) యనియు, నీ మనస్సు విశ్వ మానసములో నొక భ్రమణము (తిరుగుట) అనియు, నీ ప్రాణము ప్రాణశక్తియొక్క సుడి యనియు ఎఱుగదగును. నీ వ్యక్తిగత శక్తి సమిష్టి గత శక్తి; నీ జ్ఞానము మానవ మాత్రుని జ్ఞానముకాక అతిమానవ జ్ఞానముయొక్క మరీచిక(ఎండమావులు అనగా మధ్యాహ్నమందు బయళ్ళ యందు నీటివలె గనుపడెడు సూర్యకిరణములు) నీ కర్మలు నీ కొఱకే ఉద్దేశింపబడి, నీ వ్యక్తిగత దోషమునుండి విముక్తి బడయనున్న వనియు ఎఱుగదగును.

ఇది తెలిసినమీదట, నీవ్యక్తిత్వ సత్యమునందు, నీ వీర్యప్రకాశము (పరాక్రమము) నందు, గౌరవ సౌందర్య జ్ఞానములందును అవ్యాహతమైన (విఘ్నము లేనిది, సత్యమైనది) ఆనందము పడయగలవు. మరియు ఈ సకలము అప్రాప్తమైనప్పటికిని (పొందబడునప్పటికి) ఆనందించగలవు. ఏలన ఇదంతయు పురుషుని (పరమాత్మ) నాటక వేషము. శిల్పి తన ప్రతిమను (మారుటను) తానే మలచుకొనుట వంటిది.

నీవు నిన్నెందుకు పరిమితము చేసికొనుచున్నావు ? ఆ ఘాతపరచు ఖడ్గము (కత్తి) నందును, కౌగలించు హస్తము లందును, సూర్యుని ప్రచండ (తీవ్రమగు) జ్వాలలందును, భూమి యొక్క నృత్యమందును, గరుడుని (గరుత్మంతుని) ఉడ్డయనము (పైకెగురుట) నందును, కోకిల గానమందును. భూత వర్తమాన భవిష్యత్తు లందును నిన్ను అనుభవము చేసికొనుము. కారణమేమన నీవు అనంతుడవు. ఈ ఆనందమంతయు నీకు సాధ్యము.

కర్తకు (చేయువానికి) తన కర్మయందానందము. ప్రేయసి ఎవరికొఱకు తాను శ్రమించునో, ఆ ప్రియునియందు ఆనందము నొందును. తాను ప్రియుని చేతన, శక్తి, జ్ఞానము, తత్సంగ్రహము, అతని ఐక్యము, విభాగము, (వేరుపడుట) ఆనంత్యము, అంతవంతము అనియు ఎరుగును. అట్లే నీవు కూడ నీ ప్రేమాస్పదుని యందానందించుము.

కొంతమంది తమను కార్మాగారములనియు లేకయంత్రములనియు లేక ఉత్పన్న ద్రవ్యములనియు తలతురు. అయితే వారు కర్తను ఈశ్వరుడని పొరబడుచున్నారు. ఇది కూడ భ్రమయే. ఈ భ్రమలో బడినవారు ఎన్నటికిని ప్రకృతి యొక్క ఉన్నతము శుద్ధము దోషరహితము అయిన క్రియా కలాపములను చేరజాలరు.

యంత్రము వ్యక్తిత్వ రూపములో పరిమితము, కర్త వ్యక్తిగత ప్రవణతతో విశ్వవ్యాపి, ఈ ఉభయములలో ఎవరును ఈశ్వరుడుకాదు.

ఇది తెలిసినమీదట, నీవ్యక్తిత్వ సత్యమునందు, నీ వీర్యప్రకాశము (పరాక్రమము) మందు, గౌరవ సౌందర్య జ్ఞానములందును అవ్యాహతమైన (విఘ్నము లేనిది, సత్యమైనది) ఆనందము పడయగలవు. మరియు ఈ సకలము అప్రాప్తమైనప్పటికిని (పొందబడునప్పటికి) ఆనందించగలవు. ఏలన ఇదంతయు పురుషుని (పరమాత్మ) నాటకి వేషము. శిల్పి తన ప్రతిమను (మారుటను) తానే మలచుకొనుట వంటిది.

నీవు నిన్నెందుకు పరిమితము చేసికొనుచున్నావు ? ఆ ఘాతపరచు ఖడ్గము (కత్తి) నందును, కౌగలించు హస్తము అందును, సూర్యుని ప్రచండ (తీవ్రమగు) జ్వాలలందును, భూమి యొక్క నృత్యమందును, గరుడుని (గరుత్మంతుని) ఉడ్డయనము (పైకెగురుట) నందును, కోకిల గానమందును. భూత వర్తమాన భవిష్యత్తు లందును నిన్ను అనుభవము చేసికొనుము. కారణమేమన నీవు అనంతుడవు. ఈ ఆనందమంతయు నీకు సాధ్యము.

కర్తకు (చేయువానికి) తన కర్మయందానందము. ప్రేయసి ఎవరి కొఱకు తాను శ్రమించునో, ఆ ప్రియునియందు ఆనందము నొందును. తాను ప్రియుని చేతన, శక్తి, జ్ఞానము, తత్సంగ్రహము, అతని ఐక్యము, విభాగము, (వేరుపడుట) ఆనంత్యము, అంతవంతము అనియు ఎరుగును. అట్లే నీవు కూడ నీ ప్రేమాస్పదుని యందానందించుము.

కొంతమంది తమను కార్మాగారములనియు లేకయంత్రములనియు లేక ఉత్పన్న ద్రవ్యములనియు తలతురు. అయితే వారు కర్తను ఈశ్వరుడని పొరబడుచున్నారు. ఇది కూడ భ్రమయే. ఈ భ్రమలో బడినవారు ఎన్నటికిని ప్రకృతి యొక్క ఉన్నతము శుద్ధము దోషరహితము అయిన క్రియా కలాపములకు చేరజాలరు.

యంత్రము వ్యక్తిత్వ రూపములో పరిమితము, కర్త వ్యక్తిగత ప్రవణతతో విశ్వవ్యాపి, ఈ ఉభయములలో ఎవరును ఈశ్వరుడుకాదు.

# చైత్య పురుషుడు

సేకరణ :- చక్కా సత్యనారాయణ

మనము ఏమిగా నుంటిమో దానిపై దృష్టి నుంచుట కంటె నేది కాగోరెదమో దానిపై దృష్టి నుంచుట మిగుల ముఖ్యము. నీవు నిజాభ్యుదయము కాంచవలెనన్న దైవముతో సర్వదా ఐక్యమైయున్న నీ నిజసత్తను తెలిసికొనుము; అప్పుడు మాత్రమే రూపాంతరము సాధ్యము. నీయందుగల చైత్య పురుషుడుతప్ప, తదితర భాగములన్నియు జ్ఞాన రహితములు;

ఈ మనస్సు దైవమునకు అనుకూలముగను. ప్రతికూలముగను కూడ దాని అభిలాషను బట్టి కారణముల నిరూపించగలదు. దీనికి సత్యమును గురించిన నిర్దుష్ట జ్ఞానములేదు. ప్రాణము, సాధారణముగ శక్తి ప్రదర్శనతో మోహముచెంది, దానియందు దైవమును చూచుటకిష్టపడును. చైత్య పురుషునికి మాత్రమే నిజవిచక్షణా జ్ఞానముకలదు. అది నేరుగ పరమ దివ్య సాన్నిధ్యమును గ్రహించును. అది సర్వసమగ్రముగ దైవమును, దైవము కాని దానినుండి విభిన్నపఱచును. నీవొక్క సారియైనను, దానిని స్పృశించి యుంటివేని, నిన్ను చలింపచేయజాలని విశ్వాసము దైవమునందు నీకు స్థిరపడును. నిన్ను నీవు చైత్య పురుషుడవని తెలిసి కొనిననే నీవొక వ్యక్తిగానైన యుండగలవు.

నీవు సామాన్య చేతస్సునందున్నంతవరకు, సర్వము శ్రేష్ఠమునకే జరుగుచుండదు. నీవు ఋజు చేతస్సు స్థితియందు లేనపుడు నీవు తప్పు దారులలోని, కీడ్వబడవచ్చును. కాని నీవొకసారి, చైత్య సత్తయందు స్థిరపడితివేని, దైవమునకు, నిన్ను నీ వర్పించుకొంటివేని, జరుగున దంతయు శ్రేష్ఠమునకేజరుగును. ఏలయన సర్వముకూడ అదెంత ముఱుగుపడి యున్నను, నీకు స్పష్టా—దివ్య—ప్రతిస్పంద నా ఫలితమునే ఇచ్చును.

కాని విశుద్ధ ఆత్మార్పణ దృఢతరము కానంతవరకు కలతలు, జ్యోతిస్సమయముల మధ్యకాలమున ప్రవేశించు సమయములు యుండ గలవు. చైత్య పురుషుడుమాత్రమే, అనంతరముగ అభివృద్ధి కాంచగలడు, దాని ప్రగతి, అనవతర— ఆరోహణమై యుండును. చైత్య పురుషుడు దైవమునకేసి యెగయుచు, సర్వాంతరాయములను విచ్ఛిన్నము చేయు సమర్ధతను తనయందే వహించి యుండును. నీవు దీనితో ఐక్యమైనపుడు, నీవు సత్యానుభవమును కలిగి యుందువు. చైత్య పురుషుడు పూర్తిగా అభివృద్ధి చెంది పరిపూర్ణ చైతన్యవంతమై దైవేచ్ఛకు తగిన ఉపకరణమునని తెలిసికొనినప్పుడు, క్రమపరచి కాపాడబడిన తన ప్రాణ మానసికములు సాధారణ సమతలో పాల్గొనును.

పునర్జన్మమునందు, మరల బుట్టువాడు బాహ్య పురుషుడు కాడు. అనగా తల్లితండ్రులచేతను, చుట్టు ప్రక్కనుండు పరిసరము చేతను, సందర్భ విషయముల చేతను రూపెత్తు మనః ప్రాణ శరీరము కావు. చైత్య పురుషుడు మాత్రమే దేహమునుంచి దేహమునకు ప్రయాణించువాడు. మనోమయుడు గాని, ప్రాణమయుడు గాని అతీత జన్మలను జ్ఞప్తి పరచుకొనలేడు. ఒకడు మహా పురుషుడు అయినంత మాత్రమున తన గుణమువల్లను కూడ తాను అతీత జన్మలను గుర్తెరుంగుటకు వలను పడదు. చైత్య పురుషునికొక్కనికే స్మృతి సామర్ధ్యముకలదు. చైత్య పురుషుని ఎరుంగుట చేతనే, మన పూర్వ జన్మ విషయమై యున్నది యున్నట్లు తెలిసికొన గలము.

"మన నిజ సత్తను తెలిసికొనుటకై అన్వేషించాలి, ఆకాంక్షించాలి. దానిని తప్ప దేనిని కోరకూడదు. దానితో అనగా చైత్య పురుషునితో తాదాత్మ్యము పొందునంతటిదిగ, ఆ యనుభవముండవలెను. పరిపూర్ణతకు ప్రేరణ యంతయు వాని నుండియే వచ్చును; చైత్య పురుషుని గురించి నేను వచించునపుడు నీయందలి ఆవేశ పూరిత సత్తనుగురించి

నే చెప్పుచుంటినని దురభిప్రాయపడకుము. ఆవేశము ఉన్నత తర ప్రాణి సత్తకు చెందినది; కాని విశుద్ధ చైత్య పురుషునికి చెందినది కాదు. నీ శ్రోతులలో దహనమునందుచున్న పృథజ్వాల ఈ చైత్య పురుషుడని శ్రీ తల్లిగారనిరి."

చేతనము సర్వ మానవుల యందుండినను చాల మంది యందు అది ఒక చిన్న మిణుకుగా నుండును. అనేక మానవ జన్మల ద్వారా ఆ వెలుగు క్రమాభివృద్ధి చెందుచూ కడకు ఒకనాడు పరిపూర్ణత్వము జెంది అతని సర్వ ప్రకృతిని నడిపించును; అట్లు పరిపూర్ణత జెందిన చైత్య పురుషుని సిద్దిగాంచు వారు జన్మకు ఒక కార్యార్థముగనే వత్తురు. వారి అభివృద్ధి కొరకు జన్మించ నవసరము లేదు. చైత్య లోకమునందున్న పుడు వారు ఆనంద నిమగ్నులై పెద్ద కాలము విశ్రాంతి యందుందురు. కాన వారు చైత్య లోకము విడిచి మానవ లోకమునకు దిగి రాగానే తల క్రిందులై దిగ్భ్రమజెంది కొంత కాలము తర్వాతగాని వారి నిజము తెలిసి కొన లేరు. అట్టివారు అవిద్యయందుండక విజ్ఞానవంతుల దాపు దొరికిన వారి ఆంతరంగిక చైత్య సత్తాతో సంబంధముంచుకొన గలుగుదురు. చైత్య సత్తా విద్యుత్ తీగవలె మనుజుని శరీరమును దైవ మూల ముతో కలుపును. ఒక విద్యుత్ యంత్రము భిన్న కార్యములను తన శక్తిచేత నడిపించునట్లు ఆ దైవ శక్తి చైత్య తంతువులద్వారా ప్రస రించి జడమునకు గూడ అంతట ఆ దివ్యతను ప్రసాదించును. మానవుని సర్వ తత్వములను, సర్వ ప్రవృత్తులను నడపుచు, దివ్యోద్దేశ్యమునే మాన వునందు నెరవేర్చును. స్వార్థమే కొంచెమైనను యుండదు. అట్లయినపుడే మానవునియందు చైత్య తత్వాభివృద్ధి కాంచినదని చెప్పవచ్చును. అట్టి పూర్ణాత్ములు స్వచ్ఛంద జన్మలకును, స్వచ్ఛంద మరణములకు సమర్థులు. వారిని సామాన్య ప్రకృతి శాసించదు. అతనికే పూర్వజన్మ జ్ఞానముబ్బును. అంతు దివ్య ప్రకృతిలో యేకమై దైవమువలెనే యుండి జీవన్ముక్తుడై

లోక సంగ్రహము కొరకు కర్మల ననుష్టించుచుండును. అవిద్యా ప్రకృతికి లోనై కర్మలాచరింపడు.

చైత్య పురుషుడు దేహమునందున్నపుడే క్రమాభివృద్ధి గాని, రూపాంతరముగాని పొందును. కొందరన్నట్లు రెండుజీవితముల మధ్య అభివృద్ది జరుగునసుట కల్ల; అప్పుడు అభివృద్ధి జరుగదు. ఏలన చైత్య పురుషుడు విశ్రాంతిలో యుండును. ఇతర భాగములు వాటి అశాశ్వత జీవితములోయుండి నశించును. పురోభివృద్ధి జరుగునది ప్రపంచ జీవితములోనే, ఈ భూమిమీదనే, జీవితకాలములోనే అభివృద్ధి సాధ్యము. ఈ అభివృద్ధిని క్రమపరచి వృద్ధిచేసి ఒక జీవితమునుండి మరొక జీవితము నకు తీసికొని పోవునది చైత్య పురుషుడే!

మరొక విశేషము కలదు. ఇట్టి దివ్యసిద్ధి భూలోకమందు మాత్రమే సాధ్యము. చైత్యాభివృద్ధి చెందుటకు ఇదియే స్థానము. ఊర్ధ్వలోకము లగు ఉన్నత మానస, అధిమానస, మొదలగువాని యందుండువారు గూడ భూలోకజన్మను ఆకాంక్షింతురు. ఏలనన వారియందు చైత్యపురుషుడులేడు. అందుకే దేవతలు కూడ ఈజన్మకు రాగోరెదరు. వారు ఈ లోకమందలి మానవులకన్న యెంతో అధికశక్తి సంపన్నులైనను యిట్టి దివ్యసాక్షాత్కారము వారి కచ్చట లభించ నందున వారీ జన్మకు రా గోరుదురు. ఇట్టి సిద్ధి భూలోకమందు తప్ప మరెచ్చటను సాధ్యముకాదు.

ప్రాణ, మానసిక సత్తాలు నూతన జన్మలో నూతన దేహమున అభివృద్ధి చెందుట, వ్యక్తుల మీద ఆధారపడి యున్నది. ఒక జీవితము నుండి మరియొక జీవితమునకు వృద్ధి పొందునది ప్రాణముకాదు, మనస్సూ కాదు, పరిణామమున ఉత్తమ దశయందును, కొన్ని ప్రత్యేక అవస్థల యందును తప్ప—సాధారణముగా అభివృద్ధి చెందునది చైత్య పురుషుడు, దేహము నశించిననూ అత్యుత్తమ అభివృద్ధిగల కొన్ని భాగములు

కనీసము, ప్రాణ మానసిక సత్తాలను కాపాడుకొనును: సాధారణ మానవులలో చైత్య పురుషుడు పూర్తిగ అభివృద్ధి చెందకుండిన వారి మృత్యువు ప్రశాంతముగను ఏకాగ్రతగను జరిగిన వారి మానసిక ప్రాణ సత్తాలు కొంతకాలమే యుండును. అటు కాక ఆకస్మికముగా ఉద్రేకము తోను రాగముతోను మృత్యువు సంభవించిన వారి సత్తాలోని వివిధ భాగములు చాల కాలముండి తర్వాత నశించును

చైత్యపురుషుని అభివృద్ధి ఈక్రింద విధముగా జరుగుచున్నది. మానవుని జీవిత కాలమున అతని శరీర మానసిక ప్రాణ అనుభవముల చేత చైత్య పురుషుడు క్రమాభివృద్ధి చెందుచున్నాడు. తర్వాత జీవితాంతమున విశ్రాంతిలో చైత్య పురుషుడు ముందు జీవితములో పొందిన అనుభవముల లోని అభివృద్ధిని సమాన పరచుకొనును. జీవితకాలమున ఎంత వరకు అభివృద్ధి చెందినది కూడ లెక్కచేసికొనును. ఈ కార్యమై అభివృద్ధి ఇంతవరకు జరిగినది అని తెలిసి కొనిన తర్వాత, మరలా నూతన దేహములో చైత్య పురుష పూర్వపు అభివృద్ధితో కూడ ప్రవేశించును. ఉత్తమ అభివృద్ధి దశయందు ఆ చైత్య పురుషుడు తన పురోవృద్ధికి కావలసినదేహమును,జీవితమును పరిసరములనుకూడఏరికొనును. అత్యుత్తమాభివృద్ధి చెందిన చైత్య పురుషుడు రాబోవుజన్మ ఎట్లుండవలెను 'అని' కూడ ముందుజన్మలోనే నిర్ణయించు కొనును. నూతన దేహమునునిర్మించు కొనుటకు కావలసిన మూల వస్తువులను తనే ఏరికొని ప్రత్యేక నూతన పరిస్థితులకు దేహము తట్టుకొనునట్లు తయారు చేసి కొనును. అయితే ఇట్టిది చాల అభివృద్ధి చెందిన చైత్య పురుషుని స్థితి మాత్రమే. తర్వాత చేతనా సత్త పూర్తిగా ఏర్పడి దైవ కార్యములలో పాల్గొని కృషి చేయుటకు భూమిపై జన్మించును.

ఉదాహరణకు :— ప్రాణ మానసికములు క్రమ పరచబడి వృద్ధి చెందినపుడు కొంత వరకు మూల వస్తువులను కాపాడుకొనును. ఏలనన

మేథా సంపన్నులు వారి మేధస్సును అభివృద్ధి చెందించి, అట్టి మానసిక నిర్మాణమును భద్రపరచి తర్వాత జన్మలో దానిని పొంది, ఆ జన్మలో వివిధ రంగాలలో ప్రవీణులగుదురు. అలాగుననే కళాకారులలో — సంగీత విద్వాంసులు ఒక విధముగా చైతన్య వంతముగా వారి చేతివ్రేళ్లను వాడెదరు. ప్రాణ మానసిక భావము వారి చేతివ్రేళ్లయందుకలిగి యుండు టచే వారట్లు వాటిని వాడెదరు.

అసురులందు యీ చైత్య పురుషుడు లేడు. కాని వారాసిద్ధి కోరనే కోరరు. తొలుత వారు దైవమూలము నుండి చాలాకాలము క్రిందటనే వేరు బడిరి. వారికిప్పుడేలాంటి దైవ సంబంధము లేదు. వారు చైత్య తత్వము లోనికి మారదలచిన వారికేమీ మిగలదు. ఏలనన వారి కుందునదంత దైవేతర స్వభావమే, స్వపటాటోప ప్రాముఖ్యము, నిరంకు శాధికారము, దివ్యమూలము నుండి దూరమగుట, సర్వపవిత్ర సుందర ఘనతలను నిరసించుట వారి ప్రధాన గుణములు. వారిలో యెవరైనను మారదలచిన యెడల వారు చేయునదొకటే, వెంటనే జడ శరీరమును దాల్చుట, కాని చాలమందిందుల కిష్టపడరు. అట్టివారు పరిమితులకు కట్టుబడి, వారు నిరసించు అధికారమునకు లొంగి ఖేదపడు చుందురు.

నిర్మల నిత్యతేజో విరాజితమగు మన చైత్య పురుషుని తెలుసు కొని అతనికి మన సర్వతత్వము లర్పించి, అతని యేలు బడి యందుండు టకు ఒప్పుకొనిన మన జన్మ సాఫల్యమగును. కనుక మనము ప్రశాంత మనస్సులోనికి పోయి, సర్వతత్వములకు మూలసూత్రమైన చైత్య పురు షుని వెదకి అతని నిశ్శబ్ద వాణిని విని, ఆ రీతిగా మన జీవితముతీర్చి యా యాదేశాను వర్తులమగుచు, దివ్య కర్మలద్వారా దివ్య ప్రకృతిని పొంది, దైవముగనే, మన మిచట నివసించి, చరించుట మన కర్తవ్యము. యిక

ముందు అట్టి చైత్యాభివృద్ధి చెందిన అపురూపమైనవారు సంఘములుగ నాకర్షింపబడుదురు. అనగా వారికి పరిపూర్ణ చైత్యాభివృద్ధిగలదని కాదు. కాకపోయినను వారు ఏమి సాధించదలచి ఎందుకు జన్మకు వచ్చినది, ఎచటకు పోవునది, విశదముగా తెలిసి, యేలాటి గజిబిజిలేక, నిర్మల మనస్సుతో అభివృద్ధికర జీవితమును గడుపుదురు.

జై జగన్మాత.

# అతి మానసశక్తితో నిరంతరైక్యము

సేకరణ :— చక్కా సత్యనారాయణ

ఈ అతీత మానసశక్తి మనలో నిద్రాణముగాయున్నది. అది "Supra Mental Transformation" మానవచేతన దివ్య పరిణామం పొందాలి. ఈ విజ్ఞాన చైతన్యము మానవుని అనుదిన వ్యాపారానికి కేంద్రబిందువైననాడు మూలహేతువైననాడు ఈ విశాల పృధ్విపై సరిక్రొత్తజీవితానికి క్రియాయోగానికి అంకురార్పణం జరుగునని శ్రీ అరవిందులు రూఢిపర్చిరి. మానవునియందురాబోవు గొప్ప మార్పును గూర్చి వారు చక్కగా విశదపరచిరి.

ప్రపంచ చరిత్రయందు శ్రీ అరవింద ప్రాతినిధ్య కార్యము ఒక ప్రబోధముకాదు. ఒక ప్రకటనకూడ కాదు. ఇది కేవలము పరాత్పరు నుండి సూటిగ వెలువడిన నిర్దేశకార్యము. ఇంతకుపూర్వము 'Mind Of Light' దివ్యజ్యోతిర్మానసము యొక్క ఒత్తిడి క్రిందనే పని జరుగుచుండెను. ఇప్పుడు అతీత మానసము నేరుగా ప్రత్యక్షముగా

మార్గదర్శకత్వమొనర్చుచున్నది; మరియు పాలించుచున్నది. ఈ విజయము నకు శ్రీ అరవిందులు కారణభూతులు.

ఈ అతీత మానసశక్తియొక్క దివ్యజ్యోతి కుమ్మరింత నిరంతరముగనున్నది. విశ్వమయ వాతావరణములో ఈ యావిష్కరణము సూక్ష్మభౌతికములో జరుగుచున్నది. బాహ్యభౌతికములో నింకను నేదియు స్పష్టముగలేదు. ప్రకృతి అతీత మానసమును నిరాకరింపజాలి యుండలేదు.

పూర్వకాలపు యోగమార్గములు మనస్సును, బుద్ధిని, ఆత్మను మాత్రము తెలిసికొనియుండెను. మనోభూమికలలోనుండు అనుభవములతో తృప్తిజెందుచుండెడివి. కొంతమంది యోగులు అనంతమును పూర్ణ సత్యమును సమాధిమోక్షము లేక నిర్వాణ మార్గముననే పొందగలిగిరి. ఆత్మవిముక్తి జీవితధ్యేయాలలో నొకమార్గము మాత్రమే అగును, వారు ఈ విధమైనటువంటి మోక్షమునే పొందిరి. ప్రపంచము మాయయనియు, అశాశ్వత లీలయనియు వారు తలంచియుండిరి. ఇందులకు ఫలితముగ జీవితము జీవితమునందలి ప్రాణశక్తి, వీర్యము నశించి భారతదేశము క్షీణించినది. బంధ విముక్తి గొప్పదేయైనను, జీవిత సన్యాసలోకము జీవరాశిని ఉద్ధరించలేదు. మనకు కావలసినది ఏకాంతముక్తి, వ్యక్తిగతాభి వృద్ధి మాత్రమేకాదు. ఏలయన యింతవరకు జ్ఞానము లోకమును మార్చ గల శక్తివంతమైనది కాలేదు. సత్యము తన హక్కుల నెలకొల్ప శక్తి సామర్థ్యములు కలిగియుండలేదు. సత్యజ్ఞానములు నిరుపయోగములైన మెరపులైనవి. వెలుగునకు అడ్డముగా నిలిచిన చీకటి తెరను మాత్రమే మనము యింతవరకు తొలగించినట్లుగావున్నది. మనకు కనిపించుచున్న వెలుగుకూడా చీకటితెరవలె ఒకతెరయే. ఈ వెలుగు తెరను తొలగించి మనము ఆ వెలుగునకు అందకుండాయున్న మహాగొప్ప వెలుగును చూడ వలసియున్నది.

ఈ ప్రపంచమున సర్వము అనగా మానవుడు మానవేతరములు నిమిష నిమిషము పూర్ణత్వ చెందుచునే యున్నది. ఇంతవరకు మానవులు దైవపరముగా సంపాదించిన జ్ఞానము చాల అల్పము. ఇప్పటికప్పుడే మనోమయుడగు నీ మానవుడు దశలక్షవత్సరము లీ భువిపై జీవించి ప్రాతగిలినాడు. కాని మనస్సు సంపూర్ణ జ్ఞానమున కర్హతలేనిదై సమిష్టిని తెలిసికొనలేక, భాగములను మాత్రమే గ్రహించును. అనంతమై సంపూర్ణమైన సత్యమును సంపూర్ణముగా గ్రహించుటకు మనస్సుకు సాధ్యము కాదు. అసంపూర్ణ దేహబుద్ధులయందు అది బంధింపబడెను. ఈ అచేతనా వస్తు సామగ్రియందు, గౌరవహీనమైన చావు బ్రతుకులతో నిండింపబడుచూ అది భీకరయత్నము చేయుచున్నది.

భగవంతుడెప్పుడు అవతార పురుషుల ద్వారానే నూతన సృష్టిని చేయుచుండును. వందలాది జీవులు అతి దట్టమైన గాఢాంధకారమున మునిగియున్నను చింతపడనక్కరలేదు. అజ్ఞానాంధకారము జ్ఞానతేజముగ పరివర్తననొంది పరమేశ్వర పాలనము పృథ్విపై స్థిరపడునని ఋజువగుటకు శ్రీ అరవిందుల అవతారమే చాలును. పృథ్వీ చరిత్ర ప్రారంభము నుండి, ఈ మహత్తర పృథ్వీ పరివర్తనలపై సర్వదా శ్రీ అరవిందులు ఏదో ఒక రూపమునగాని, నామమునగాని అధికారము కలిగియుండిరి. ప్రపంచము పొందనున్న భవిష్యత్ సిద్ధిని తెలుపుటకై యిప్పుడు శ్రీ అరవిందులు మరల అవతరించిరి. వీరిముందుదయించిన అవతారపురుషుల సూచన ఏ విధముగ ఎదిరించబడినదో తిరిగి శ్రీ అరవిందుల సూచనకూడ అదే విధముగ ఎదిరించబడుట సహజము.

మన హృదయమునకు వెనుకనున్న చైత్యపురుషుడు జడ ప్రకృతిలో ఒక తేజఃకిరణం. తనతో సంబంధం వున్నంతవరకైనా ప్రకృతిని చిన్మయం చేయడం అతని కర్తవ్యం, నూతన సృష్టి జరగడానికి, పృథివీ

చేతనాన్ని దివ్య చైతన్యంగా మార్చడానికి చైత్య పురుషుని జీవిత విధానమే సాధనం. మనస్సునకుపైన మానసిక వివేచనకన్న, అత్యంత వివేచనావంతమగు ఒకానొక దివ్య చేతస్సుయున్ను, వస్తువుల లోతుల యందు, మానవ సంకల్పముకన్న అధికతర శక్తిమంతమగు ఒకానొక దివ్యసంకల్పమున్ను ప్రపంచమును నడిపించుచున్నవని శ్రీ అరవిందులు నుడివిరి— మన అనుభవముకూడ నదియేయని మనకు నిశ్చయమైనది. ఈ దివ్యచేతనా సంకల్పములు మన నిత్య జీవితములను కర్మలను నడిపించుచుండ, మన సర్వ కార్యకలాపములు వ్యవస్థీకరించుకొన వలెనని మనము ప్రయత్నించుచున్నాము. ఈఆశ్రమము,ఆరోవిల్ నగరము సృష్టింప పడినదీ విధానముననే, ఇందలి ఒక్కొక్క శాఖయు, కృత్రిమ మానసిక ప్రణాళికచేగాక, సజీవ క్రియాత్మకావశ్యకతచే సృష్టింపబడియున్నది. ఈ ఆశ్రమ అనవరతాభివృద్ధియొక్క రహస్యమంతయు నిందేకలదు. నూతనానుభవమును అవతరింపచేయు కార్యమునకు, ఆవశ్యకమగు దివ్యావేశము, పురోగామిక సామర్థ్యము, సృష్ట్యాత్మకశక్తి ఊర్ధ్వమునందు కలదు. నూతన ప్రపంచమునకు కేంద్రముగా నుండబడుటకే యీ ఆశ్రమము ఆరోవిల్ నగరము స్థాపింపబడియున్నవి.

ముందుగా మనస్సుచే నిర్ణయింపబడిన స్పష్టప్రణాళికగాని, వ్యవస్థ కాని ఏదియు నిక్కడ యుండదు. సర్వము చిత్తవస్పుచే, అనగా చేతస్సు యొక్క ఉద్యమముచే జనితమై, వృద్ధియై సజీవ వస్తువుగా వికసించినది. దివ్యచేతశ్శక్తి ఆవిర్భవించుటకు వ్యక్తము అగుటకు, తగిన ఉపకరణము లను అది వెతకును. ఉపకరణము ఉన్మీలమై గ్రహణశీలమునకు సశీలమైన పిల్ల పొందుబడు ఫలితములు అటస్లే అధికముగ.ుండు ననుట నిశగమే. చేతస్సు సర్వదా సృష్టించుచునేయుండును, తత్పూర్వము చేయబడినదాని అనుసరణ కాదది; కాని ప్రతి నిమిషము దానికి కనబడు ఫలమునుబట్టియె చేతస్సు యుండును. మానసిక ప్రగతియందు తత్పూర్వము చేయబడిన

దానిననుసరించి ప్రగతియుండును. దీనిని సరిగా అర్థము చేసికొనుట చాలా ముఖ్యము. ఏలన మానసిక మార్గమును త్రోసిపుచ్చబడకమునుపు తన్నుదా పరీక్షించుకొనుట కవకాశమివ్వబడును. కాని చేతస్సుయొక్క ప్రగతి ఎట్టి సమయమునకూడ నిలిచిపోలేదు. ఆవిర్భవించుటకు ఉపకరణములు ఉన్మీలనమైన స్థితిని సర్వము చూచుచు పనిచేయుచు పోవుచుండును. ఈ ఆశ్రమము అభివృద్ధిని గమనించుతూ, యుండవలసిన వ్యవస్థితికాదది, చేతస్సు దాని ప్రగతిని అదియే వెంబడించును.... సర్వమును సాధ్యమొనరించునది అదియె; అదిమాత్రమే అద్భుతములకు, విపరీతములకు, సర్వమునకు అవకాశమిచ్చును. మానవుని సృష్టులకు విస్పష్టమైన విపరీతముగా నుండునదది. ఇది సర్వదా ఈ విధముగనే జరుగుచుండెను, ఇక మీదట కూడ ఇది ఇదే విధముగ జరుగుచుండును. నేనిక్కడ యుండునంతవరకు ఇది ఇదే విధముగ జరుగునని శ్రీ తల్లిగారు అనిరి.

ఇది వరకువలె మన నెత్తిపై బరువు బాధ్యతలున్నందున వంగి తిరుగుచున్నామని, కర్మ అదృష్ట ప్రభావమునకు వశులమైయున్నామని మనము కృంగి వ్యవహరించ నక్కరలేదు నిస్సందేహముగ. కార్యము దుస్సాధ్యమే. కాని పృథ్వీ — చైతన్య పరిణామమందు అతీత మానస రూపాంతరము ఆ పరాత్పరునిచే విధింపబడినది. దీనిని నెరవేర్చుటకే మనకు అనుజ్ఞ యివ్వబడినది; పృథ్విపై మన ముండునది కూడా అందు కొరకే, పరాత్పరుని దివ్య సంకల్ప సహాయములందు విశ్వాసముతో గమ్యమును చేరువరకు ఈ కార్యమును సాధింతుము. ఈ అంశములు శ్రీ అరవిందాశ్రమ సాధకులకేగాక ప్రపంచము నందెచ్చోటనైనను శ్రీమాతారవిందుల యోగాదర్శనమును అంగీకరించి దైవము కొరకే జీవించుచు అర్పించుకొను ప్రతివారికిని అన్వయించును. దైవకార్యము చేయుటకు సర్వము త్యజించి సిద్ధపడువారు ఆశ్రమము నందు సాధకులుగా నుండ అర్హులు. కష్టముచే ప్రపంచముపైన విసుగుజెంది ఇక్కడికి పారిపోయి

వచ్చుట ఎంతో మాత్రము మంచిదికాదు. భగవంతుని ప్రేమానందముల నాశించుటకు అయినచో కూడ యిచ్చుటకు రానక్కరలేదు. అవి నెక్కడ నుండి అయినా సరే యనుభవించవచ్చును.

అంతర చైతన్యమునందు పొందెడి ఆధ్యాత్మికానుభూతిని అతిమానసావిష్కారమని తలంపరాదు. అతిమానసా విష్కారమువలన మునుపెన్నడూ లేని స్వేచ్ఛా స్వాతంత్ర్యము శరీరమునకు లభించుచున్నది. శరీరములోను, శరీర కణములలోను ప్రవేశించిన నూతన స్వాతంత్ర్య పిపాసయే దీనికి కారణము. ఈ నూతన స్పందన వలన శరీరమందున్న లోపములు సరిదిద్దబడుచున్నవి. సహజముగ యిది అంతయు పురోగమనమే, క్రమక్రమముగా యీనూతన చైతన్యము విస్తృతమై, ఇంతవరకుపూర్వం జరుగుచున్న వినాశ క్రియను, నిరాకరణక్రియను జయప్రదముగ నడ్డగించి "కర్మదాట వశముకాదు" అనెడి మనలోపాతుకుపోయిన అభిప్రాయమును పూర్తిగా తొలగించును. ఇది శరీరమందును, శరీర కణములయందును కలిగిన ఒకానొక ఉత్కృష్ట నూతన పరిణామము. తన గృహమునకు తానే యజమానినని, సర్వస్వతంత్రురాలనని శరీరము తలుచుచు, వ్యవహరించుచు ధైర్య స్థయిర్యములు కలిగియున్నది.

ఇప్పుడు అతి మానస పరివర్తనకువలయు స్థితిగతుల యందు పరిపూర్ణులైనవారు పరిపూర్ణులగుచున్నారు. గమ్యము చేర్చు త్రోవలో నున్నానని చెప్పుటకు ఎంత మాత్రము సందేహములేదు. సాధారణ లైంగిక పద్ధతిలో పశులక్షణములతో యీ శరీరము రూపొందినది కాబట్టి పరివర్తన చెందినను ఏ కొద్ది పశు అంశమైనను శరీరమునందు మిగులక తప్పదు. అందుకే సరాసరిగ అతిమానస పురుషుడుగ రూపొందుటకు ఎంతమాత్రం వీలుకాదు. అతిమానస పురుష ఆవిష్కరణకు ఒక నూతన మార్గము మనలో నిగూఢమైయున్నది; అది ఏమన కేవలము అతిమానస పదార్థము గల శక్తులు స్వయముగ (లైంగిక సంబంధము లేకయే) శరీర రూపము

దాబ్బును. అది శరీర నిర్మాణముగాక స్వయం సృష్టియే. కావున మానవు లకు, ఈ నూతన పద్ధతిలో జనించు అతిమానస పురుషులకు నడుమ, పరి ణామ క్రమములో పశు జీవనమునకు, ఆశలకు అతీతమైన పరివర్తన చెందిన మధ్యతరగతి వ్యక్తులు కొంద రుత్పన్నమగుట నిస్సంశయము. ఇప్పుడు ఈ మధ్యతరగతికి సంబంధించిన పరివర్తిత వ్యక్తులు ఉత్పన్న మగుదురు. కొందరు వ్యక్తులు ఈ పరివర్తనను పొందుటనుబట్టి ఈ అను భూతి ప్రారంభమైనదని నిదర్శనముగ చెప్పవచ్చును. ఈ పరివర్తిత వ్యక్తులే సరాసరి అతిమానస పురుష సృష్టికి మార్గము కనుగొందురు. దీనినిబట్టి కొన్ని అనుకూల పరిస్థితులలో సాధారణ మానవత్వమును అధిగ మించవచ్చునని, మానసమునకు అతిమానసమునకు ఎరుకతో కూడిన సంబంధ ముండనగునని గోచరమగుచున్నది.

ప్రస్తుతము మానవజాతి సాధించిన కార్యములవి యెంత గొప్పవి యైనను వానిని పొందుట మాత్రమే మనమవలంభించగల ఉద్దేశ్యముకాదు. కాని మన ఉద్దేశ్యము పూర్తిగా దీనికన్న వేరైయున్నది; ఈ నిమిషమున, మన విజయమునకు గల అవకాశములు కొలదివేయైనను, ప్రపంచ భవిష్య త్తునే మనము సిద్ధపరచుచుంటిమనుట సత్యము. ఈ ఆశ్రమమున కిప్పుడు గల కష్టముల నుండి దీనిని ప్రస్తుత మానవజాతి సాధించిన కార్యము లేవియు రక్షింపలేవు. ఆశ్రమ సాధకులందరు పూర్ణ రూపాంతరము పొందుటచేతను, దివ్య సత్య ధర్మ ప్రకాశమునకు పూర్ణముగ ఉన్మీలితు లగుటచేత మాత్రమే ఈ ఆశ్రమము తన్నుదా సిద్ధి కావించు కొనుటకవి సహాయపడగలవు. బాహ్యదృష్టి ననుసరించి యిప్పటికీ ప్రపంచమున సాధింపబడిన కార్యములతో, మనమీ ఆశ్రమమునందు సాధించిన కార్యము లను పోల్చినచో, యివి కొలదిగనే నున్నట్లు కనబడుట నిజము; కాని పరి పూర్ణతను మానవుని కొలతబద్దలచే కొలుచుట మన ఉద్దేశ్యము కాదు.

దివ్యమైన కొలతబద్దచే కొలువబడుచు భావిపరిపూర్ణత నొందుటకే మనము యత్నించుచున్నాము.

విజ్ఞానమయ భూమిక నధిరోహించిన మహాపురుషుడు దైహిక ప్రాణిక సత్తాలచేతను బాహ్యబుద్ధిచేతను, యుక్త తర్కములచేతను నడుపక, దివ్యజ్ఞానముచేతనే నడుపుచుండును. అతని ధర్మము విశ్వపరధర్మముతో నేకీభావము పొందినదై యుండును. కావున నతడు కర్మలజేయుచుండి నను కర్మాతీతుడై పరగుచుండును. మానవుని జీవితము తనలోని చేతస్సును మహా విశిష్ట కళలతోను, దివ్య చైతన్యముతోను ఆవిష్కరించును. ఈ లోకముననే దివ్య జీవితము గడుపుట ప్రధాన లక్ష్యమగును ప్రపంచమందలి బాధలు, దుఃఖము నశించుటకు దివ్యశక్తితో భూమిపై నెలకొని పని చేయవలెనేగాని మానవశక్తితో సాధ్యపడదు. ఏలనన పుట్టుకరీత్యా ఆకారరీత్యా మానవుడైయుంటూ, చైతన్యమునందు పరివర్తన నొందుచు, అనుభూతియందు వ్యవహారములందుమాత్రం అతిమానసమునకు చెందుతూ ఉండే మధ్యతరగతి వ్యక్తి, అట్టిజాతి అవతరించుట నిస్సంశయమని, రూఢిగ చెప్పవచ్చును. మన వ్యక్తిగతమైన కృషి, ఏకాగ్రబుద్ధి, సత్సంకల్పము, ఆ సత్యమున కిచ్చు ప్రాధాన్యతనుబట్టి ఈ సిద్ధియు, గమ్యమును చేరు దూరము నిర్ణయమగును. బహుశా ప్రథమ ఫలితములు బాహ్యదృష్టికి గోచరమగుటకు చాలాకాలము పట్టకపోవచ్చును.

సాధారణ స్వభావము నధిగమించి, దివ్యసత్యముతో సంబంధం నెరపుకొని ఆంతరంగి కానుభవమును సాధించిన వారును, తమలో ముఖ్యముగ చైతన్య పరివర్తనకైనా కాంక్షించి సాధించినవారును, అతి మానస తరఫీదు పొందిన వ్యక్తులనవచ్చును. ఈ సాధించిన విజయములలో తారతమ్యము లనేకము లుండవచ్చును, అతిమానసావిష్కారమువలన అనేక అవకాశముల నాశింపవచ్చును. మరియు మనః పూర్వక ఆకాంక్షలో ప్రతి సమగ్ర నివేదనకు ప్రత్యుత్తరము లభించును. అట్టిపరివర్తనలు, అనస్థాం

తరములు, మార్గములు, అంతరములు అనేకములని చెప్పవచ్చును. ఏదో ఒక నిర్ణీత మార్గమున ఈ పరివర్తన జరుగునని చెప్పనలవికాదు. అతి మానస తేజశ్శక్తి చైతన్యముయొక్క ఏ ప్రత్యేకాంశముకాని, దానికి సంబంధించిన ఏ మాత్రమంశమైననుగాని గ్రహించుటకు సిద్ధముగానున్న వ్యక్తి దానిని స్వాభావికముగా పొందితీరును; వారి వారి ఆకాంక్ష లోతునుబట్టి వారి వారి సామర్థ్యము, సాధ్యతలనుబట్టి, ఈ నూతన తేజశ్చైతన్యముల ఫలితము లనేకములుగా నుండును. నివేదనపూర్తి అయినకొలది, ఆకాంక్ష తీవ్రతరమగుకొలది, సంకల్పం సమగ్రమైన కొలది, ఫలితములు కూడ సమగ్రమై, సతీక్ష్ణమై యుండును. అతిమానస శక్తియొక్క పరివర్తనా ఫలితములు అసంఖ్యాకములై బహుముఖములై యుండును. ఒకే మార్గములో యీ అనుభూతి యుండునని చెప్పుటకవకాశములేదు. ఇట్టి నిబంధనలు అతిమానస చైతన్య స్వభావమునకు వ్యతిరేకములు.

చైతన్య పరివర్తన నొందిన పిమ్మట, అతిమానస శక్తులతో సన్నిహితమైన నిరంతరమైన, సంపూర్ణమైన ఐక్యతనొందిన పిమ్మట అంతశ్శక్తిని సాధించుట ఫలప్రదం. అప్పుడు విశ్వశక్తులు, వాటి ఆవిష్కరణలో ఏది జరగవలెనో అది స్వాభావికముగ యదేచ్ఛగ జరిగితీరును. సంపూర్ణ పరిశుద్ధత యనగా, శరీర పరివర్తన అత్యవసరమని దేహము తెలిసికొను సమయ మేతెంచును. ఇంకను శరీర కణములు అతిమానస తేజముద్వారా దప్పి తీర్చుకొన నిచ్ఛగించును. ఆ తేజము కొరకే పరితపిస్తూ, దానియందే అత్యంతానందమున్నదని గుర్తించి, చివరకు విజయమును ఈ కణములు సాధించి తీరును. ఈ సత్కాంక్షనే మాతృశ్రీవారు మనకు ప్రసాదించుచున్నారు. ఈ ఆకాంక్ష కలిగి యున్నపుడు అతిమానస తేజము లోనికి పరివర్తనచెందుట తక్క మిగిలిన జీవితమంతయు నిష్ఫలమని, నిస్సారమని, ఆనంద రహితమని గుర్తింపక తప్పదు. అప్పైన చేయవలసిన దొక్కటేమిగులును. శ్రీ అరవిందులు చెప్పినట్లుగా పైవే

చ్ఛకు సంపూర్ణ సమర్పణము గావించుటయే మిగిలి యుండును. ఏలనన మానవేచ్ఛ గాక, దైవేచ్ఛయే యీ పరివర్తనా ఫలితమునకు కారణము. 'ఆ కాంక్షను కలిగి యుండి వ్యక్తిత్వమును తన చైతన్యమునందు అనుక్షణము విస్తృతమొనర్చుచూ నుండవలెను. మరియు బృహత్స్వరూపమైన అతిమానసమును తనలో నిముడ్చుకొనుటకు చాల విస్తృతమై యుండవలెను. ఆత్మ పరిపూర్ణత, అనుక్షణ విస్తృత ఫలితముగ దైవేచ్ఛ మనయందు అతిమానస ప్రపంచమును సృష్టించును.

జై జగత్.

# నిజమయిన సాహసము

అతీత మానస సృష్టియందు మతములుండవు. సర్వ జీవితము ఒక్కటగు దైవమే బహు రూపముతో అభివ్యక్తమగుటగా యుండును. ఇప్పుడు మనుజులచేత దేవతలని పిలువబడు వారచ్చట యుందురు. అతి మానస సృష్టినుండి బయట పడవలెను. అట్లు బయటపడుటకు నూతన సృష్టి రూపొంది యుండవలెను. ఈ ఘనులగు దేవతలే ఈ నూతన సృష్టి యందు పాల్గొందురు. కాని అట్లు చేయుటకు భూమిమీద అతీత మానస తత్వ శరీరములను వారు గ్రహింపవలెను. ఈ దేవతలలో కొంతమంది వారి లోకమును విడుచుట కిష్టపడక అందే యుండగోరినను వారుకూడ భూలోకమున అతీత మానవ శరీరము గ్రహించిన వారితో సంబంధము, మిత్రులుగాను, సహకారులు గాను, సమానులు గాను యుండును. ఏలన అత్యున్నతమైన అతీత మానస దైవతత్వము నవీన భూలోక మందలి అతీత మానస సత్తల యందు అభివ్యక్తమై యుండును. ఎప్పుడయితే జడత్వ సర్వము అతీత మానస శరీరమగునో అప్పుడు శరీర ధారణ నీచమగునది కాక తద్విరుద్ధముగా ఇతర మార్గములచే పొందలేనటువంటి సమృద్ధతను పొందకలిగి యుండును.

కాని ఇదంతయు భవిష్యత్తుకు సంబంధించినది. ఈ భవిష్యత్తు మొదలైనది పూర్తి యగుటకు కొంత కాలము పట్టును. ఈ సమయ మందు మనము ఇంతకు ముందు ఎన్నడు కని వినని ప్రత్యేక స్థానము నాక్రమించి యున్నాము. మనము నూతన ప్రపంచోదయమునకు సాక్షుల మగుచున్నాము. ఈ జన్మించు నూతన ప్రపంచము చాల నేతది. చాల శక్తి హీనమైనది. కాని దాని దౌర్భల్యము దాని సారమందు కాదు. దాని బాహ్య అభివ్యక్త మందుమాత్రమే. అది ఇంకను గుర్తింపబడలేదు. భావింపబడలేదు చాల మందికి నాస్తిక భావముగనేయున్నది. కాని నూతన ప్రపంచమున్నది. ముమ్మాటి కున్నది, వృద్ధిపొందు యత్నమందున్నది.

తప్పక వృద్ధి గాంచ గలదు. కాని దానిని పొందు మార్గము చాల నూతన మైనది. దాని నెవరు గ్రహించలేదు. ఆ మార్గమునెవ్వరు నడువలేదు. ఆ పనిని నెవ్వరుసాహసించలేదు. ఇదొకప్రారంభమువిశ్వప్రారంభము,అందు వల్ల ఇదొక సాహస కృత్యము. పరిపూర్ణముగా ముందుగా తెలియబడి నదియు, ఊహింపరానిదియు యగు సాహసము.

ఈ సాహస కార్యమం దుత్సాహము కలవారు కొందరు కలరు, వారికి నా పిలుపు నంద చేయుచు ఈ రీతిగా తెల్పుచున్నాను. ఈ సహస కార్యమునకు మిమ్ము ఆహ్వానించుట దీనియందు ఆధ్యాత్మికముగా ఇంతకు ముందు ఇతరులచే చేయబడినదే చేయుటకాదు. ఏలన మన సాహసము ఆ దశను దాటిన తర్వాత మొదలగును. ఒక నూతనసృష్టి పరిపూర్ణముగా నూతనము, కనివిని నటువంటి ఊహింపరానిదగు విపత్కర ప్రమాద ములుగల సాహస యత్నముకొరకు మనమున్నాము. ఇదొక నిజమైన సాహస కార్యమే కాని లక్ష్య ప్రాప్తి తప్పదు. దాని సాధించు మార్గము యెవరికి తెలియదు. కొంచెము కొంచెముగా అడు గడుగునకు ఇంతకు ముందు యెవ్వరికి తెలియని మార్గమును మనము నిరూపించుకొన వలయును. ఈ ప్రపంచ మందెన్నడు లేనిది ఇకముందిదే పెద్దముగ యుండునది ఈ మార్గము. దాని యందు నీకు అభిరుచి యున్న మొదల బయలు దేరుము. రేపేమి జరుగునది నాకే తెలియదు.

ఏదేది ముందుగ వాంఛించబడినదో ముందుగా పన్నుగడ చేయబడి నవో ఏవేవి నిర్మించబడినవో వానినెల్ల విడువ వలయును. తెలియని దాని లోనికి ముందుకు నడుపుము ఏమి వచ్చినా రానిమ్ము.

# బ్రహ్మచర్యము !

రచన :— వె. నాగేశ్వరరావుగారు

బ్రహ్మచర్యము: ఈ పదమున కర్థము, బ్రహ్మయందు చరించడ మని, అయితే, 'ఊర్ధ్వరేతస్కత' అనే అర్థము దీనికెలా ఏర్పడింది? బ్రహ్మయందు బ్రహ్మభూమికలో, ఊర్ధ్వభూమికలో నెలకొన్నపుడే ఈ ఊర్ధ్వరేతస్కత సాధ్యము.

"కామ ప్రవృత్తిని స్వాధీనపరచుకోవాలని శ్రీ అరవిందు డంటున్నారు. మంచిది, కాని ఎలా? 'స్వాధీనమను మాటలోనే దాని కీలకముంది. ఒక దానిని స్వాధీనపరచుకోవాలంటే, నీవు దానికి పై భూమికలోనుండాలి. శ్రీ అరవిందులు ఉపయోగించిన పదము Master అతడు 'Servant' కంటె పై భూమికలోనున్నాడని సూచిం చును. కామభూమికలోనుండి కామముతో పోరాడిన కొలది కామబలమే పెచ్చుపెరిగిపోతుంది — గజేంద్రమోక్షములోని మకరి బలమువలె; కొంచెమైనా మన మారోహించి, ఆ భూమికలోని శక్తితో సంపర్కము ఏర్పరచుకొన్నపుడు, ఆ శక్తి దిగి కామ సంశోధనమును సాధిస్తుంది. కాబట్టే ఆరోహణా వరోహణములు ఈ యోగానికి మూలసూత్ర మంటున్నారు శ్రీ అరవిందులు.

కాని ఆ భూమికలోనికి అధిరోహించగలిగేవరకు మనము ఏమి చేయాలి? ఆ ప్రయత్నము తోడ్తోడసాగుతూ ఉండగానే, ఎల్లప్పుడూ ఏదో ఒక సత్కార్యతత్పరులమై ఉండాలని పెద్దల వచనము. కారణం, అలా ఉన్నప్పుడు కామము పొడసూపి విజృంభించడానికి అంత అవకాశ ముండదు. ఈ విషయములో అనుభవము ఏమిచెప్పుతుందంటే, ఏ భోగము లేని స్థితిలో కామ భోగము కాదనుకొన్నా, అవసరమవుతుంది. అందు చేత నిరపాయమైన సాత్త్విక భోగములు పరిమితముగా నుండడం మంచిది.

తరువాత, ఎక్కడ వాతావరణము మహాపురుషుల సన్నిధివలన పవిత్రమై ఉంటుందో, అట్టి పరిసరాలు సహజంగానే బ్రహ్మచర్యానికి తోడ్పడతాయి. శ్రీ అరవిందాశ్రమ వాతావరణమట్టిదే, సమస్త జీవిత కర్మలు ఆశ్రమములో అవిరతంగా సాగుతూన్నప్పటికీ, బ్రహ్మచర్యానికి మాత్రము శ్రీ మాతారవిందులు అంత ప్రాముఖ్యమిచ్చారు। కామ కాలుష్యము కాస్త ఉన్నా, దివ్యానందము దిగిరాదని శ్రీ అరవిందులు గట్టిగా చెప్పిరి.

ప్రాణమయ కోశములో మన పరస్పర సంబంధము కామ మయంగా ఉంటుంది. పరమాత్మయందున్నపుడు మన పరస్పర సంబంధము ప్రేమమయంగా ఉంటుంది. అందుచేతనే సరియైన ఈ సత్య సంబంధమును పరమాత్మయందే కనుగొనగలమని పైన శ్రీ అరవిందులు అన్నారు. అక్కడ శరీరభావముకాక, ఏకాత్మ భావమే విలసిల్లుతుంది.

అందుచేత ఈ యోగమునందు ఇతరులతో ప్రాణమయ (Vital) సంబంధములకుగాని, ఆదాన ప్రదానములకుగాని తావెంతమాత్రము నుండ జాలదు. అట్టి సంబంధము, లేక వ్యవహారము— (Interchange) మన ఆత్మను అపరచేతనతో, దాని అపర స్వభావముతో బంధించి వేయును; భగవంతునితో సత్య, సంపూర్ణ సంయోగమునకు అడ్డు వచ్చును; అంతేగాదు, అతిమానస చేతనలోనికి ఆరోహణ, అతిమానస చేతనలోని ఈశ్వరశక్తి అవరోహణ — ఈ రెండింటికి కూడ ప్రతిబంధకమగును.

ఇక ఈ ప్రాణమయ వ్యాపారము కామసంబంధముగానో, కామ భోగముగానో—అందులో బాహ్యక్రియ లేనప్పటికీ— రూపొందినపుడు, అది మరింత అనర్థదాయకమగును, అందుచేతనే ఈ దుష్పరిణామాలు ఈ యోగమునందు అత్యంత నిషిద్ధములు. కామమునకు సంబంధించిన

కాయికక్రియకు తావులేదని చెప్పవలసిన పనిలేదు సరే, దాని సూక్ష్మ వ్యాపారానికి కూడ చోటులేదిక్కడ, మనోభావములకందని పరమేశ్వరునితో మనము ఏకమైనపుడే, ఆ పరమేశ్వరునియందు మన కిదరులతోగల యధార్థమగు ఆధ్యాత్మిక సంబంధములను కనుగొనగలము. ఆ పరతత్వ సమైక్యమునందు ఇట్టి మలినమగు అపర ప్రాణప్రవృత్తులకు ఎట్టి అవకాశము నుండదు.

కామ ప్రవృత్తిని అరికట్టి, అదుపులో పెట్టుకోవాలి; కామకేంద్రము ఎంతగా మనవశములో నుండాలంటే, కామశక్తి అధోగతినిపట్టి భ్రంశము నొందకుండ, ఊర్ధ్వగతిలో దానిని మనము పైకి ఆకర్షించుకోగలగాలి, ఆ విధానముద్వారానే నిజానికి (జీవ) బీజములోనున్న ప్రకృష్టబలము అన్ని శక్తులకు ఆధారభూతమగు ప్రథమ భౌతికశక్తిగా రూపాంతరము చెందగలదు—— వీర్యము ఓజస్సుగా మారగలదు.

నిజముగా నెవడీ యతి మానస జీవితమునకు సిద్ధము కావలెనని కోరునోయతడు సుఖానుభవము, విశ్రాంతి, అనుసేవములక్రింద దన చైతన్యము దుర్వ్యయమగుటకును నిశ్చేతనత్వమునకు దిగజారిపోవుటకు నెన్నడు ననుమతింపగూడదు. బలముపైపు వెలుగువైపుపోవలెగాని చీకటి పైపు బలహీనతవైపు పోగూడదు. అందువలననే అభివృద్ధినాకాంక్షించునందరికిని బ్రహ్మచర్యమొక నియమముగానున్నది. అయినను ముఖ్యముగా నెవరీ యతిమానసవ్యక్తీకరణమునకు దమకుదామేసిద్ధపడవలెనని కోరుచున్నారో వారి బ్రహ్మచర్య స్థానమున బరిపూర్ణ జితేంద్రియత్వమును తప్పక స్థాపించవలెను. ఈ జితేంద్రియత్వము నిర్బంధపెట్టుటచేతను అణచిపెట్టుటచేతను, మందులు ఆపరేషనులు వగైరా విరుద్ధ పనులద్వారా సంపాదింపబడగూడదు. ప్రజోత్పత్తి కార్యమునందు సాధారణముగా వినియోగింపబడు వీర్యమును అభివృద్ధికిని సంపూర్ణ పరివర్తనమునకు నుపయోగపడు ఓజస్సుగా మార్పుచేయు నొకవిధమైన యాంతరిక రసవాద

పద్ధతిద్వారా ఈ జితేంద్రియత్వము సంపాదింపబడవలెను పరిపూర్ణమును నిజముగా లాభకరమునయిన ఫలితము పొందుటకు సర్వవిధములైన దాంపత్యసుఖప్రేరణలను కోరికలను భౌతికేచ్ఛనుండివలెనే మానసిక ప్రాణిక చైతన్యమునుండి కూడ దప్పక తొలగింపవలెనను విషయము వేరుగా జెప్పనక్కరలేదు. సమూలమును చిరస్థాయియునగు పరివర్తన మంతయు లోపలనుండియే వెలుపలికి నడుచుచుండును. క్రమబద్ధమైనదిగా వెలుపల గనబడుచున్న పరివర్తన మంతఃపరివర్తనముయొక్క అప్రతి హార్య ఫలితమనియే చెప్పవలెను.

తన నియమమునకు "ఏదోయొకసారిలె"మ్మనునట్టి యెట్టి మినహా యింపులకును చనువియ్యగూడదు. ఎందుకనగా, ఆ మినహాయింపులు పలుమారు కోరబడవచ్చును. "ఒక్కసారియేగదా" యని మరలుకొను టకు నీవు లోబడినచో నీ సంకల్ప నిగ్రహశక్తిని నీవు తగ్గించుకొన్న వాడవగుదువు. అంతేకాదు: ప్రతి పర్యాయము ప్రతియొకదానికి నోడి పోవుటకు నీవు తలుపు తెరచినవాడవగుదువు. అట్టి బలహీనతలన్నిటికి నీవు తప్పక గడియవేయవలెను. నిన్ను బూర్తిగా జెరచి, వెనుకకునెట్టు ఏ చీకటి తప్పులుచేయకూడదు. ప్రతియొక మిథునకర్మయు మరణమువైపు ఒక యడుగువేయుటే యగును. అది అన్ని విధములైన దురభ్యాస ప్రాబల్యములకు దలుపు తెరచును.

లైంగిక వాసనతో ఏదో విధమగు దాని రహస్య సంతృప్తిని జోడించి, ఈ మిశ్రమమును యోగములో భాగమని భావించడంకంటే విపత్కరమైన భ్రాంతి మరియొకటుండదు. ఆధ్యాత్మిక పతనానికి సరాసరి దారితీయగల అమోఘమగు భయంకర మార్గమది, అది అతి మానసావ తరణమునకు అడ్డుకొను అవాంఛనీయ శక్తులను వెదజల్లును. అలా అడ్డు కొని అల్లకల్లోలమును వ్యాపింపజేసే, ప్రాణమయలోకపు అహితశక్తుల

అవతరణనే అది సాధించును. ఎప్పుడెప్పుడు ఇట్టి అపమార్గ ప్రవృత్తి పొడ సూప ప్రయత్నించునో, అప్పుడప్పుడు దానిని నిర్దాక్షిణ్యముగా నిరాకరించాలి; పరసత్యమవతరించి పరివర్తన కార్యము సాధింపగోరుదుమేని, ఈ అప ప్రవృత్తిని చేతనా ఫలకమునుంచి తుడిచివేయాలి!

తదితరునికి గాదు, తదితరమునకు గాదు — దేవదేవునికే సంపూర్ణాత్మ సమర్పణము; తద్వారా మాతృశ్రీ దివ్యశక్తితత్త్వముతో సంయోగము స్థాపించుకొని, అతిమానస భూమికలయందు తేజరిల్లు ఆ దేవదేవుని అత్యున్నత తేజోబలములను, శాంతి వైశాల్యములను, స్వచ్ఛతా నైర్మల్యములను, సత్యచేతనా సహజానందములను మనలోకి అవతరింపజేసికోవడం —ఇదియే సమర్పణ పూర్వమైన అవతరణయే— ఈ యోగములోని మూల సూత్ర సర్వస్వము.

# శ్రీ మాత సృష్టి

మూలము : శ్రీ అరవిందులు                    అనువాదం : చె. నాగేశ్వరరావు,
(24—4—1954)

భౌతిక ప్రపంచములో మార్పుతో సహా, భౌతిక స్వభావముగల కార్యమును చేయవలసి ఉందిగాన, శ్రీమాత శరీరమును ధరించడం జరిగింది. అంతేగాని, ఆమె ప్రజలతో భౌతిక సంబంధమును స్థాపించుకోడానికి రాలేదు. ఆమె కార్యములో పాల్గొనేందుకు కొందరు ఆమెతోనే వచ్చారు; మరికొందరిని ఆమె పిలిచింది; ఇంకా కొందరు వెలుగును వెతుక్కుంటూ వచ్చి ఆమెచెంత చేరారు. ప్రతి వ్యక్తితోనూ ఆమెకు వ్యక్తిగత సంబంధముంది. లేదా ఉండడానికి అవకాశముంది. కాని ప్రతిసంబంధములోనూ ఒక ప్రత్యేకత ఉండడంచేత, ఒకరిపట్ల ఏమిచేస్తుందో అందరిపట్ల సరిగా అదే చేయాలని చెప్పజాలము. కొంతమందితో ఆమె శరీర పరంగా సన్నిహితముగా ఉన్నదిగాన, తనతోగూడ అలాగే ఉండాలని కోరే అధికారము ఏ వ్యక్తికిలేదు. ఆమెతో కొందరికి దగ్గరి స్వకీయ సంబంధమున్నా, వారిని ఆమె చూస్తే ఎప్పుడోగాని చూడదు. కాని మరి కొందరికి ఆమెతో అంత దగ్గరి సంబంధం లేకపోయినా, ఏదో కారణం చేత ఆమెను తరచుగా, లేక ఎక్కువసేపు కలిసికొనడం తటస్థించుతోంది. భౌతిక మనస్సుయొక్క బుద్ధిలేని గణితశాస్త్ర నియమాలు ఈ సందర్భములో అనుసందించడం కేవలమూ అసంబద్ధము—అమ్మ ఏమి చేస్తోందో, దానిని నీ బాహ్య మనస్సు అర్థముచేసుకోలేదు. దాని విలువలు, ప్రమాణాలు, భావాలు అమ్మకు సంబంధించినవికావు. అంతకంటే అసంబద్ధమేమంటే, ఆమె ఏమిచేసినా నీప్రాణపురుషుని ఆదేశమునుగానీ, అభిలాషనుగానీ అనుసరించి చేయవలసి వుంటుందని తలపోయడం : ఆధ్యాత్మికవినాశనానికి సరిగా అదే మార్గము. విభిన్న కారణములను పురస్కరించుకొని ప్రతి విషయములోనూ, తదనుకూలముగానే ఆమె వ్యవహరించును.

శ్రీమాత, నేనూ సమమూ, ఏకమూకూడ. పైగా ఆమెదే ఇక్కడ సర్వాధిపత్యము. అందుచేత ఒక పనికి ఎలాచేస్తే ఉత్తమమని తలంచితే, అలా ఏర్పాటుచేసే అధికారము ఆమెకుంది. కాన ఆమె ఒకనికి ఒకకర్మను అప్పగించినపుడు, ఆ కర్మపై అతనికి ఎట్టి హక్కు ఉండదు. ఎట్టి అధికారమూ ఉండదు. ఎట్టి స్వామ్యము వుండదు. ఈ ఆశ్రమము శ్రీమాత సృష్టి. ఆమె లేకపోతే, అది ఉండేదేకాదు. ఆమె చేపట్టిన కార్యముకూడ ఆమె సృష్టే. ఆమెకు ఆకార్యము నెవ్వరూ అప్పగించలేదుగావున, దానినెవరూ ఆమెనుండి లాగివేయలేరు కూడ. ఆమెతో నీవు సముచిత సంబంధమును కోరుదువేని, ఆమెపట్ల సముచిత వైఖరిని అవలంభింప దలతువేని, పైన సూచించిన ప్రాథమిక సత్యమును అర్థము చేసుకోడానికి ప్రయత్నించు.

# భగవన్మహూర్తము

మూలం : శ్రీ అరవిందులు                    అనువాదము : చె. నాగేశ్వరరావు

(15–8–1954)

భగవదాత్మ మానవుల మధ్య మసలుతూ ఉండే మహనీయక్షణాలు కొన్ని వుంటాయి; అపుడు పరమేశ్వరుని యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసలు స్వేచ్ఛగా మన జీవిత జలాలపై విహరిస్తాయి. భగవదాత్మ ఉపసంహరించుకున్న మరికొన్ని సమయాలుంటాయి; ఈ సమయాల్లో, తమఅహంకారముయొక్క బలాబలాలమీదనే ఆధారపడి మానవులు వ్యవహరించేందుకు విడిచివేయబడతారు. పై క్షణాల్లో సామాన్య ప్రయత్నమైనా సమధిక ఫలితాలునిచ్చి భవితవ్యమునే మార్చివేస్తుంది. ఇక తరువాతి సమయాలు సుదీర్ఘమైనా, అందలి ప్రభూత పరిశ్రమకూడ చచ్చిచెడి, ఎలాగో పరిమిత ఫలితమునే ఇవ్వగలుగుతుంది. అయితే ఈ సమయాలు ఆ క్షణాలకు పూర్వ సన్నాహము కావచ్చుననేది సత్యమే. ఈ సమయాలు యజ్ఞకుండములోనుంచి పైకెగసే స్వల్పమగు ధూమమై, స్వర్గమునంటి ఈశ్వరుని యొక్క అనుగ్రహ సృష్టికి కారణము గావచ్చును.

ఒక వ్యక్తిగానీ, జాతిగానీ చెవులు పూడిపోవడంచేత భగవంతుని పిలుపు వినలేదు; కొడిగట్టి తన దీపమును సరిజేసుకుని ఉంచుకోకపోవడం చేత భగవంతునికి స్వాగతము చెప్పడానికి సంసిద్ధమై వుండదు. భగవత్ క్షణ మాసన్నమైనపుడు పిలుపు వినలేక నిద్రపోతూ ఉన్న లేక దీపముసరి లేక స్వాగతము పలకడానికి సంసిద్ధము గాని వ్యక్తి లేక జాతి దౌర్భాగ్యమును ఏమని చెప్పాలి ? ఇక బలముగలిగి, సిద్ధపడి ఉన్నవారు కూడ ఆశక్తిని వృథాపుత్తురేని, ఆ క్షణమును దురుపయోగము గావింతురేని, అహో ! వారిదౌర్భాగ్యము మరింత శోచనీయము, వారి దుఃస్థితి ముమ్మాటికీ దయనీయము ! వారి నష్టము కూడదీయరానిది, లేక వారి వినాశము ప్రతిమించినది.

భగవన్మహూర్త మరుదెంచినపుడు, ఆత్మ వంచనను, కాపట్య భావమును, అర్థములేని ఆత్మస్తుతిని నీ అంతరాత్మ నుండి అశేషముగా కడిగివేయుము. అపుడే నీ ఆత్మతత్వములోనికి సూటిగా చూపు నిగిడించి చూడగలవు, దానిని ఆదేశించే పిలుపును ఆలకించగలవు. స్వామి చూపు నుండీ, ఆదర్శముయొక్క వెలుగునుండీ ఒకప్పుడు నీకు రక్షణగానున్న నీ స్వభావములోని సమస్త కుటిలత — అదే ఇపుడు నీ కవచములో ఏర్పడిన సందుగామారి ప్రచంచ ప్రహారమును ఆహ్వానించుతుంది. ఒకవేళ నీవు తాత్కాలికజయమును బడసినప్పటికీ, అది నీకు మరింత అనర్థకరము. ఏలనంటే, ఆ ప్రహారము ఇంచుక పిమ్మటైనా విరుచుకుపడి, నీవు విజయోత్సాహములో విర్రవీగు సమయములోనే నిన్ను కూల్చివేస్తుంది. చేయవలసిన దేమంటే శుద్ధముగా నుండి భయము నంతనూ పారదోలుము, ఏలనంటే, తరచుగా ఈభగవన్మహూర్తము దారుణముగా తాండవించును. అది ఒక దావాగ్నియై, చక్రవాతమై, ఝంఝూమారుతమై, భగవంతుని క్రోధరూపమగు గానుగ యంత్రమై మనలను తల్లడిల్లజేయును. కాని ఎవరీ మహూర్తమునందు తన ధ్యేయముయొక్క సత్యాధారముపై నిలబడగలరో, వారే చివరి వరకు నిశ్చయముగా నిలబడతారు. ఒకవేళ వారు పడినా తిరిగి లేస్తారు; గాలికి కొట్టుకుపోయినట్లు కన్పించినా తిరిగివస్తారు. (భయమును పారదోలడంతో పాటు) చెవిలో కూర్చుని జాగ్రత్త ! అని గుస గుస చెప్పే లౌకిక వివేకమును కూడ అంత పాటింపకుము. ఏలనంటే, యీ ఘడియ అంతుబట్టని విషయాలు ఆవిష్కరించే అపూర్వ సమయము !

# మౌనము - వాక్కు

సేకరణ :- చక్కా సత్యనారాయణ

మౌనము, వాక్కు అను రెండు ఉత్కృష్ట శక్తులు, ఈ విశ్వములో నున్నవి. ఒకటి ఆంతరంగిక క్రియ; రెండవది బహిరంగ క్రియ. మౌనము పని చేయును; వాక్కు కార్యమునకు ప్రోత్సాహము నిచ్చును, మౌనమంటే మూగనోము పట్టడం కాదు. అనవసర వాగ్ధోరణిని కట్టిపెట్టాలి. పల్లెత్తి మాట ఎవరినీ అననని ఒట్టుపెట్టుకొనుము. తెలియని విషయాలను తెలిసి నట్లుగ చెప్పకూడదు. మిత్రులు రహస్యంగా చెప్పిన మాటలను బయటకు చెప్పకూడదు. మాటకు మాట ఎదురు ఆడకూడదు. వితండవాదము కూడదు. మన కర్మేంద్రియాల్లో కాని జ్ఞానేంద్రియాల్లోకాని ఏదీకూడ వాగింద్రియం చేసేటంత చెరుపు చేయలేవు. కనుకనే మన పెద్దలు చెప్పు చుంటారు. కాలుజారితే తీసుకోవచ్చును గాని పెదవి జారితే తీసుకోలేము. అందుకనే సాధకులు ముందు మౌనవ్రతంతో సాధనను ప్రారంభిస్తారు. మితాహారం శరీరారోగ్యానికెంత అవసరమో, మితవాక్కు మన చిత్త శుద్ధికంతకంటె కూడ అవసరమని రూఢిగా తెలుస్తున్నది.

ఒకానొక లోతులో శబ్దానికి మహాశక్తి ఉంటుంది. ఆ శబ్దము 'పశ్యంత్ వాక్'అంటారు శ్రీ అరవిందులే ఈమాటచెప్పారు. మౌనంలో గాని అట్టి లోతులలోకి పోలేము. అది మాటల కందని లోతు, తలపులు కూడ చేరని లోతు——శబ్ద బ్రహ్మాతివర్తతే — భావాతీతమైన నిరతిశయ శాంతపద మది. శాంతి సమాహిత చిత్తులైన మౌనవ్రతులకే లభ్యమది. ఈ శబ్దమయ ప్రపంచంలో తిరుగుతూన్నంత కాలం సత్యం గోచరించదు. మనం సాధారణంగా చెత్తమాటలు మాట్లాడుతాము. అహంకారంలోనుండి బయలుదేరే బడాయికోరుమాటలవి. నిజంగా మన నోటనుండి వచ్చేదంతా సత్యమే అయితే, లోకం ఈ పాటికి సత్యంతోనిండి పోయేది. మౌనం హృదయ అగాధం, దానిలోతు ఇతరులకెట్లు తెలుస్తుంది? మౌన నియ

మాన్ని అవలంబించితే అనుభవమువల్ల అది మన ఆత్మోన్నతి కెంతయో సహాయకారని తెలుస్తుంది.

శ్రీ తల్లిగారు ఇలా చెప్పుచున్నారు "నిశ్శబ్దత, నిశబ్దత, నిశ్శబ్దత యందు మాత్రమే ఏదేని ఘనకార్యము సాధింపబడగలదు."

పవిత్రమైన ఒక మహాశక్తి, శాశ్వతశక్తి (జగజ్జననీ) మనలో దాగియున్నది. ఆ మహాశక్తిని ప్రకటింపజేయాలంటే, మౌనంగావుండాలి. మౌనం వైపుకు ప్రజలను మరల్చాలి. నేడు ప్రపంచములో ఆంతరిక మౌనంనుండి కోలాహలంవైపుకు పరుగులిడుతున్నాము. అందువల్ల భగవంతుడనే శబ్దమే వినబడడంలేదు. పోనీ యితర కోలాహలాలతోపాటు దీన్ని కలిపి, కోలాహలం చేస్తామా? అయితే "భగవంతుడు అనే శబ్దపు ప్రత్యేకత ఏముంటుంది? అందుకే శ్రీ తల్లిగారు "మౌనం సృష్టించా అన్నారు."

ఏమైనను, మాట లాడుటను బూర్తిగ నిషేధించుటకంటె దానినొక కొలతలో నియమించుట చాల శ్రేష్టతరమైన తపస్సు. కాని ప్రపంచములో చాల మంది ప్రజలు కొలతయు తారతమ్య జ్ఞానము లేకుండ మాటలాడు శక్తినమలు పఱచు చున్నారు. ఆ సంభాషణల కల కలముతో ఈ ప్రపంచము బధిర మగుచున్నది.

పదముల యెడ తెగని సవ్వడి మామూలు దినచర్యకు ద్రోసివేయ రాని సహచరముగా నుండ వలసినట్లు కనబడుచున్నది. అయినను ఈ సవ్వడిని సాధ్యమైనంత తక్కువ కొలతకు తగ్గించుటకు మనము ప్రయత్నించినచో మౌనమునందే యనేక కార్యములు ఇంత కంటే మేలుగ శీఘ్రముగ జేయ బడుననియు, ఈ మౌనమంత ప్రశాంతిని ఏకాగ్రతను నిలుపు కొనుటకు సహాయ పడుననియు మనము కనుగొన మొదలు పెట్టుదుము.

మనము ఒంటరిగా గాక, యితరులతో గలిసి నివసించు చున్నచో, నిరంతరము మాటల ద్వారా మనలను మనమే బయలు పఱచు కొనకుండు నట్టి యభ్యాసము నలవఱచు కొన వలయును. అప్పుడు మనకును ఇతరులకును నడుమ నొకరి కొకరర్థము చేసికొను నేదోయొక యాంతరిక బంధము నెలకొల్ప బడినదని క్రమముగా దెలియ గలదు. అప్పుడు మనము పరిమిత పదములతోనో పదములు లేకుండగనో యొకరి కొకరు వార్తలందించు కొనుటకు సమర్థుల మగుదుము. ఈ బాహ్య మౌనమంతః ప్రశాంతికి మిక్కుటి యనుకూల మైనది. మనకు దృఢ సంకల్పము—ఎడ తెగని యాకాంక్షయున్నచో నభివృద్ధి కనుకూలమైన వాతావరణమును మనము సృష్టించుకొనగలము.

మనము ఉచ్చరించు మాటల నెల్లప్పుడు నియమితముచేసి, హఠాత్తుగా బ్రద్దలు చేసికొనువచ్చు. కోపముచేతను, క్రౌర్యము చేతను భావోద్రేకము చేతను మన నాలుక జారవిడువగూడదు. ఇట్లుమాట్లాడుట దుష్ఫలితముల గలిగించు కేవలమొక జగడము చేయుట మాత్రముగాదు—నిజమున కిది వాతావరణమునందు దుష్ట భావతరంగములను వ్యాపింపజేయుటకై మన నాలుక నుపయోగించుటే యగును. ఎందుకనగా శబ్దతరంగములకంటె నధికముగా వ్యాపన శీలమైనది మరియొకటిలేదు. ఆ భావావేశ వ్యాపారములు తమకు దామే వెల్లడి యగుట కవకాశమిచ్చుటచేత వానిని మన యందును ఇతరుల యందును మనమే శాశ్వతీకరించుచున్నాము. ఇతరులను గురించి మనము చెప్పునదంతయు అత్యంతా వాంఛనీయములైన వదరుబోతు తనములో నొకటిగా బరిగణింపబడుటయే యగును.

మనము కొందర వ్యక్తులకు సంరక్షకులముగానో ఉపాధ్యాయుడుగానో లేక ఆయా అధికార వ్యవస్థలకు ముఖ్యాధికారివిగానో జవాబుదారీ వహించిన వాడవుగా నున్నప్పుడుతప్ప, ఇతరులేమి చేసినను చేయకున్నను దానిలో నీకు సంబంధములేనేలేదు. వారిపై గాని, వారుచేయు పనిపై గాని,

లేక వారినిగురించి యితరులేమను కొనెదరో యేమిచేప్పెదరో దానిని గూర్చిగాని నీయభిప్రాయమిచ్చుటకును—వారిని గూర్చి మాటలాడుటకును నిన్ను నీవు హద్దులలో నుంచుకొనవలెను. ప్రత్యేకముగా నీవంతుకియ్యబడిన పనియందు నీచమైన నీవ్యక్తిగతాసూయను కలుపనే కూడదు.

ఈ భూమియందు దవతారమునెత్తిన శ్రీ మాతా రవిందులు పైవ స్వరూపులైనను వారుకూడ వ్యక్తిగతముగా ఈ మౌన నియమమునకు లోబడి యున్నారనుట సత్యమే. ఇటువంటి యభివృద్ధి నియమములకు వారుకూడ గురియైయున్నారు.

శ్రీ తల్లిగారు ఈలా నుడివిరి. "అభివృద్ధి యనునది పూర్ణసత్తతో పైవమును నిండుగా గౌగిలించుకొనుటతో నేర్పడు సాసంగముద్వారానే కలుగును; నీ సంభాషణము సత్యమునే వెల్లడింపవలెననియు వాక్ఛక్తిని సంపాదింపవలెననియు నీవు కోరినచో, నీవు చెప్పబోవు దానిని గూర్చి ముందుగా నాలోచింపకుము. ఏది చెప్పుట బాగో ఓగో ముందుగ నిర్ణయింపకుము. నీవు దేనిని చెప్పబోవుచున్నవో దాని ప్రయోజనము ఎట్టిదిగా నుండవచ్చునని లెక్కింపకుము. నీ మనసునందు నిశ్శబ్దముగా నుండుము. యథార్థ ప్రవృత్తియందు నిలుకడగా నుండుము. విశ్వవివేకము వైపు, విశ్వవిజ్ఞానమువైపు, విశ్వచైతన్యమువైపు ఎడతెగని యాకాంక్షయే యథార్థ ప్రవృత్తియగును. నీ యాకాంక్ష నిజమైనదైనచో, పనులను జక్కగా జేయవలెను; విజయము పొందవలెనను కోరికల కది కేవలమొక ముసుగుగానుండకపోయినచో, అది పరిశుద్ధము —స్వతస్సిద్ధము — పరిపూర్ణమునైనచో అప్పుడు నీవు సహజముగా మాట్లాడుదువు. నీవు పలుకవలసిన పదములనే—ఎక్కువ తక్కువ లేకుండ — బలికెదవు. ఆ వాక్కులు అమోఘ సృజన శక్తి గర్భితములై యుండును.

# దైవము తన్నర్పించుకొనును

## [అని యనుటలో శ్రీమాతారవిందుల యభిప్రాయమేమి.]

చక్కా సత్యనారాయణ.

వారి భావము కచ్చితముగా నిదియే. నిన్ను నీవు దైవమున కధికాధికముగా అర్పించుకొనుకొలది దైవము నీకే నీ కొరకే తన్నర్పించు కొన్నట్లు నీకనుభవము కల్గును. అదిఒక కేవలము మనోభావముగాని యభిప్రాయముగాని భావసంచలనగాని కాదు. అదియొక పూర్ణానుభవము. నీవెంత అధికముగ ప్రతిక్షణమందు నీ సర్వ చింతనలందు, నీ సర్వావసరములందు, అర్పించుకుందువో అంత నీతోనుండును— నీ ఆకాంక్షలకు వెంటనే బదులు చెప్పును. మరియు అత్యుత్తమైన ఐక్యము. ఒక పరిపూర్ణ సన్నిహితత్వము, అతనితో నీకుండును. ఆ భగవానునియందు నిలుపుకొని నీవు వారినిభక్తితో మోసికొని తిరుగుచున్నట్లుండును. నీవు నడిచినప్పుడాతడు నీతో నడచును, నీవు నిద్రించుచో అతడు నీతో నిద్రించును. నీవు భుజించునపుడాతడు నీతో భుజించును. నీవుచింతన చేయునపుడాతడు నీతో కూడ చింతనచేయుచుండును. నీవాతనికి భక్తి చేసినపుడు డాతడు నీకుండు భక్తియే యగును.

కాని అట్లగుటకు నీవు నిన్ను పూర్తిగ, కేవలముగ అవ్యభిచరితముగ, దేనిని త్రోసివేయక; దేనినిగూడ నీకొరకుంచుకొనక, ఎట్టి దాపరకము చేయక అర్పించుకొనవలెను. దైవార్పణముకానిదే యల్పమైనను సరే వ్యర్థము. నీ వుత్సాహమునకది భంగము. దానివలన దైవమందలి నీ యానందము అంతవరకు తరుగబడును: నీవు దైవమునకేది అర్పింపకుందువో అదంతయు నీ కొరకు దైవం తన్నర్పించుకొను సాధ్యతను దూరం చేయును. నీ వాతనిని సన్నిహితముగా ఎడతెగక యున్నట్లనుభవించలేవు. ఏలన నీ వాతనివాడవుకావు. నీవు నూర్లకొలదిగా ననేక విష

యములయందును, అనేక వ్యక్తులయందును తగుల్కొని యున్నవాడవు. నీ చింతనయందేమి, నీ క్రియలయందేమి, నీ భావములందేమి నీ ప్రేరణలందేమి, నీవాతని కర్పింపకుండునవి లక్షలకు మించిన విషయములున్నవి. అందువలన నీవాతని నెల్లప్పుడనుభవించలేవు. ఇట్టి విషయములన్నియు దైవమును నీనుండి వేరు చేయుటకు అడ్డుగా కట్టబడు గోడలులేక ఆటంకములగును.

కాని నీవు నీ సర్వస్వము అతని కర్పించితివేని, నీకొరకెద్దానిని దాచుకొనవైతివేని ఆతడు నిరంతరముగా పరిపూర్ణముగా నీవు చేయు సర్వమందుండును. నీచే చింతింపబడు సర్వమునందును నీవనుభవించు సర్వభావములందును, సర్వదా ప్రతిక్షణము నీతోనుండును.

కాని అట్లగుటకు శ్రీమాత, శ్రీ అరవిందులు నొక్కి వునరుద్ఘాటించునదేమన ఆత్మార్పణము కేవలము పరిపూర్ణముగా నుండవలెను. ఎద్దానినేని నీ కొరకు దాచుకొనగూడదు. నీ కొరకు నీవు భద్రవరచుకొను ప్రతి ఒకటియు నీ నుండి భగవంతుని వేరుచేయుటకు నడ్డముగా కట్టబడు గోడకు ఉపయోగించు సొగరాయియై యుండును. అప్పుడు నీవు "ఓహో నేనా భగవంతుని ననుభవించలేదు." అని మొరవిడెదవు. ఆ భగవానుని నీ వెప్పుడేనియనుభవించి యుండినచో అదికూడ నాశ్చర్యమే.

# సత్యమును తెలిసికోవడం మంచిదే

సేకరణ : — చక్కా సత్యనారాయణ.

మన ఇష్టము వచ్చిన పని చేస్తూ, అది శ్రీ అరవిందులు చెప్పినదే నని, ఆయన వచనములనే ఉదాహరించి ఎలా సంతృప్తి పడవచ్చో, కాని నిజానికి అది ఎలా ఆభాస మాత్రమేనో, లేక పాక్షిక సత్యమేనో — ఈ క్రింది ఉదంతము విశదపరుస్తుంది. (మదర్ ఇండియా: 5-12-69) శ్రీ అరవిందుని అనుచరులే కొందరు ఇలా వాదించారు.

"అతిమానసయోగానికి శ్రీమాత శ్రీ అరవిందుల ఆశ్రయము తప్పితే, మరెవ్వరి ఆశ్రయము పనికిరాదని అనేకులు అనుకుంటారు. వీరి భక్తి మెచ్చుకోదగినదే; కాని శ్రీ అరవిందుడే అతిమానస యోగమును గురించిఏమి చెప్పారో చూడవలసిన అవసరముంది, లేకపోతే శాఖాతత్వం (Sectarianism) పెంపొందే ప్రమాదమేర్పడగలదు.

"శ్రీ అరవిందుడు ఈ శాఖాతత్వానికి (ప్రత్యేకమతానికి) శుద్ధ వ్యతిరేకి. యోగసమన్వయ గ్రంథములో 'చతుర్విధసహాయములు' అనే అధ్యాయములో ఆయన చెప్పినదేమిటో చూడండి; పూర్ణయోగ సాధకుడు ఈ నాలుగు ఉపాయములనుకూడ ఉపయోగించుకొనును:— తన స్వభావము ననుసరించి, అయితే అతడు వాటి పరిమితులను దాటిపోవలసిన అవసరమెంతైనా ఉంది. "నా దేవుడు నా అవతారము, నా దూత, నా గురువు" అని చాటుకొనే సంకుచితమగు అహంకార ప్రవృత్తిని దూరముగా విడనాడాలి, ఈ అహంకార ప్రవృత్తే పాక్షిక భావంతో, మతావేశంతో తన సాక్షాత్కారానికి, తదితరుల సాక్షాత్కారానికీ మధ్య అఖాతము కల్పించుతుంది. కాని సమస్త పాక్షిక భావమును, సమస్త మతావేశమును పరిహరించి తీరాలి. ఏలనంటే, దివ్య సాక్షాత్కారముయొక్క సమగ్రతరమౌ దానికీ పొందుకుదరదు! వారే మరొక ఉదాహరణమును కూడ తమ వాదమును సమర్థించుకోడానికిట్లు చూపుతున్నారు :

"అంతేగాక, శ్రీ అరవింద లేఖలలోకూడ మనకీ పంక్తులు గోచరించును. 'కృష్ణోపాసనపట్ల నాకే ఆక్షేపణలేదు, వాసుదేవ భక్తి విధానమువల్ల నాకే విరోధములేదు. వైష్ణవభక్తికి. నా అతిమనోయోగానికి అసంగతత్వము కూడాలేదు. నిజానికి అతిమనోయోగమునకు ఇది మాత్రమేనని ప్రత్యేక రూపములేదు. అన్ని మార్గాలు భగవంతునికడకు చేర్చకలుగునట్లే, అన్ని మార్గాలు అతి మనస్సునకు దారితీయగలవు.

"అందుచేత ఈ వాదము ఇక్కడ అంతమొందుతున్నదనే నాఅభిప్రాయము. శ్రీ అరవిందుడు మనలను హెచ్చరించి, తన తుది మాటను (సిద్ధాంతవాక్యమును) వెల్లడించారు. దీనిని మనము గట్టిగా గుర్తుపెట్టుకోవాలి!"

ఇది కొందరి వాదము. వీరి ఉదాహరణలు, ఎంత ఉద్ధండముగా ఉన్నాయో! వీటిని ఆధారముగా చేసుకుని లాగిన సిద్ధాంతములు (Conclusion) ఎంత అప్రతిహతముగా కన్పిస్తున్నాయో!—చూడండి అని కె. డి. సేత్నా ఆ నిర్ణయాలను ఈ క్రింది విధముగా పూర్వపక్షము చేస్తున్నారు.

'నా దేవుడు, నా గురువు' అని ఆక్రోశించరాదని మాత్రమే శ్రీ అరవిందుడు హెచ్చరించారుగాని, ఏ దేవుడు, ఏ గురువైనా సరిపోతారు. అతి మానసయోగానికి అని ప్రతిపాదించలేదుగదా!

తర్వాత వాసుదేవభక్తి విధానముపట్ల అతి మనోయోగానికి అసంగతత్త్వము లేదనిమాత్రమే అన్నారుగాని శ్రీ అరవిందుడు, ప్రస్తుతము ఆ భక్తి విధానము అమలులో ఉన్న పద్ధతిని చేపట్టినా బాధలేదని వెల్లడించలేదుగదా !

అన్ని మార్గాలు అతి మనస్సుకు దారితీయగలవు అని శ్రీ అరవిందుడు ప్రయోగించిన 'గలవు' శబ్దములోని అంతర్యమును— సూక్ష్మార్థ

మును— మనము పరిశీలించాలి. దారితీయగలవు— అనే పదములో దారి తీయును— అనే విశాలార్థముగానీ, దారితీసితీరును— అనే అవశ్యార్థముగానీ లేవుగదా: దారితీయగలవు— అంటే, ఆ మార్గమును సరిగా మన ఆశయమునకు ఉపయోగించుకుంటే, అప్పుడు అదికూడ ఆ ఆశయమునకు సహాయపడగలదు— అనే అర్థము మాత్రమే వెలువడును. సరిగా ఉపయోగించుకుంటే, ఆ పద్ధతులు కొంతవరకు సహాయపడగలవు— అనేదే దాని అర్థము.

ఇక తన యోగము నూతన యోగమని, పైగా ఏర్పరుపబడిన అట్టి మార్గాలే ఉంటే, నేనింత శ్రమవడి ఉండను— అని సందేహానికి తావు లేకుండా శ్రీ అరవిందులు చెప్పివేశారు. అందులో అపూర్వత ఉందని ఆ నూతనత్వమును ఈ క్రింది విధముగా వివరించుతున్నారు. పూర్వయోగములతో తూచి చూచినపుడు నా యోగము ఈ క్రింధి మూడు ముఖ్య విషయాలలో వినూత్నమని శ్రీ అరవిందుడు వివరించుతున్నారు :

" (1) ఈ యోగలక్ష్యము పృథ్వీతలమునుండి, పృథివీ జీవితము నుండి ఏ సుదూర స్వర్గములోనికో, ఏ అభావ నిర్వాణములోనికో నిష్క్రమణము కాదు. జీవిత పరివర్తనమే. సత్తా పరివర్తనమే దీని లక్ష్యము. పైగా దీని కీలక్ష్యము అప్రధానమూ, అగంతుకమూకాదు. ఇదే ఈ యోగానికి విశిష్ట, కేంద్రియ లక్ష్యము. ఇతర యోగములలో అవరోహణ అనేది అసలు ఉంటే; అది ప్రయాణములో ఒక ఘటనగానో, ఆరోహణకు అనపేక్షిత ఫలితముగానో మాత్రమే ఉన్నది—ఈ యోగాలలో ఆరోహణమే అసలు విషయము, కాని మనకు ఆరోహణ మొదటి మెట్టు మాత్రమే, అది అవరోహణకు సాధనము మాత్రమే. ఆరోహణచేత అందిన నూతన చేతనయొక్క అవరోహణే ఈ యోగసాధనను తెలిపే ప్రత్యేక ముద్ర,

నిజమైన ప్రామాణ్యము. చివరకు తాంత్రిక వైష్ణవ మతములుకూడ (జీవితముక్తియందుగాక) జీవితమునుండి విముక్తియందే పర్యవసించును. కాగా ఇక్కడి (మన) ఆశయము జీవితముయొక్క దివ్య సాఫల్యము.

"(2) ఇక్కడ ఆశించే ప్రయోజనము వ్యక్తి నిమిత్తం అపేక్షించే, దివ్య సాక్షాత్కారముయొక్క వ్యక్తిగత సంసిద్ధికాదు; పృధివియందు పృథివీ చేతనకొరకు సంపాదించదలచిన ప్రయోజన విశేష మది— అది విశ్వగత ప్రయోజనము కాని, కేవల విశ్వాతీత సంసిద్ధికాదు. మనము పొందదలచిన వస్తువు వ్యక్తిగతముకాదు సరే, అది అపూర్వముకూడ. ఏలనంటే, మనమాశించే చేతనా శక్తి (అతి మనస్సు) ఇంత దనుక పృథివీ ప్రకృతియందు సంఘటితము (Organised) కాలేదు. లేక ప్రత్యక్షముగా వ్యాపృతము (Active) కాలేదు — ఆధ్యాత్మిక జీవితము నందుకూడ వ్యాపృతము కాలేదు. దాని నిపుడు సంఘటిత పరచి, సరాసరి సక్రియము చేయవలసి ఉంది.

"(3) పై ప్రయోజనము సాధించేందుకు ఇక్కడ ఒక అనన్య విధానము వెలువరించబడింది. ఈ యోగము అపేక్షించే లక్ష్యం, అనగా చేతనా స్వభావముయొక్క సంపూర్ణ సమగ్ర పరివర్తనమువలే, ఈ విధానముకూడ సంపూర్ణమూ, సమగ్రమూనై ఒప్పారుతోంది. ఈ విధానము ప్రాత పద్ధతులను, ఆ పద్ధతులకంటే విశిష్టమగు తదన్య పద్ధతులకు అంశ ప్రక్రియగానూ, ప్రస్తుత సహాయముగాను మాత్రమే చేపట్టును. ఈ విధానమును (దీని పూర్ణరూపమును) గానీ, కనీసం స్పష్టముగా ప్రకటించి, సాధించడం జరిగిన, దీనిని బోలిన మరిదేనినైనా గానీ ప్రాచీన యోగాలలో నేను కనుగొనలేకపోయాను. అలా కనుగొనడమేజరిగితే(వినూత్న) మార్గాలను ఛేదించి, నిర్మించడానికి నా కాలమును వృధాపుచ్చేవాడిని కాదు. ముప్పది సంవత్సరాలు పరిశోధనలోమునిగిఅంతఃసృష్టికి పూనుకోవలసిన

అవసరముండేది కాదు. గుర్తులుపెట్టి, నిర్మాణానికి ఉపక్రమించి, నిర్దుష్టంగా పటాలు తయారుచేసి, రాయిపరచి, రక్షణకల్పించి, ప్రకటించబడిన ప్రాచీన మార్గాలే ప్రాప్తమైతే, ఆయాసము కలిగించని చిన్న పరుగులతో గమ్యస్థానమగు స్వస్థానానికి త్వరత్వరగా పురోగమించి, నిరపాయముగా చేరుకొని ఉండేవాడను. మనయోగము పాత బాటపై తిరిగి పయనించడం కాదు. అది ఒక ఆధ్యాత్మిక సాహసయాత్ర !"

కాని పండితులు భాషిస్తూనే ఉంటారు. వాదిస్తూనే ఉంటారు. భౌతిక భూమికలో భగవదావిర్భావము అసంభమని సిద్ధాంతీకరించుతూనే వుంటారు. సిద్ధాంతీకరించి నిద్రపోతూ వుంటారు. (వారిఅజ్ఞాన సిద్ధాంతమే వారి అయోమయ నిద్రామోహము) కాని భగవంతుడు తెరవెనుక పెరుగుతూనే వుంటాడు. భగవదంశము సృష్టిలో ప్రవృద్ధమవుతూనే ఉంటుంది. తెరవెనుక ఎందుకంటే, పండితుల బారిపడకుండా వుండడానికి; అలా పెరిగి పెరిగి ఒక్కసారి బ్రద్దలు కొట్టుకుని బయటికి వస్తాడు. దానిని కళ్ళారాగాంచినపుడే గాని మానవులు ఆ మహాద్భుతము విశ్వసించలేరు. వారి జన్మ దినమునాడే భారతావనికి స్వరాజ్య భాగ్యం సంభవించింది. అది కాకతాళీయముగాదు. తనను నడిపించుతూన్న భగవంతుడు తన కార్య సాఫల్యముమీద వేసిన అధికార ముద్ర అని శ్రీ అరవిందులే అసందిగ్ధముగా అన్నారు. ఇకవారి ఈ శతవార్షిక 1972వ సంవత్సరములో కూడ మహత్తర సంఘటనలు సంభవించబోతున్నాయని చెప్పవచ్చును. ఉదాహరణకు, బంగ్లాదేశము ఇంత నాటకీయ ఫక్కీలో ఆవిర్భవిస్తుందని ఎవరూ నమ్మలేదు. ఆశించనుకూడ లేదు. భగవత్ కర్మను స్థాపించడానికి అరుదెంచిన ఆ మహితాత్ములైన శ్రీమాతారవిందులను మనము స్మరించెదము గాక !

ఇటీవల 24-4-72వ తేది దర్శనము రోజున నిచ్చిన సందేశము కూడ ఈలా ధ్వనిస్తూనే యున్నది. "అతడు కానరాకుండానే మనలోని చీకటి భాగములందు ప్రవేశించి, ఆ చీకటినే తెరచేసుకుని దాని వెనుక తన కార్యము గావించుతూ, ఆ చీకటి భాగములు కూడ తదవసరమును గుర్తించి, మారడానికి స్వయముగా సంకల్పించుకొనేవరకు సర్వజ్ఞుడైన ఈ అతిధి సూక్ష్మరూపమున మనలను నడుపుతూనే ఉండును. ఇచ్చటి సమస్తము ఒక సమున్నత ధర్మమునకు విధేయతను అలవరచుకోవాలి; సూక్ష్మాతి సూక్ష్మములగు మన శరీర కణములు కూడ ఆ అమరజ్యోతిని తమ గర్భమున ధరించి మించాలి."

జై జగత్.

# వివిధ విషయములు

సేకరణ : చక్కా సత్యనారాయణ

1971 ఆగష్టు 'మదర్ ఇండియా'లో 'శ్రీ అరవిందులు — అధునాతనావతారము' అనే సుదీర్ఘ ప్రసంగ వ్యాస మున్నది. దాని కర్త నీరద్ బరన్ 'అధునాతన' అంటే ఇప్పటి అవతారమనికాదు. ఇప్పటి వైజ్ఞానిక యుగములో మానవ మనస్తత్వానికి అనురూపమైన అవతారమని, శ్రీఅరవిందులు ఆయనతో ఎంత అన్యోన్యముగా వ్యవహరించారో చూడాలి! ఆయన ప్రశ్నలపట్ల, ప్రవర్తనపట్ల ఎంతటి సహన విశేషము, క్షమా భావము! ఈ స్వేచ్ఛ శ్రీ అరవిందయోగములోని ఒకవిశేషము. స్వేచ్ఛ ద్వారా శ్రీ అరవిందుని అర్థము చేసుకున్నప్పుడు కలిగిన సహజ గంభీర ప్రేమానురాగములు తదితరముగా కలుగవు. స్వేచ్ఛా వాతావరణములోనే మనోవికాసము - మనః కుసుమ వికాసము!

శ్రీ అరవిందులు అవతారమని ఆదిలో ఆయన అంగీకరించకపోగా —'నీ యోగము ఒక బూటకము' అనే పదప్రయోగము కూడ చేశారు నీరద్‌బరన్. అప్పటికీ పరమసహనముతో విషయ వివరణము చేశారు శ్రీ అరవిందులు. దాని చరమ ఫలితంగా 'శ్రీ అరవిందులు, అపూర్వావతార' మని అవగాహనపొంది, దానినే ఎలుగెత్తి చాటుతున్నారు నీరద్ బరన్ ఇపుడు.

"అమ్మ ముఖముమీద అనరాని మాటలన్న, అసభ్య బాషనుపయోగించిన ఒకరిద్దరి సాధకుల విషయం నేను స్వయంగా చూచాను. అదివిని నా తల తిరిగిపోయింది! కాని అమ్మ మాత్రము ఆ దూషణలను దిగ మ్రింగి పెదవి కదపకుండా వెళ్ళిపోయారు." అని మరొక ఘట్టమును ఆ వ్యాసములోనే ఉద్ఘాటించారు. నీరద్, అంటే తమ శిష్యులకు అంతటి స్వేచ్ఛ నిచ్చారన్నమాట. ఆ దైవస్వరూపు లిరువురు.

ప్రథమ దర్శనంలో అమ్మ శ్రీ అరవిందుని ఎలా భావించారో - ఎలాదర్శించారో మనకు తెలుసు. 'ఆ పరమేశ్వరునికి.(శ్రీ అరవిందునికి) నా సర్వస్వమము సమర్పించుకుంటున్నాను । - అని అంతరాంతరాల్లో అలా చేశారు. కానిమనకింత వరకు తెలియని ఈసంగతి పరికించండి। ఇందులో అమ్మపట్ల శ్రీ అరవిందుని అనుభవం మనకు తెలుస్తుంది.

"కొంత సాగిన పిమ్మట లోపలి గురువు తన సహాయమును విరమించుకోవచ్చు. లేలే (శ్రీ అరవిందుని ప్రథమ బాహ్యగురువు) సహాయమును పొందక పూర్వమే నేను అంతః శాంతినందుకున్నాను. కాని పొండిచేరి చేరినపుడు లోపలినుంచి నాకెలాంటి సాహాయ్యము లభించలేదు. అపుడు ఏదో ఒక బాహ్య వస్తువునుండో, బాహ్యవ్యక్తినుండో ప్రకాశము నర్థించాను. అంతలో మీరా (అప్పటి అమ్మపేరు) వచ్చారు. ఆమెవచ్చి వుండకపోతే నే నిప్పటికీ చీకటిలో తడుముకుంటూనే ఉండేవాడను।" అని శ్రీ అరవిందులు ప్రకటించారు. 1926లో వారిరువురికి పరస్పర భగవద్భావము పైవిధముగా ప్రస్ఫుటమై ఉన్నప్పటికీ, వారి సంబంధము స్వేచ్ఛామయము, ఏకతానిష్ఠము.

సాధనకు ప్రాధాన్యమిస్తూ; స్వేచ్ఛగా మనచేతనను వికసించనివ్వాలి :— ఇది మన సాధనకు ప్రముఖ సూత్రము కావాలి। అమ్మే మన ద్వారా ఈ పనులు చేయిస్తూంటే, అంతకంటే అపేక్షించదగిన దేముంది ? కృషి మన చేతనకు సహజమయ్యేలాగున చూచుకోవడం అవసరం. ఈ సూత్రము అన్నివిధాలా కృషికి అనువర్తిస్తుంది, నియతంగా నిత్యము ఒకడుగు ముందుకువేస్తే గమ్యానికి తెలియకుండానే చేరుకుంటాము.

కలకత్తా మొదలైన ప్రదేశాలనుంచి అనేకులు అమ్మకు తమ కష్టాలను నివేదించుకుంటూవుంటే, వారి లేఖలు అమ్మకు చేరక పూర్వమే ఆ కష్టాలు కరిగిపోయిన సందర్భాలున్నాయి. దీనిని పురస్కరించుకొని

శ్రీ అరవిందులు తమ లేఖలలో ఇలా వివరించారు : అమ్మ వ్యక్తిగత చేతనకు అవితెలియనవసరంలేదు. అమ్మ విశ్వగతచేతన ఆప్రార్థన నందు కొని ప్రతిస్పందిస్తుంది. అదే ఆ కష్ట నివృత్తికి కారణము. భౌతికశాస్త్ర వేత్తలు దానిని తెలుసుకోలేరు సరే,నమ్మనుకూడ లేకపోవచ్చును. కొండ ప్రదేశానికి వెళ్ళినపుడు రోగము ఉపశమించవచ్చు. కాని అక్కడ వ్యక్తిత్వరహితమైన (Impersonal) వాతావరణముచేత అందరికీ లభించే సాహాయ్యమది. అమ్మనుంచి లభించే సహాయ్యము దీనికి భిన్నమైనది. ప్రార్థనవిని ప్రేమతో అమ్మప్రత్యేకముగా దుఃఖితునికి మాత్రమే అందజేసే అనుగ్రహ కిరణమది :—అనిఅసందిగ్ధంగా శ్రీ అరవిందులన్నారు. తనకు తెలియకుండానే తానుబిడ్డలకుకావలసినది చేస్తుందటతల్లి. (ఒకానొకప్పుడు తెలియకుండా సంభవించవచ్చు. అనేక పర్యాయాలు బాహ్యచేతనలో కూడ అమ్మకు స్ఫురిస్తుంది. మన ఆర్తి, పులుపు,ఆకాంక్ష) ఈ దివ్యజననిని మన మస్తిష్కముతో ఎలాకొలుస్తాము? అందుచేతనే, అమ్మఅద్భుతశక్తియొక్క గతివేగమును అందుకోవడం ఎంతటిమేధావికి కూడ ఏమాత్రము సాధ్యము కానివిషయమని శ్రీ అరవిందుడు తన 'మాతృశ్రీ' (The Mother) లో వక్కాణించారు.

కనుక అమ్మ మనద్వారా చేస్తున్నారనే దానిలో ఆశ్చర్యము లేదు. కాని ఎంతవరకు ఆమెను మనము చేయనిస్తున్నాము? ఇదే ప్రశ్న.

అమ్మ ఒకసారి ఇలా అన్నారు : "దివ్యశక్తిదిగి తీవ్రంగా పని చేస్తోంది. నీవు గుర్తించనంత మాత్రము దానికి తరిగి పోయేదిలేదు. దాని కార్యము ఎలాగూ సిద్ధించనే సిద్ధిస్తుంది. కానీ నీవు గుర్తించకపోతే తత్ప్రయోజన వంచితుడవయ్యేది నీవే సుమా! ఆ శక్తిపద ఘట్టనక్రింద నలిగిపోనుకూడా వచ్చు!" కాన ఆమెశక్తి మనలో పనిచేస్తూ ఉన్నట్లు లవలేశమైనా గుర్తించి. ఆ శక్తి వ్యాపారానికి అవకాశమివ్వడం ఎంత

అవసరమో ! మనలోనున్న మసకతగ్గి, ఆ గుర్తింపు మనకు అమ్మ అనుగ్రహముచేత కలుగుగాక !

1971 జూలై 'మదర్ ఇండియా'లో అమ్మ ఇలా చెప్పిరి. "భగవత్ప్రాప్తికొరకే ఆరోవిల్‌కు రావాలి, తమ అవసరాలను పూరించుకోడానికికాదు! ముందుకు చూడు! పైకిచూడు! పశు స్వభావమును అధిగమించడానికి ప్రయత్నించు. అందుకొరకు దృఢ నిశ్చయము గావించుకో! అప్పుడు మార్గములో నీకు సహాయమందుతున్నదని నీవు గుర్తించ గలవు!"— ఇట్లు గుర్తించడానికి మార్గముకూడ అమ్మే చూపారు.

మన ప్రస్తుత స్థితిని సాధ్యమైనంతవరకు సరిగా అంచనావేసుకొని తెలియనిదేదో తెలిసికోవాలి. ముందు, సాధకులు అనేకులు ఇక్కడ భ్రమ పడడము కద్దు. వారు తమను గురించి ఏదో ఎక్కువగా అంచనా వేసుకుంటారు. పరిశీలించి మన అంతఃకరణను గుర్తించుతూ ఉంటే, క్రమముగా స్వధర్మమేదో మనకు తెలియవస్తుంది: అప్పుడు దాని ననుసరించి ముందుకు పోగలుగుతాము. ఇది భయరహితము. సహజ సులభమూ అయిన ప్రగతి అవుతుంది. ఉన్నది ఉన్నట్లు వ్రాయగల శక్తి చెప్పగల సాహసము ఆధ్యాత్మిక పథములో భగవంతునికి ప్రీతి పాత్రములగును. అదే మధురమైన హృదయమనిపిస్తుంది !

ఇపుడు పెక్కుమంది తమను తాము భగవానుడు అనుకునే వారున్నారు! అలా చలామణికూడ అవుతున్నారు. గ్రీసు దేశపు వేదాంతి, సోక్రటీసును ఒకసారి అడిగారు. "సర్వోత్తమ జ్ఞాని అని మీకు లోకములో ఎందుకు ప్రఖ్యాతి ఉన్నది?" అపుడు ఆయనిలా సమాధానించారు—

"నాకు తెలియదని నాకు తెలుసు. తక్కినవారికి తెలియదని తెలియదు. తెలియదనే తెలివి నాకు ఉన్నది గనుకనే ఆ ఖ్యాతి లభించి

ఉంటుంది." దీనిలోని భావమేమంటే, తెలియదని అనుకోబట్టే నేను ముందుకు వెళ్ళగలుగుతున్నాను అని.

తమకు తెలుసును అనుకోవడం చేతనే, పలువురు పండితులు, స్వాములుకూడ శ్రీ అరవిందుని అద్భుత వైశిష్ట్యమును గ్రహించలేక పోతున్నారు. ఎందరెందరో సంవత్సరాలకొలది 'గీతా' అధ్యయనము, శ్రవణము సాగించుతారు. చివరకు ఆ శుష్క ప్రయాసతో తృప్తి పొంద లేక పోతారు.

ఆ రోజులలో ఒక మహానాయకుడెవరో— "గీతలో విశ్వరూప మును వర్ణించిన వ్యాసునికి మతి భ్రమణమైనా కలిగి ఉండాలి, లేక, అది వంచనా శిల్పమైనా అయి ఉండాలి!" అని దూషించాడట. దాని మీద ఒక వ్యాసములో శ్రీ అరవిందులు— "వ్యాసునికి తలకాయ లేకపోవడం కాదు. నీకే (నాయకునికే) ఆ తలకాయలేదు. నేను విశ్వరూపమును స్వయంగా, అసందిగ్ధంగా చూచాను— పురుషరూపంగా మాత్రమేగాదు, స్త్రీ రూపంగాకూడ." అని ఉద్ఘాటించారు. "ఓహో! ఈ మహనీయు డెంతటివాడు!" అని నేను ముగ్ధుడనై పోయాను. విశ్వరూపము అర్జునునికి మాత్రమే తాను చూపించినట్లు శ్రీకృష్ణుడు సెలవిచ్చాడుగదా! శ్రీమాతా రవిందుల ఘనతను మెరుపువలె స్ఫురింపజేయు మరికొన్ని సంఘట నలు తరువాత ముచ్చటించెదను.

ఆ ఘనత మనలో ప్రవేశించాలంటే, 'తెలియదు, తెలుసుకోవాలి!' అనే వైఖరి ననుసరించి హృదయమును తెరచిపెట్టాలి.

శ్రీ అరవిందులు గతానికి చెందడు, చరిత్రకందడు, తన సంసిద్ధి మార్గమున పురోగమించుతూన్న పరమ సత్యమే శ్రీ అరవిందుడు! అందు చేత మార్గమున వెనుకబడి భ్రష్టులము కాగోరమేని (శ్రీ అరవిందుని అనుసరింపదలంతుమేని), త్వరితగతిని పురోగమించడానికి కావలసిన

నిత్యనూతన యౌవనమును మనయందు పొందిగి పోషించుకోవాలి." అని శ్రీతల్లిగారు తెలిపిరి.

గమనిక :— చరిత్ర మన కందించిన చరమ ఫలమే శ్రీ అరవిందులు. అని చారిత్రక విమర్శకులు కొందరు ఒక నిర్ణయానికి వచ్చారు. ఇందులో శ్రీ అరవిందుని కీర్తిగానమే మనకంటబడుతుంది. కాని అమ్మ ఏమన్నారో చూడండి—

"అది (చారిత్రకుల సిద్ధాంతము) సత్యదూరము, కేవలం సత్యము. శ్రీ అరవిందుడు చరిత్రకు వెలుపల, చరిత్రకందని స్థానములో ఉన్నాడు." అని మనకు కీర్తిగానంగా కన్పించే పై నిర్ణయమును పూర్తిగా ఖండించింది అమ్మ. అయితే శ్రీ అరవిందుడు ప్రతిబింబించే, చరిత్ర ఎరుగని పరమ సత్యమేది? భౌతిక శరీరంలోనే భాగవత జీవితము— (Divine Life): ఇదే శ్రీ అరవిందునియందు ఆకృతి ధరించిన అపూర్వ సత్యము.

ది 15—8—70 వ తేది నిచ్చిన సందేశము : "శరీరము కూడ భగవంతుని స్మరించును" అని శ్రీతల్లిగారు బహిర్గతము చేసేవరకు మన కంతుపట్టదు. దీనిని అమ్మద్వారా మనము విని ఆకలించుకున్నప్పుడు— 'అపూర్వము. అపూర్వము!' అనే ఆశ్చర్యము మనలనావహించుతుంది. (అమ్మ చెప్పిన దానిలో ఒక అంశమును మాత్రమే చెప్తున్నాను, సంగ్రహించి)—

"నేను చెప్పదలంచినదిదే. ఇక్కడ 'నీకు' స్థానంలేదు. నీవులేవు. 'వేచిఉండాలి' అనేదిలేదు 'కాలక్రమేణా లభించుతుందిలే, అనేదిలేదు. ఇవి చాల సమంజసముగా కన్పించినప్పటికీ వీటికాలము చెల్లిపోయింది. ఉన్నదంతా అదే! అది ఖడ్గమువలే దిగుతోంది' (ఖడ్గమువలే పట్టిన తన పిడికిటిని అమ్మ క్రిందికిలాగింది) ఏది ఎదురైనా బాధలేదు. అదే విజృం

బించుతోంది; అదే, భగవంతుడే! (అమ్మ బిగబట్టి పైకెత్తిన ఒక వ్రేలితో చూపుతూ) ఈ వైమనస్యాలు (Badwill) ఈ విప్లవాలు (Revolts)— ఈ చెత్తంతా తుడిచివేయబడాలి. అది (భగవంతుడు) మనకు మరణాంతక మవునని చెప్పేది అహంకారము మాత్రమే !— ఘనత వహించిన అహంకారస్వామి మాత్రమే (Sirego). ఈ అహంకారము తానే యదార్థ సత్తాగా పరిగణింప బడాలని తంటాలు పడుతోంది. పాపం !

"కాని మేనుకు తెలిసిపోయింది— 'నేను' లేకుండానే తాను మన గలనని, ఏలనంటే, భగవదిచ్ఛ చేతనే మేను మేనుగా ఉన్నది కాని నేను (అహంకారము) చేతకాదు. ఆ మాటకువస్తే అందరమూ (సత్తలోని అన్ని భాగాలు) భగవదిచ్ఛ చేతనే ఉన్నాము, అహంకారము చేతకాదు సుమా! ఔను, అహంకారము ఒక సాధనమే (ఉపకరణమే) బహు శతాబ్ది పర్యంతమూ ఒకసాధనమే,కాని ఇప్పుడుకాదు. ఇకదాని ఉపయోగం లేదు.దాని రోజులు గతించాయి. (అమ్మ తనపిడికిటిని క్రిందికి దించుతూ) ఇప్పుడు.... (పనిచేస్తూన్న) చేతన: ఇది భగవంతుడే; శక్తి: ఇది భగవంతుడే: క్రియ: ఇది భగవంతుడే; వ్యక్తిత్వం: ఇది భగవంతుడే; అమ్మ తనువునకు కలిగిన అపూర్వానుభవము నూతనయుగ ప్రవర్తకమని చెప్పాలి! కారణం, ఇక అహంకారముయొక్క అవసరంలేదు; అహంకారానికి తావేలేదు. శరీరం దైవమై సరాసరి దైవముతోనే, దైవేచ్ఛనను సరించియే ప్రవర్తిస్తుంది.

అమ్మ దేహానికి ఆ అవగాహన కలిగింది, క్రమంగా అక్కడి నుంచి అది మనకుకూడ సంక్రమిస్తుంది. అమ్మ ఆ పాలను మనకు యిస్తుంది !

మన కిపుడు బ్రహ్మాండమైన విజయము ప్రాప్తించుచున్నది. ఎక్కడో ఆకాశములోగాక, ఇక్కడే ఆ విజయముయొక్క— అద్భుత

విజయముయొక్క— సంభావ్యత స్ఫురించుతోంది. అమ్మ శరీరానికి అవగాహన కలిగింది. అహంకారముతో ఇక పనిలేదు. చేతన భగవంతుడు, శక్తి భగవంతుడు, క్రియ భగవంతుడు, ప్రజల వైమనస్యాలు, వక్రతలు, వైరుధ్యాలు— కార్చిచ్చువలే దిగుతున్న భగవచ్ఛక్తి ఈ చెత్తను కాల్చివేస్తుంది! 'అని అమ్మ మనకు స్ఫురింపచేస్తోంది.' వైరుధ్యంలేదు. లోపలే సత్యము ననుసరించుతూ, లోపలే సత్యవాహినులమైతే, లోపలే సత్యమే కాగలుగుతాము. అమ్మ అనుగ్రహంచేత అట్లే అగుదుముగాక! అమ్మకు ప్రణామాలు. 3—9—71

# ప్రశ్నలు - సమాధానము

1938 లో శ్రీ అరవిందులు తన గదిలో పడిపోయినపుడు కాలు విరిగింది. అప్పటినుండి కొంతమంది (విశిష్టవ్యక్తులు) వారి పరిచర్యకు వినియుక్తులైనారు. వారితో జరిగిన సంభాషణలు పరంపరగా మదరిండియా—లో వెలువడుతున్నాయి. 30—11—1939 నాడు జరిగిన సంభాషణలో ఒక భాగం——

పి (పురాణి):- దర్శన సమయంలో మీ (శ్రీ అరవిందుని) సన్నిధిని అనుభవించినట్లే తన గృహములోకూడ అనుభవించే ఒక ఆమె వున్నది. కాని క్రిందటిసారి ఆమె ఇక్కడినుంచి తిరిగివెళ్ళేదారిలో రమణమహర్షిని దర్శించింది. అంతే! ఆమెకు పూర్వపు సన్నిధి భావము సనుసిపోయింది!

శ్రీ అరవిందులు :— అది సహజమే (అలా ఎందుకు కాదు)

పి :- అయితే ఆదిలో ఆమెకు దాని కారణం అంతుబట్టలేదు. తరువాత ఆమెకు దారిలో మహర్షిని దర్శించడము చేతనేమో!— అనే అనుమానం తగిలింది. దానికి తోడు నేను కూడ — అన్నింటినీ కలగలపడం అమ్మకు ఆమోదము కాదు—అని చెప్పాను. యిప్పుడిక ఆ దుష్ఫలితానికి ఆదర్శనమే కారణమై ఉండాలని అనుకొంటోంది, ఆమె.

శ్రీ అరవిందులు :— అక్కడి ప్రభావము (Influence) వేరు. పైగా, అక్కడ మహర్షి ఒక్కరుమాత్రమే ఉంటే, ఆ ఫలితము మరొక విధముగా ఉండును. కాని ఆయన చుట్టూ ఇతరు లున్నారుకదా!

యన్ (నీరద్ బరన్) :— వెళ్ళిన ఉద్దేశ్యమొకటే కదా — ఆధ్యాత్మికాన్వేషణం—ఆదర్శనం కూడ ఆ మార్గమునకు సంబంధించినదే కదా!

శ్రీ అరవిందులు :— అది కాదు ప్రస్తుత విషయము (కొంత తడవాగి) పి. లేలేనుంచి ఏదో పొందారు. (లేలే బహుశః శ్రీ అరవిందుని ప్రథమ గురువు)

పి:— ..........ఔనౌను, దాని కటు ఫలితము నాకు గుర్తే వుంది! నేను మిల మిల మెరిసే ఆరోగ్యంతో వెళ్ళాను; దడదడ లాడించే జ్వరముతో తిరిగి వచ్చాను. మరొక యోగితోనాకు సంఘటించిన సమావేశం వాంతులు, వికారము ప్రసాదించింది. అంతేగాని మరేమీ పొందలేదు వారినుండి. శ్రీ అరవిందులు (చిరు నగవుతో): చివరకు ఏదో మీకు ఇచ్చే పంపారుగదా, లేలే మహాశయుడు!

పి :- కాని మరెప్పుడూ ఆ మహాశయునినేను సమీపించలేదు.

పి :- మరొక స్నేహితుడు ఇక్కడకు వచ్చిన పిమ్మట (మిమ్మ దర్శించిన పిమ్మట) "ఒకానొక యోగిని చూడాలని వుంది. వెళ్ళనా ?" అని నా సలహా అడిగారు. కూడదని నేను స్పష్టీకరించి చెప్పాను.

దాని కాయన సమాధానం : "అందులో అపకారమేముంటుంది ? ఒకే ఆత్మతత్వము గదా!" అప్పుడు "కావచ్చును, కాని వేరు వేరు ఆత్మ శక్తులున్నాయి. ఒక దానిని ఒకటి ప్రతిఘటించవచ్చు." అని ఆయనకు తెలియజెప్పాను.

శ్రీ అరవిందులు :— అది సరియైన వివరణ (Quite so)

పి :— కాని ఆ వ్యక్తి నేను చెప్పినది నమ్మలేదు. ఫలితం ? ఈ 5 సంవత్సరాలు శిక్షననుభవించాడు. ఇప్పుడు కూడ ఆయన ఇక్కడకు వచ్చే అవకాశం లేదు.

పై వివరమును బట్టి — ఇతరులు ఒకవేళ ఉత్తములే అయినా, వారి చేతనా శక్తులువేరు గనుక ఉపకారముకంటే అపకారమే సంభవించవచ్చు, సంమిశ్రణము వలన, మరొక నాటి సంభాషణలో రమణమహర్షి ప్రసక్తి మళ్ళీ వచ్చింది. సంభాషణలలో వారివలన న్యూనత కలిగించే విషయమేమైనా వుంటే, వారి పూర్తిపేరు చెప్పక, పొడి అక్షరాలు మాత్రమే ఉపయోగించారు. రికార్డు చేసిన నీరద్‌బరన్, చెప్పబోయేదానిలో పి. బి ! అంటే పాల్ బ్రింటన్, ఇంగ్లాండునుంచి వచ్చి, యోగులకొరకు దేశమును గాలించి, సాధనచేసి, గ్రంధాలు వ్రాసి, పేరు కెక్కిన ఒక పత్రికా సంపాదకు డాయన. తాను యోగముయొక్క లోతుల నన్నింటినీ తరచి చూచాననీ....ఇంకా....ఏవేవో వ్రాశారు. గ్రంథాల్లో, పత్రికలలో, వీటి అన్నింటిపైనా కొంత సంభాషణ సాగిన తరువాత శ్రీ అరవిందులు ఇలా అన్నారు—

శ్రీ అరవిందులు : .......... అయితేనేమి, ఆయన (పి. బి.) యోగముపట్ల కొంత నిజమైన ఆసక్తి— అన్వేషణాపరమైన ఆసక్తి—కలవాడు. ఆ యీ జనుల సంపర్కమువలన అది దెబ్బతిన్నది. స్వవిష

యము సమస్తమూ ఒక్క మహర్షికే (రమణ మహర్షి) వదిలివేసి ఉండవలసినది.........

ఈ ఉదంతము ఒకరినె ఆశ్రయించడం సాధకులకు మరింత అవసరమని సూచిస్తోంది. పైగా రమణమహర్షి పట్ల శ్రీ అరవిందునికి హీన భావములేదనికూడ తెలుపుతోంది. ఈ సందర్భములో మనమిది గమనించవచ్చు; దిలీప్‌కుమార్ రాయ్ వేసిన ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ — "రమణుడు యోగులలో భీముడు" అని అన్నారు శ్రీ అరవిందులు. కాని మరొకసారి "అది మహర్షి యోగములే!" అని కూడ అనకపోలేదు.

ఈ పుస్తకములో ముందే ఒక సందర్భములో వ్రాయడం జరిగింది—మాతృశ్రీ క్రిస్‌మస్‌నాడు చర్చికి వెళ్ళడానికి అనుమతిని అర్థించిన ఒక పిల్లవాడిని ఎలా మందలించారో, ఎందుకు మందలించారో ఈ క్రింది శ్రీ అరవిందుని మాటలలో మనకు విశదము కాగలదు :

"..........వందలాది సాంప్రదాయాలను భంగించడానికి జాతి సంసిద్ధము కావాలి; ప్రచలితమైన వాస్తవాలలో (Facts) అత్యధికాంశమును కొట్టివేయడానికి నడుము కట్టాలి : అప్పుడే ప్రపంచములో మహా పరివర్తనము సాధ్యపడగలదు."

ఇదీ కారణం. చర్చికి వెళితే సాంప్రదాయ భావాలేమనకు బలపడతాయి. అలాగే ఇప్పటి వాస్తవాలే వాస్తవాలు—అనే భావము బలపడి అధికతర వాస్తవాల పట్ల విశ్వాసమును సడలింప చేస్తాయి. సూటిగా చెప్పాలంటే - మనసు స్వర్గం వైపుకో, పాక్షికముక్తి వైపుకో మరలుతుంది. శరీరం జడం — జాతస్య హిధ్రువో మృత్యుః — సంసారము అసారము - అనే ప్రచలిత వాస్తవాలే పరమసత్యాలని మనయందు బలపడతాయి, ఇతర శాఖలతో, సంప్రదాయలతో, మతాలతో, సంస్థలతో, ఆలయాలతో సంబంధము పెట్టుకుంటే, అంతే, కోతిలోనూ, రాతిలోనూ

కూడ ద్వైవము ఉన్న మాట తథ్యమే. కాని వికాస భేదము చేత వివిధ స్తరాలలో ఉంటుంది ఆద్వైవము. ప్రకృతి పరిణామము కొనసాగుచున్న కొలదీ నూతన సత్యము ఆవిష్కారానికి తోడ్పడేందుకు నూతన రూపము ధరించి వస్తుంది అద్వైవం. పూర్వ పూర్వ రూపముల కంటే ఉత్తరోత్తర రూపాలు విశిష్టతరములై ఉంటాయి. పైగా పూర్వరూపములోని విధానము నూతన రూపములోని విధానానికి అభ్యంతరముకూడ కావచ్చు.

మనకేదైనా సందేహము కలిగినపుడు, ఆ సందేహానికి సంబంధించి శ్రీమాతారవిందులు ఏమి ప్రవచించారో, ఏమి ప్రబోధించారో, ఏమిచేసి ప్రదర్శించారో—దానిని ఉన్నది ఉన్నట్లు తెలుసుకోవాలి; మనం అలాచేసి ఉండకపోవచ్చు. నామట్టుకు నేను అలా చేయలేదని నాకు తెలుసు. మనలో ఎన్నో లోపాలు ఉంటాయి. యెన్నో దౌర్బాల్యాలుకూడ ఆ కారణంగా వారు నుడివిన దానికి అన్యథా అర్థము కల్పించుకోరాదు.

అలాగే ఎవరైన ఆ యీ ప్రదేశాలు తిరిగి రాకుండా ఉండ జాలక పోతే, తిరిగి రానివ్వండి, కాని దానికి సమన్వయమనే పూతపూసి, సంతృప్తిపడ తగదు. సాధనలో లోతుకు వెళ్ళిన కొలది ఈ సత్యాలు మనకు తట్టక పోవును.

ఆరోవిల్‌కు సంబంధించి అమ్మ చెప్పిన సూత్రాలలో ఇవి రెండు "1. యెక్కడ భవిష్యత్తును గురించి మాత్రమే తలపోయడానికి అవకాశము లభించగలదో అదే ఇంతకాలానికి అంకురించిన ఈ ఆరోవిల్. 2. సామాజిక, రాజకీయ, ధార్మిక (మత సంబంధమైన) నిశ్చయాలను అతిక్రమించి, పరమ సత్యమును సేవించడంలోనే ఆరోవిల్ నిమగ్నమై ఉండాలి!" చూడండి; ఇక్కడ కూడ, పరమ సత్యమును సేవించాలంటే ప్రచలితమైన మతాతీతులము కావాలని అమ్మ ఎలా హెచ్చరించుతున్నారో!

మరొక నిగూఢ రహస్యము కూడ ఉన్నది. దిలీప్‌కుమార్‌రాయ్‌కి శ్రీ అరవిందులు తెలిపిన విషయం — "ఈ పరివర్తనము నేను సాధించవలసిన కార్యం. ఎవరూ ఇందులో తమ తల దూర్చకూడదు. అలా దూర్చారో, వినాశనమును కొని తెచ్చుకున్నట్లే!" (భావమిది) అంటే శ్రీ అరవిందుని కార్యము అనన్య సాధ్యము అని చెప్పినట్లే కదా. పైగా ప్రత్యేకమైన పిలుపు లభించకపోతే, యీ యోగానికి పూనుకోనేవద్దని మరొకచోట హెచ్చరించారు. కారణం, అది అపాయకరం కావచ్చు.

ఆశ్రమములోని అందరూ ఇంతటి సమున్నత అధికారము కల వారా ?—అంటే, అది వేరే విషయం. సత్యము మాత్రము అది. సత్యానికి ఎంత సన్నిహితముగా జరిగితే అంత శ్రేయస్కరము, మన బలహీనతలను పరికించే అమ్మ ఇలా కూడ సందు ఇచ్చారు— "అరోవిల్లో వుండి కూడ నే మతమును విడనాడుకోలేకపోతే, సరే (అడ్డురాని విధముగా) దానిని పాటించుకో, అరోవిల్‌లోనికి వచ్చికూడ వివాహ సంబంధమును విడనాడుకోలేకపోతే, సరే అలాగే వుండు — సాధ్యమైనంత నిస్సంగతను అవలంభించింది.

## అమ్మ వచనామృతము

సెప్టెంబరు 71—'మదర్ ఇండియా' నుంచి :

1. దైవానికి తమ జీవితములను పవిత్ర భావముతో అంకితము చేయదలంచుకున్న వారికే ఈ ఆశ్రమము ఉద్దేశింపబడినది. జూన్ 1971.

2. ఇక ఎల్లయ్య (x ఎక్స్ = ఫలాని వ్యక్తి) చేసిన తీర్పునకు ప్రమాణ మేమిటో ? అతడు దైవ మయ్యాడా ? ప్రతివాని నిజమైనవి వ ఒక్క దేవునికి మాత్రమే విధితము. జూలై 25, 1971.

3. హింసా చర్యలను నేనెంత మాత్రము ఆమోదించను. ప్రతి హింసాచర్య మనమాకాంక్షించే గమ్య పథములో మనం వేసే ఒక వెను కడుగు మాత్రమే. దైవము ఎల్లెడలాఉన్నది. ఎప్పుడునూ వేయికండ్లతో గమనిస్తూ వున్నది. అందుచేత దేనిని నీవు దైవ సమక్షములో చేయ లేవో, దానిని-అది ఎంత చిన్నదైనా-నీవు ఎప్పుడునూ చేయువలదు.

మే. 6, 1971.

ఈ క్రింది వచనము ఆగస్టు 71 — బుల్లెటిన్ లోనిది.

దివ్య ప్రేమకు, సత్యప్రేమకు తనయందే సమ్మోదము, సంతృప్తి లభించును; దాని నెవరూ స్వీకరించి, సన్మానించ నవసరములేదు. ఎవరూ పంచుకోనవసరం లేదు — పుష్పము వికసించడానికే వికసించినట్లు, దివ్య ప్రేమ కూడ ప్రేమించడానికే ప్రేమించును.

లోలోపల ఈ ప్రేమానుభవము పొందడమంటే, అక్షరానందానికి **అధిపతి** గావడమే.

— మాతృశ్రీ.

21—6—1971

# ఆంతరంగిక సంపర్కము

శ్రీ అరవిందుడు ఇలా అంటారు. "అన్ని వేళలా అమ్మ నిన్ను చూస్తూ ఉన్నట్లే వర్తించుము. నిజానికి అమ్మ నిన్ను అలా చూస్తూనే ఉన్నది!"

గమనిక :— సత్సాంగత్యం అంటే ముఖ్యంగా హృదయ సాంగత్యమనే నేను భావింతును. హృదయ సాంగత్యమంటే ఆంతరంగిక సంపర్కమే. ఇట్టి సంపర్కమును మనము తల్లిగారితో ఏర్పరచుకొంటే ధన్యులమే! మాతృశ్రీ మనలను సదా కనిపెట్టి పాలించుతూనేఉన్నారు. నడుపుతూనే ఉన్నారనే స్మృతిని పనిచేస్తూన్నప్పుడు కూడ నిలబెట్టుకోడానికి ప్రయత్నించితే—అది ఆంతరంగిక సంపర్కమునకు దారితీస్తుంది.

ఈ ప్రయత్నములో చేతన ద్విధా విభజింపబడి· బాహ్య భాగము. పనితో ఉన్నప్పటికీ, ఆంతర భాగము అమ్మమీద అధికాధికముగా నిలిచి వుంటుంది. క్రమముగా అమ్మే మన కార్యమును చేస్తూన్నారనేది కూడ తెలియవస్తుంది. ఇది కర్మ విముక్తి, ఈ దశనుంచి కర్మ, ఆనందమయముగాకూడ పరిణమిస్తుంది. అప్పుడు మనము తల్లి చేతిలో పిల్లలమగుదుము. శ్రీ అరవిందులు ఇట్టి తల్లి స్మృతికి అత్యంత ప్రాధాన్యమిస్తారు. చేతనావిభాగమును కూడ నొక్కి చెపుతారు.

తల్లిగారు కంటిముందేకాదు. కంటికి వెనుక కన్నైన హృదయంలో కూడ ఉన్నారు. ఈ హృదయస్థమైన తల్లిని దర్శించడమే అన్నింటిని మించిన దర్శనము——అణువులో శక్తిని దర్శించడం కంటే విశిష్ట దర్శనము! ఆమె అందరి హృదయాలను అధివసించి ఉన్నది గనుకనే అన్ని వేళలా మనలను చూస్తున్నారు. ఒక నూతన చేతన భూమిపై అవతరించి ఉద్ధృతంగా పని చేస్తున్నదని అమ్మే అనేకసార్లు వివరించారు. ఈ చేతన స్వేచ్ఛగా పనిచేయాలంటే మేమేమి చేయాలి ?—అని ఒకరు ప్రశ్నించగా,

1. చేతులుసాచి స్వీకరించుస్థితిలో నుండుము(Be receptive)మరియూ, 2. విధేయ మృదుత్వమును గలిగి ఉండుము (Be plastic)అని అమ్మ చెప్పారు. ఆ చేతన మనలో ప్రవేశించడానికి స్వీకార ప్రవణత, ప్రవేశించి మనలను సునాయాసంగా మలచి మార్చడానికి మృదుత ఈ గుణములు పిల్లలలో ఎక్కువ సహజముగావుంటాయి. తల్లిగారిపట్ల కూడ మనము సదా పై రెండు ధర్మాలు కలిగివుండాలి. ఈ చేతన (ఇది కూడ అమ్మ చేతనే) శరీరజీవాణువులకు తమయందున్న భగవంతుని జ్ఞప్తిని కలిగించు చున్నదనీ, అందుచేత అవి భగవత్ప్రభావానికి ఉన్మీలితమై (తెరచుకొని) ఆ ప్రభావముచేతనే నడపబడడం నేర్చుకుంటున్నాయనీ నడపబడుతున్నా యనీ అమ్మ తెలియపర్చారు. అంటే భౌతిక చేతనకుండే యంత్రప్రాయ త్వమును విడనాడి చేతనా పరిప్లుతమై అమరత్వము వైపు (శరీరామర త్వము) సాగిపోతున్నాయి !

ఇప్పటి "మదర్ ఇండియా" 1971 ఏప్రియల్‌లో కాబోలు అమల్ కిరణ్ (కె. డి. సేథ్నా) ఇలా అన్నారు. ఒకప్పుడు శ్రీ తల్లిగారికి వారు వ్రాసిన వాక్యాల నుదాహరించుతూ, "నాలో వేయి దోషాలు విజృంభించి వుండవచ్చు. కాని, మీరు నా తల్లి అనే భావం మాత్రం నన్ను విడిచి పెట్టడంలేదు. నేను మీ హృదయం నుంచి పుట్టాను. ఈ సుదీర్ఘ కాల ములో నేను పొందిన సత్యానుభవ మిదొక్కటే. ఇతరానుభూతులు లేక పోయినా, ఈ అనుభూతిని కలిగించినందుకు ధన్యవాదాలర్పించుతున్నాను." దీని మీద శ్రీ అరవిందులు ఇలా వ్రాశారట. (17-9-1934) : "మీరు పొందిన భవ్యానుభవం సర్వానుభవాలకు ప్రాతిపదిక. తత్ఫలితములే—అను భవాంతరాలు" శ్రీ అరవిందులు వ్రాసిన లేఖ అడుగు భాగానే అమ్మ అదనముగా ఇలా వ్రాశారట : "నా ఆశీస్సులు ఎప్పుడూ నీతోఉంటాయి!"

అమ్మయందు మాతృభావం పరినిష్ఠితమైనవారికి, అమ్మ ఆశీస్సులు వెంటనుండి రక్షిస్తున్నవారికి ఆపద లేముంటాయి. అధిగమించ రానిదే ముంటుంది ?

శ్రీ తల్లిగారు ఒకప్పుడన్న రహస్య వచనం (ఇప్పటి సంచిక లోనే) "ఈ ప్రపంచములో ఒక్క వ్యక్తి—పరివర్తనము చెందని ఒక్క వ్యక్తి - ఉన్నంతవరకు నా పని పూర్తికాదు!" అని దివ్యమాతే ఈ విధముగా దీక్ష వహించిరి.

కాని ఇచ్చట అమ్మ లోపములేదు. మన లోపమే. ఆవగింజంత అవకాశము (Opening) కనిపించితే మనలో పరుగిడి ప్రవేశించడానికి **అమ్మ ప్రేమ శక్తులు ఆత్రముతో ఉంటాయి!** ఇప్పటి మన దశలో సూచనా ప్రాయముగా ఈ సత్యమును మనము చూడవచ్చును. అయినా పూర్తిగా గ్రహించలేము గనుక ఈసూచనను పురస్కరించుకొని పూర్తిగా **విశ్వసించాలి.** అందుచేతనే 'నా మాట నమ్ముము' అని అమ్మ అవధరించి చెప్పారు.

దీనినిబట్టి చూస్తే 'ఉన్మీలనము' (వివృతి Opening) పూర్ణ యోగంలో ఒక కీలకాంశమని తెలిపోయింది. మాతృశ్రీ శరీర ధారణా ఫలితంగా ఇప్పుడు భూవాతావరణంలో అపూర్వ దివ్యశక్తులు అవిరతంగా, అవిరళంగా పనిచేస్తున్నాయి. మనం చేయవలసినదంతా ఉన్మీలనము, సమగ్రోన్మీలనము, సంతతోన్మీలనము!

"మనకేది కావాలో మనకంటే మాతకే ఎక్కువ తెలుసు. అందుచేత మాతకు పక్షపాత దోషము ఆరోపించి, 'అతనికి ఏదో, ఏదో చేస్తున్నారు మాత. నాకు చేయడంలేదు' అని సాధకులు మనోవికారములకు లోను కాగూడదు. ఎవరి స్వభావానికేది కావాలో వారికది మాత ప్రసాదించును." అని శ్రీ అరవిందుడు తమలేఖలలో సాధకులకు అనేకసారులు హెచ్చరించారు.

మాతృశ్రీ అనుగ్రహ భరితమైన ప్రసాదము (పుష్పములు, పుష్పముల ప్యాకెట్లు) మనకు లభించుచున్నందుకు కృతజ్ఞత తెల్పుకుంటు

న్నాము. ఆ ప్రసాదములోని పవిత్రశక్తిని అధికాధికముగా మనము స్వీకరించగలుగుదుముగాక! ఈ విషయములో శ్రీ తల్లిగారి ఔదార్యము అపారము. మనయందున్న వికారములే ఆ ఔదార్య ప్రక్రియకు అడ్డు వస్తాయి. ఒకసారి (29-1-1964) శక్తిని గ్రహించే విషయంలో మన మెలా వంచితులమగుచున్నామో— ఇలా వివరించారు: అమ్మ!

"నీవు స్వీకరించినదానితో తృప్తిపడు. ఏలనంటే, నీవు స్వీకరించే శక్తి ప్రమాణము నీ స్వీకారయోగ్యతపై ఆధారపడిఉంటుంది. నామాటను పూర్తిగా విశ్వసించుము: జనులు స్వీకరించగలిగిన దానికంటే నేనెప్పుడూ ఎక్కువగానే యిత్తును....కాని మనస్సు తన అజ్ఞాన జనితమైన కోరికలచే జోక్యము కలిగించుకొని, ఈ శక్తి సంచార ప్రక్రియనంతనూ పాడు జేసివేస్తుంది!" అమ్మే మరి ఒకానొక సందర్భములో 'నా ఆశీస్సులు మీ కోరికల ననుసరించిగాదు, మీ ఆధ్యాత్మిక శ్రేయస్సు ననుసరించి' అని స్పష్టపరిచారు. అందుచేత మనస్సు తన కోరికలతో ముందుకువస్తే, అనుగ్రహము అవకాశము లేక ఆగిపోవలసి వస్తుంది.

తానిచ్చిన ప్రసాదముద్వారా సాధకుడు, భక్తుడు తనతో సంపర్కము పెట్టుకోవచ్చును — అని అమ్మ మరొకసారి సూచించారు. ఆ సంపర్కముద్వారా సాధకుడు తన సమస్యలను అమ్మకు నివేదించుకొని వాటి పరిష్కారమునుకూడ (లేక పరిష్కార విధానమునుకూడ) పొందవచ్చునని అమ్మ తెలిపారు. అంటే, సారాంశముగా 'అమ్మ ప్రసాదములో అమ్మ ఉంటారు'—అని.

అమ్మ ఎంత పెద్దదైనా, అమ్మదగ్గర మనకు చిన్నతనముండదు. అమ్మ అంశమే మనము కాబట్టి అమ్మే మనము.

అస్తు! అట్టి దివ్యజననికి ప్రణామాలు.

# నూతన జీవితము

మాతృశ్రీ ఈ క్రింది అనుభవ వాక్యమును గమనించండి:

"ఏది జరుగనున్నదో, ఏది ప్రజలు నాకు చెప్పనున్నారో, అది ముందుగానే నాకు తెలియ నారంభించింది—అది అంతా కూడ.... ఎలా ఇది జరుగుతోంచని వివరించను?....పరిస్థితులూ, ప్రజలూ, మాటలూ,.... అన్నీ నేనే అయ్యానని పిస్తోంది!"

ఇది పూర్ణజీవిత లక్షణమూ, స్వరూపముకూడాను. తన ఈ పూర్ణ జీవితమును అమ్మ తన బిడ్డలమైన మనకు అందించుగాక! ఆ విధముగా మనము చరితార్థులమై, అమ్మ కార్యము సఫలమగు గాక!

మాతృశ్రీ శరీర పరివర్తనానికి ఒక క్రొత్త మలుపునిచ్చిన ఏ దివ్య సంఘటన తమ జన్మదినము, 21—2—1972నాడు సంభవించిందో దానిని గురించి తెలుసుకుందాము. ఆ అనుభూతిని అమ్మ ఇలా వ్రాసి పెట్టారు :

"21 ఫిబ్రవరినాడు దినమంతా, అది ప్రతి ఒకరి జన్మదినముననే బలీయమగు అనుభవము నాలో రాజ్యమేలింది. తత్ప్రేరితనై ప్రతివారికి 'మీకు జన్మదిన శుభాకాంక్షలు' అని చెప్పడం కూడ జరిగింది."

"ఏదో ఒక వినూత్న వస్తువు ప్రపంచమునందు అభివ్యక్తమయినది— అనే మిక్కిలి బలీయమగు అనుభవమది. ఎవరు సంసిద్ధులై ఉన్నారో, ఎవరు గ్రహణ శీలురుకూడనై ఉన్నారో వారు దీనిని తమయందు మూర్తీభవింప జేసుకోగలరు, సందేహములేదు. కొద్ది రోజులలోనే దాని స్వరూప స్వభావాలు తెలిసిపోతాయి."

గమనిక :— ఆధ్యాత్మిక చరిత్రలో ఇదిఒక అపూర్వమైనసమయం. అట్టడుగుననున్న భౌతిక పరివర్తనానికి — భౌతిక పరివర్తనానికి కూడ— నిర్దేశింపబడినసమయమిది. ఈ దైహిక పరివర్తనము అతి మానసికశక్తికి

తప్పతదితరానికి సాధ్యముకాదు. ఇక అతిమానసముకూడ భౌతకజగత్తులో స్థిరపడితేనే తప్ప తన కార్యకలాపమును అక్కడ కొనసాగించజాలదు. అలా నిలద్రొక్కుకుని స్థిరపడాలంటే—

"దైహిక మనస్సులో అతిమానసము అభివ్యక్తమైనపుడే, దాని సన్నిధి (బాహ్యాజగత్తులో) స్థిరపడగలదు."

[29—2—72 మాతృశ్రీ ఇచ్చిన సందేశము.]

మానసిక మనస్సు, ప్రాణికమనస్సు— వీనిలో అతిమానసము ఆవిర్భవించడమే ఎంతో కష్టము. అయినపుడు ఈ శరీరగత మనోవిషయములో అది మరెంత కష్టమో!

ఇపుడు అమ్మచూపిన మార్గమును ఈ విధముగా మనము సూచించుకోవచ్చు.

1. అతి మానసము ద్వారానే దేహ పరివర్తన సాధ్యము.
2. అతి మానసము దేహములో పనిచేయడానికిముందు అది దేహములో, భౌతిక జగత్తులో స్థిరపడాలి.
3. అలా స్థిరపడాలంటే, దైహిక మనస్సునందు అది అభివ్యక్తము కావాలి.
4. దీనికి దైహిక మనస్సు సదా భగదభిముఖమై మనగలగాలి.
5. ఇది స్వాభావికముగా జరగాలంటే, దైహిక మనస్సును అంతరాత్మలో ఏకీకరించాలి.

ఇది కూడ మనము చేయలేకపోవచ్చు, మనశక్తితో, కాని త్రికరణ శుద్ధిగా మీరు కృషిచేస్తే, నేను సాయపడతానని అమ్మ ఆశ్వాసమిస్తున్నారు.

మనము దేనిని అహంఅని పిలుస్తామో అది జడసత్తయొక్క అహంకారమని శ్రీ తల్లిగారు చెప్పుచున్నారు. పైగా, భౌతికాహంకారము

అవచేతనలో పాదుకొనిపోయి, భౌతికామరత్వము సాధ్యమనే మాటే విశ్వసింపలేక పోతోంది. కావుననే దాని కాలము చెల్లిపోయినదని అమ్మ చెప్పివేయమన్నారు. (సమాప్తము.) అహంకారమే మన దౌర్బల్యమని అదే మూలానర్థమని తెలిసిపోయింది. భగవంతునినుండి వేరుపడి, తమలో తాము శరీరకణములు ముడుచుకుపోవడమే అహంకారము, అందుచేతనే భరించలేని అక్షమతవాటికి.

"అతిమానస శరీరముయొక్క నిర్మాణము: శరీరకణములుకూడ పాఠాలు నేర్చుకుంటున్నాయి. ఈ విధముగా జరుగవలసి ఉంటుందని శరీరము తెలుసుకున్నది: అది పూర్తిగా భగవత్ ప్రభావము క్రిందనే ఉండాలి— రాజీమాట రాగూడదు. 'దాదాపు' మాట రాగూడదు, 'జరుగుతుందులే' అనుకోరాదు. అది ఇలా ఉంటుంది. (అమ్మ దృఢతా సూచకముగా తన పిడికిటిని క్రిందికి లాగుతున్నారు) మహోద్ధృతమైన సంకల్పమది!

"సత్వర పురోగతికి అది ఒక్కటే మార్గము."

భగవంతుని అవతరించిన శక్తిని భరించడానికి భగవంతునితోనే అనుసంధానం. ముందు మనలోని దైవాంశముతో ఏకమై, పిమ్మట దైవముతో ఏకమైనపుడు, అల్పమగు దైహిక మనస్సుకూడ స్థిరతను, బలమును సంతరించుకుంటుంది. మనకు ధైర్యము చెప్పుతున్న సారాంశం ఇదే. భగవదనుసంధానం. భగవంతునితో నిజమగు రూపములో దానికి అనుసంధానం లభించితేనే తప్ప, అది ఎప్పటికీ ఆకాంక్ష సముత్సాహములలో స్థిరముగా నుండజాలదు.

శ్రీ మాతారవిందులూ ఆధ్యాత్మిక ప్రయోగశాలలో ఎలాంటి అపూర్వ ప్రయోగాలు చేశారో, చేస్తున్నారో ఆ విషయములు అంత విశదపరచి చెప్పగలవారు తెలుగు భాషలో యింతవరకు అనువాదాలు సరళంగా మనకు లభించకపోవడము, దురదృష్టమనుకుంటాను.

సత్యమును తెలిసికోవడంసరే, సత్యమును అనుష్ఠించుచూ జీవించి నప్పటికీ— అదికూడ పరిపూర్ణము కాజాలదు. ఏలనంటే దానికికూడ శరీరము రూపాంతరీకించే సామర్థ్యములేదు. మరొక విశేషమేమంటే, ప్రస్తుత ప్రయోగములో శరీరచేతనే భగవంతునితో ఏకమై ఉండడానికి ప్రయత్నించుతోంది! శరీరమే మాట్లాడుచున్నదని 1960లో శ్రీ తల్లిగారు నుడివియున్నారుగదా! ఇది అపూర్వము. పైగా ఈ ప్రయోగము పరిపూర్ణ మైనపుడు, భౌతిక సాక్షాత్కారానికి గల బలము మరి దేనికీ ఉండదని, అది మహామేరువువలే, భాగవత జీవితానికి అచలమూ, అవిచాల్యమూ అయిన పునాదిగా ఉండగలదని అమ్మ ఉద్ఘాటించుచుతోంది. ఏ తత్ ప్రయోగఫలితముగా నూతన జీవితోదయం కాబోతోందో ఇంచుక దాని ప్రస్తావన.

"ఇప్పుడు మనమున్న స్థితిలో భాషించకపోతే, ఆలోచించకపోతే, నిర్ణయించకపోతే—అది జీవితమే కాదని మన మనుకుంటాము. కాని ఈ జీవితమును విడిచివేసి, రెండవ జీవితములో అడుగిడినపుడు, అహో! అక్కడ ఊహాగానము అడుగంటా ఆగిపోతుంది; వివరించాలనీ ఇచ్ఛా ప్రవృత్తి; తర్కించి, సిద్ధాంతీకరించి క్రమబద్ధము చేయాలనే కామనావి శేషము—దీని కంతటికి స్వస్తి చెప్పబడుతుంది. సాధకుడు ఉండ జాలి నచో—ఉండ, కేవలమూ ఉండ జాలినచో; అదే కావలసినది. అక్కడ మౌనము రాజ్యమేలుతుంది. కాని మాటలు మానివేసినందువలన మనకు పరిచితమైన మౌనము కాదది. అది గంభీర విచారణకు సంబంధించిన మౌనము. అది క్రియాత్మకము. ఆ మౌనము సక్రియ సమాధి అవును, అది అంతే.

"నిశ్చయముగా సన్నాహదశలో ఇపుడు రూపొందుతున్న నూతన జీవిత విధాన మది. కనుకనే ఇప్పటి జీవితము దానికి స్థానమిచ్చి వైదొల గాలి!"

అక్కడ తెలిసికోడానికి ఆలోచించవలసిన అవసరముండదు. భావించవలసిన పని ఉండదు. మరి ఎలా తెలుస్తుంది ? తాదాత్మ్యముచేత ఇప్పట్టున తెలుస్తుంది. సత్యము ప్రపంచమును పాలించే శుభ ముహూర్తము అరుదెంచుతోంది. దాని ఆగమనమును త్వరితపరిచే కృషికి నీవు పూనుకుంటావా ? అని శ్రీ తల్లిగారు వెనుక సందేశ మిచ్చిరి.

మరియు శ్రీ తల్లిగారు 26—7—1971 సందేశములో ఈలా నుడివిరి. "భగవత్సంపర్కముచేత లభించిన స్వేచ్ఛయే నిజమైన స్వేచ్ఛ, ఇక అహంను పూర్తిగా అదుపులోపెట్టుకొన్నపుడే భగవంతునితో సమైక్యము మనకు సాధ్యపడుతుంది.

(అందు కొరకు) అంతరమున నివసించుతూ, బాహ్య పరిస్థితులకు చలింపకుము.

మనము ఎలా ఉండాలని భగవంతుడు కోరుతున్నాడో, అలా వుంటూ, తత్స్వరూపముగా రూపొందడమే మన జీవితానికి అతిముఖ్య తాత్పర్యము కావాలి !"

ఒక సందర్భములో శ్రీ తల్లిగారు నుడివిన భావమును క్లుప్తగా తెలుపుదును. "ప్రపంచమును సత్యమార్గమున వర్తింప ఉత్తరవు చేసినచో అనగా, ఒక చిటికెలో అద్భుతములు వలన పనులు జరిగినచో సృష్టికి అర్థముండదు. సృష్టిలీల అదియొక దీర్ఘ ప్రయాణము. కాలప్రవాహములో అనంతాకాశములో మెట్టుమెట్టు పైకి పోవలెను. అది తన మూలమునుండి దూరముగాపోవు ప్రయాణము. కానీ తిరిగి మూలమునకు చేరు ప్రయాణముకూడ. సృష్టియొక్క సూత్రము ప్రణాళిక యిదియే. దీనిలో బలవంతమేమియునులేదు. బాహ్య ఉత్తర్వులను అనుసరించవలసిన అవసరములేదు. అట్టి బలవంతము సృష్టియొక్క పల్లవిని చెడ

గొట్టును. ఆసత్యము ప్రస్తుతముపై భూమికలలో పనిచేయుచున్నది. అది కాలాతీతావస్థ యందున్నది. కాలాతీతావస్థనుండి కాలగర్భములోనికి తెచ్చుటయే నాపని. నేను తీసుకరానున్న సత్యము పృథివిపై దేహావస్తువు యందు కలుగును. ఆ సత్యము అప్పుడే పూర్తిగా అభివ్యక్తమై నిలువ ద్రొక్కుకొని యున్నది.

సర్వ శక్తివంతమైన ఈసత్యమును, ఎందుకు ప్రపంచము గుర్తించదు. మానవుడేల తన మంచిని గుర్తించని స్థితినుంచి బలవంతముగా ఏల దీనిని ఒప్పుకొనునట్లు చేయలేదు అన్న ప్రశ్నకలుగవచ్చును. కాని ప్రపంచము ఆ విధముగా సృష్టింపబడలేదు. ఆ విధముగా పెరిగి పెద్ద యగుటలేదు. నేను తీసుకు రానున్న సత్యము ప్రపంచముయొక్క శక్తి సామర్థ్యములుపైన దాని ఇష్టముపైన ఆధారపడియున్నది. అనగా ఆ నూతన చైతన్యమును గుర్తించలేని చైతన్యమునకు ఈ సత్యముయొక్క అస్థిత్వము తెలియదు. అట్టివారు ఈ నూతన చైతన్యమువలన ఏకొంచెమైననూ లాభమును పొంద జాలరు. కాని సత్యము అభివ్యక్తమగు పరిణామములో యున్నది. చూచుటకు కన్నులు వుండవలెను. దానికి స్వాగత మిచ్చుటకు ఆత్మస్థితి వుండవలెను. దైవ కృప దానికి సహకరించు శరీరముల యందు పనిచేయును. వారే చిత్ శక్తిలో ఏకీభావము పొందుదురు.

పృథ్వీ—చైతన్య పరిణామమందు అతీత మానస రూపాంతరము ఆ పరాత్పరునిచే విధింపబడినది. తప్పని సరియైనది. ఏలన దాని ఊర్ధ్వ గమనమింకను సమాప్తము కాలేదు; మనస్సు ఆ పరిణామము యొక్క సర్వోన్నత శిఖరము కాదు. ఆ దివ్యతేజ మవతరించినపుడు దానిని నిరాకరించకగుర్తించు గాడేచ్ఛ తీవ్రాకాంక్ష నిమ్నసత్త యందుండవలయును; ఇట్టి తీవ్రా కాంక్షకును అనుమతికిని నడుమ మధ్యవర్తిత్వ మొనర్చునది

మాతృశ్రీ వారి దివ్యమూర్తి శక్తులు, ద్వారము భేదించి, పొరలు పటా పంచములుచేసి, పాత్రను రూపొందించి, ఈ అజ్ఞానాన్నృత మృత్యు ప్రపంచములోనికి సత్యతేజో దివ్య జీవిత మరానందములను తేగలిగినది మాతృశ్రీ శక్తిమాత్రమే; కాని ఏ మానవ ప్రయత్నములు తపస్సులు వీనిని సాధించజాలవు.

# శ్రీ అరవింద లేఖలు

"ఎవడు అతిమానవుడు ? జడద్రవ్యమునే నిరీక్షించుతూ ఉండే, పరిచ్ఛిన్నమగు మనోమయ మానవ పిండ భావమును దిగవిడిచి ఎవడు పైకెగయునో. వాడు అతిమానవుడు. అట్లు అతిశయించి, ఎవడు విశ్వతాదాత్మ్యమును పొందిన ఆత్మభావమును కలిగియుండునో, దివ్యశక్తిలో, దివ్య ప్రేమానందములో, దివ్యజ్ఞానములో దైవభావమును కూడి పొందియుండునో, వాడు అతిమానవుడు.

"నీవు నీపరిమిత అహంను భద్రపరచుకుని, అతిమానవుడననిఅనుకుంటే, నీ స్వాభిమానము కల్పించిన మూఢుడవే అగుదువు, నీ అహంశక్తికి ఆటవస్తువే అగుదువు. నీ భ్రాంతి జాలమునకు సాధన భూతుడవే అగుదువు.

శ్రీ అరవిందుడు,

24–11–1957

"క్రమమును తారుమారు గావించి, గుర్రానికి ముందు బండిని పెడుతున్నావు. నాకు కావలసినది నాకు లభిస్తే విధేయుడనై ఉల్లాసముగా ఉంటాను—అని నిబంధన విధించడం సరియైన మార్గముకాదు. నీవు చేయవలసిదేమంటే, సదా విధేయుడవై ఉల్లాసముగా ఉండు; అపుడు నీకు కావలసినది నీకు లభించడానికి అవకాశమేర్పడుతుంది.

"అట్టి సంఘటనను ఆత్మవిజయానికి లంభించిన సదావకాశముగానే సదా గావించుకోవాలి ! ఆవేశాలు నన్ను వశము చేసుకోగూడదు, అవే నా వశవర్తులై ఉండాలి ! — అనే ధీరభావమునందే ఆత్మాభిమానమును, ఆత్మ ప్రతిష్టను పెంచుకొనుము.

"నీవు భ్రమపడుతున్నావు :- పారిశుద్ధ్య వాతావరణము పరమేశ్వరుడు ప్రసాదించిన కానుక గాదు, అది మానవ నిర్మాణమే. అలాగే

కోపాది ప్రాణమయ కల్లోలాలు కూడ దైవదత్తాలు కాదు, అవర ప్రకృతి యొక్క క్రీడా వినోదాలు మాత్రమే.

"నీవు భగవంతుని చేరుకొన్నప్పుడు, ఆంతరంగికముగా ఆయన పైననే ఆనుకొని నిలబడుము. దీనికి ఇతర విషయములు బాధ కలిగించ కుండునట్లు చూచుకొనుము.

"అన్ని దోషములూ, అన్ని పొరపాట్లూ పశ్చాత్తాపముచేత తీరి పోవును. అమ్మయందు విశ్వాసము, అమ్మకు ఆత్మనివేదనము - వీటిని నీవు పెంపొందించుకుంటే, అవియే నీ ప్రకృతి యందు పరిణామమును గొనివచ్చును."

5–7–1957

గమనిక :- మన జీవితములో అన్ని సందర్భాలూ మనం ఆశించి నట్లుగ అనుకూలించవు. మన ఆశలు భంగమైనప్పుడు, దిగులు చెంది అధైర్యపడతాము. బహుశః ఆ ఆశాభంగమునకు చివరకు వుపకారమవు తుందేమో అనే యోచనకూడా ఉండదు. మన పంచ ప్రాణాలూ ఒకదాని మీద పెట్టుకుని, దాని సిద్ధికొరకు పెనుగులాడుతాము. అది సిద్ధించకపోయే టప్పటికి ఎందుకూ కొరగానివలె చతికిల పడతాం. మన భవితవ్యం మీద మనకు విశ్వాసం లేకపోవడంవల్ల, ఇట్లా తటస్థిస్తూ వుంటుంది. సామా న్యంగా లోకం వాంఛించే అధికారం, ధనం, కీర్తి, గౌరవం నీ జీవితంలో సమకూడితే, నీవు అన్యథా ఆలోచించవు. అదృష్టవంతుడనని సంతృప్తి పడతావు. అవి సిద్ధించక దారిద్ర్యం, లోకం వెక్కిరించడం, శాసనం దండించడం. దేశాంతర ప్రవాసం, బంధుమిత్రుల వియోగం మొదలైనవి సంప్రాప్తిస్తే - దురదృష్టవంతుడవైనట్లు, లోకానికి నీవుపయోగ పడనట్లు చింతిస్తావు. ఎందుచేత ? బజారు కొలతలను ప్రమాణంగా తీసుకోవడం వల్ల, కనుక ఇతరుల కొలతలు నీకు ప్రమాణంకావు. నీ కొలత నీదే.

నిన్ను నీవు లోకానికి నివేదించుకో తలచుకొంటే, ఆ నివేదన నీ యిచ్ఛ ప్రకారం జరగాలని అనుకొన్నావా, అది నిజంగా నివేదన కాదు. అది నీ అహంకారాన్ని బలపరచుకొన్నట్లే అవుతుంది. ఆత్మనివేదనంటే, నీ యిచ్ఛను వదులుకోవడమన్నమాట. విధాత నిన్నెట్లా ఉపయోగించుకొనునో, దానికి పూర్తిగ లోబడితేనే నీ ఆత్మార్పణం సార్థకం. ప్రకృతి నిన్ను రాజ్యాధికారిణిగ జేయవచ్చు. లేదా అజ్ఞాతవాసంలో బడవేసి ఇడుముల గుండ ఈడ్వవచ్చు. కఠిన మార్గమే నీకు దైవం నిర్ణయించిన జీవితమని సంతృప్తి పడక, పైగా దైవాన్ని దూషిస్తావు. లోకంకూడ నీయెడల నిర్దయగా ఉన్నట్లు నెపమెంచుతావు. బహుశా నా పూర్వజన్మలో ఏదో పాపం చేసుకొన్నానని అందుకని ఈ జన్మలో ఇట్లా అనుభవిస్తున్నానని, పరితపిస్తావు. ఎట్లా అనుకొన్నా, ఈ తలంపులు నిన్ను నిజంగా ఉద్ధరించగలవి కావు. నీ జీవితాన్ని సఫలపరచేది ఈ బాహ్య వ్యవస్థలు కావు. నీకు విధింపబడ్డ కర్మ క్షేత్రంలో నీవు చూపే ధైర్య నిగ్రహాలు, శాంత్యానందాలు ప్రధానంగావాలి. నీవుపయోగపడవలసింది లోకానికైనా, నీ విలువను నిర్ణయించేది లోకంకాదు. ప్రతివాని జీవితం వెనుకా దైవ సంకల్పం ఉన్నది. నీ జీవితంలో నీవెంత వరకు ఆ భగవదిచ్ఛను గుర్తించి తదనుగుణముగ ప్రవర్తిస్తున్నావో వినమ్రుడవై యోచించుకో, నీలోని చక్షువు తెరచుకొని, జగన్నాటక సూత్రధారుని జాడలని కనిపెట్టగలదు. అప్పుడే నీ జన్మ ధన్యం. నీ ఆత్మ సమర్పణం యథార్థం.

సంపూర్ణము.

# అనుభవం అంటే ఏమిటి ?

మన జీవితం భూత కాలంలోనూ ఉన్నది. వర్తమానములోనూ ఉన్నది. భవిషత్తులోనూ ఉంటుంది. అదో ప్రవాహం దాని లోతుపాతులు తెలియక పోవచ్చు. అనుభవాలంటే మనఇంద్రియ వ్యాపారాలు, చిత్తవృత్తులు కావు. మన జీవితం సమకూర్చుకొని పోతూండే సంఘటనా పరంపరలు కావు. అవి ఆత్మగతములైనపుడే అనుభవాలగుతాయి. ఆత్మగతం కానంత వరకూ, అవి మన వశంలో ఉండక మన చిత్త విక్షేపమునకు గారణభూతములై, జీవితాన్ని అధోగతికి ఈడ్చుకొని పోతూంటాయి.

సర్వ సాధారణముగ మనకు కనబడు ముఖ్య దోషమేమన మనస్సు, ఆత్మ రెండు ఒక్కటేయని వ్యవహరిస్తూ వుండుట వాటి పరిశీలన సరిగా అర్థం చేసుకుంటే మనస్సు, ఆత్మ వేర్వేరు వస్తువులని తెలుస్తుంది. ఇంద్రియములవలె కాని, మనస్సువలెకాని గ్రహింపనవసరం లేకయే తెలుసుకొనగల చేతస్సు మాత్రమే ఆత్మయని తెలియవలయును. ఏలన ఆత్మకు కలుగు జ్ఞానమంతయు స్వయం ప్రకాశము – ప్రత్యక్షానుభవముచే కలుగునది.

కాని మనం సర్వం లౌకికంగాచూస్తాం, అంటే, దృశ్యాన్ని ద్రష్టకు బాహ్యమైనదిగ, విషయాన్ని విషయిక వ్యతిరిక్తమైనదిగ, నామరూపాలను అనాత్మగా చూడడంవల్ల, మన జీవితం అనుభవశూన్యమై పోయింది. ఎప్పుడు మన చుట్టూ మూగే సంస్కారాలను మనవిగా గుర్తించుకొని మన చిత్తంలో లీనం చేసుకోగలుగుతామో, అప్పుడే అవి మనవగుతాయి. అంటే అనుభవాలగుతాయన్న మాట. అవి మనవి కానంతవరకూ అవి బాహ్య సంస్కారులుగ వుండి మన జీవితాన్ని అర్థవిహీనంగాను దుర్భరంగాను చేస్తాయి. సర్వాన్నీ మన హృదయంతో చూడడం నేర్చుకోవాలి. అప్పుడు మనకేది బాహ్యంకాదు. అనాత్మ కూడ ఆత్మ అయిపోతుంది. జీవితం రసభరితమగును. అనుభవములో అంత సత్తా వున్నది.

సంసారం క్రీడా భూమి అగుతుంది. అనుభవగతమైన జ్ఞానమే, సత్యమైన జ్ఞానం. అనుభవం సత్యాన్ని ముఖాముఖిని చూచేటట్టు చేయగలదు. దివ్యానుభూతి అన్నా, ఆత్మ సాక్షాత్కారమన్నా, రససిద్ధి అన్నా, అనన్య భక్తి అన్నా, ఒకటే—కావలసింది—అనుభవం.... అనుభవం.... అనుభవం.... మన శరీరాన్ని ఆత్మకు అనుకూలమైన సాధనంగా చేసుకోవాలి. శరీరానికి ఆత్మకూ గల భేదం సాత్విక సాధనవల్ల అంతకంతకు తగ్గిపోతే, మన శరీరానికి గూడ ఆత్మలక్షణా లలవడుతాయి. మన మనస్సులోని సౌమ్యత, ప్రసన్నత, భావసంశుద్ధి, శరీరంలో క్రమంగా ఫలించక తప్పవు.—

# అతీత మానస అవతార మూర్తులు

చక్కా సత్యనారాయణ

(1) ఎచట జగములకునెల్ల బూజ్యురాలైన జగన్మాత సౌమ్య
మానుషాకృతినుండునో నచట యోగీశ్వరుండగు శ్రీ అరవింద
విభూతి జయమ్ములందు ప్రాకృతములగు నేత్రములచేత
గానలేము దివ్యనేత్రంబుచేత నాభవ్యవిభూతి చూడగలము.

(2) ఏకసూర్యుడు జగములనెల్ల నెట్లు
వెలుగజేయునో యట్టు లే వెలుగ జేయు
దేహములనెల్ల ఆ అతీత మానససృష్టిలో వెలుగజేయు
శాశ్వతుండగు నాపరమేశ్వరుండగు శ్రీ అరవిందుడు.

(3) జ్యోతులకు జ్యోతినొసగెడు జ్యోతియిద్ది
ఇది తెలిసి కనుగొని పొందగలుగుటయే
పరమ పదంబని వృథమనుచు నామది తెలుపుచుండె
అఖిల హృదయస్థితంబయి యలరునిద్ది.

(4) ప్రాకృతములగు కన్నులార జననిని జూడంగ నద్భుత
మైనట్టి ఆమె సౌమ్యదేహమ్ముచేత వెలుగు దివ్యకాంతి
ని జూచుచున్నారు ప్రజలు నాయోగిర్వాణిని జూచువారలకు
చిత్తము స్వస్థమై హాయిగొల్పుచు దెలివియును దేట బుద్ధికి
గలుగుచుండు.

(5) ధరణి సత్కార్యములను జగన్మాత
కొఱకు చేసి ఆమెగతియని సంగ
మ్ములన్నీ వదలి సర్వప్రాణులయం
దు మైత్రమ్ము మూడిగియుండు భక్తుడె సర్వశ్రేష్ఠుడు.

(6) కాయమునువంచి యిదిగో నీకాళ్ళబడెద
సర్వము నిండియుండెడు మాత నీవు
ముందు వెనుకనునంతట వందనములు వేనవేల్ వందనములు
వందనములు మరిమరి వందనములు.

## అతీత మానస శక్తి

(7) ఆకసంబునకు, భూమికి, నడుమ, అతీత మానసశక్తితో
కలుపుచుండె, నఖిలలోక మహేశ్వరుడైన, శ్రీ అరవిందుడు
గృపతోడ నఖిలభూతోపకారకురాలైన శ్రీ జగన్మాత
ఈ మార్గమును దేటతెల్లముగ దెలుపుచుండె.

(8) సంగమునువీడి ముక్తసంసారుడగుచు
చిత్తమును జగన్మాతయందు సుస్థిరము జేసి
కేవలము ఆశ్రమ క్రియలొనర్చువాని పనులెల్ల
యజ్ఞక్రియలై సులభముగ జ్ఞానమందె పరిణమించును.

(9) యత్నములమీద యత్నము లాచరించిన కారణమున
యోగమందలి కాంక్షచే లాగబడుచు కర్మ
ఫలముల యందలి కాంక్షమాని ఆశ్రమము
నందు కర్మల నాచరించు చుండును గర్మయోగి.

(10) యోగమ్మునందు మనశీలుడుగానుండు మునివరుండు
చిత్తము బరిశుద్ధమున్ జేయుకొఱకు మాని సంగమ్ము
బుద్ధిచే మనసు చేతనాత్మ దేహమ్ముచే నింద్రియములచేత
నిత్యముగ జగన్మాత నియమించిన నియతకర్మములను నాచరించుచు
యోగ సంసిద్ధి బడయగలడు.

(11) జ్ఞానమును గప్పియున్న యజ్ఞానమెల్ల
నించుకయులేక పూర్తిగా నశించునపుడు
నఖిలకర్మమ్ములు జగన్మాత కర్పణముగాగ
స్వచ్ఛమైనట్టి జ్ఞానమే సత్ఫలంబగును.

(12) జ్ఞాన కర్మేంద్రియములకు గానరాక మనసునకు
గూడ జిక్కక తనరుచుండు అతీత మానవశక్తి
కాని యంతరాత్మయందు జగన్మాతను అనుభవించుచున్న
వారే నిహపరంబుల కలుపుచున్నయా అతీత మానవశక్తిని
పొందగలరు.